# చతుర

సంపుటి:4 మార్చి:1981 సంచిక:2

## ఈ నెల సమగ్ర నవల

దాంపత్య జీవితంలో విధివంచితుడయాడు అతను...
అతను ఆఫీసరు...ఇద్దరు బిడ్డల తండ్రి...
వయసుమళ్ళిని పెద్దమనిషి.

వివాహం ఆవకముందే కఠిన సత్యాలను ఎదుర్కొని అతని పంచను చేరింది ఆమె...ఆమె అతని మరదలు...దారి చూపించి నిలద్రొక్కుకో గల నిబ్బరాన్ని కూడా అలవడజేశాడు అతనామెకు...

అతనికి స్టెనోగా వచ్చిన సౌందర్యరాసి ఆమె. 'భర్తృహీన అయినా పోషించ వలసిన పసివాడున్నాడు ఆమెకు...

ఈ ముగ్గురి మధ్యా నడచిన సంఘర్షణ, ఆత్మ సంఘర్షణ చివరికి ఏ విధంగా పరిణమించింది.'
ఎవరు ఎటువంటి




కి తలవంచారు. ఎవరి మనసుల్లోని మర్మాలు ఎలా బయటపడ్డాయి ?

### సత్యభామ

నవల 'రాజీ' ఈ నెల చతుర సమగ్ర నవల.



ముఖ చిత్రం : ఎ. ఆర్. ప్రసాద్

రెండవ కవరు : లేపాక్షి నాగేశ్వరుడు

మూడవ కవరు : లేపాక్షి కిన్నరుడు

ఫొటోలు : గీతాదత్త

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబంచే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతర్రతాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

# బూన్

## నీలి డిటర్జంట్ ఉతికే బిళ్ళ

## ఇతర సబ్బులకంటే ఉత్తమమైనది






అరుగుదలలో అల్పం
అసమాన్య మైన
తెల్లదనం.

మా బూన్ వినియోగదారులే మీకు చెప్తారు.




UHP యూనియన్ హోమ్, ప్రొడక్ట్స్
లిమిటెడ్, మంగుళూరు 575001

mpa/uhp/177

# చిక్కు ప్రశ్న

దొరగారు మహా సరసులు. కథలూ, కవిత్వమంటే ఎంత ఇష్టమో వేటంటే కూడా అంత ఇష్టం. సీజన్ బాగుండక పోవటం మూలాన్ని యింట్లోనే ఉండి పోవలసి వచ్చింది దొరగారికి. మిత్రులందరినీ పోగుచేసి కాలక్షేపం చేస్తున్నారు దొరగారు. కథలూ, కవితలున్నూ ఎవరికి తోచింది వాళ్ళు చెబుతున్నారు. అందరూ చాలా కులాసాగా ఉన్నారు. అయితే దొరగారి నౌకరు రంగయ్య



మాత్రం చప్పుడు చేయకుండా వింటూ కూర్చున్నాడు. దొరగారు వాడితో అన్నాడు—"ఏరా నువ్వూ ఏదయినా కథ చెప్పగలవా?". "ఇంతమంది పెద్దలమధ్య నేనేం చెప్పగలనండీ — నాకేం వచ్చు గనక?" వినయంగా జవాబిచ్చాడు రంగయ్య. "కథ మంచిదయినప్పుడు చెప్పే వారెవరన్నది ముఖ్యం కాదురా. ఏదో ఒకటి చెప్పు. మంచి కథచూసి" అన్నారు దొరగారు.

"నా కెక్కువ కథలేం రావయ్యా. అయినా నాకు తెలిసిన మొద్దబ్బాయి కథ చెపుతాను. వినండి. ఓసారి నేను బజారు నుంచి వస్తున్నాను. అపుడే మనఊరి మొద్దబ్బాయి ఎదురయ్యాడు. వాణ్ణి నేనో చిన్న ప్రశ్న అడిగాను. 'ఒరే అబ్బాయీ యీనా సంచీలో ఏమున్నాయో చెప్పితివా సంచీలో గుడ్లన్నీ నీకే ఇచ్చేస్తాను. చెప్ప

**చతుర**

గలవా?' అని. వాడు బిక్కమొహం వేశాడు. 'ఈ సంచీలో ఎన్ని గుడ్లున్నాయో చెప్పేస్తే యీ మొత్తం పది గుడ్లూ నీకే యిచ్చేస్తా'నన్నాను నేను మళ్ళీ. వాడన్నాడు - 'రంగయ్యన్నా. ఇదెక్కడన్నా సాధ్యమా? చూడనియ్యవు. మరి కనీసం సంచీ తాకనియ్యకనన్నా పోతివి. నీ సంచీలో ఏముందో నేనెలా చెప్పగలను?' అని. 'అయితే నేనింకో విషయం చెబుతాను. ఈ సంచీలోని వస్తువులున్నాయే డిప్పలేమో తెల్లగా ఉంటాయి. లోపలసొన పచ్చగుంటుంది. యిప్పుడయినా చెప్పగలవా?' అన్నాన్నేను. వాడేమో భుజాలెగరేసి 'మహా చిక్కు ప్రశ్నే. చెప్పలేను' అన్నాడండి. అదీ కథండి" రంగయ్య కథయిపోయింది. అందరూ గొల్లున నవ్వడం మొదలు పెట్టారు.

"భలే బాగుందిరా. యింతకీ నువ్వు చెప్పనేలేదు. నీ సంచీలో నిజంగా ఏం వస్తువులున్నాయి?" ప్రశ్నించారు దొరగారు.

అందరూ నవ్వడం మానేశారు.

—కె.వి. గోపాలం





# ఎక్నాలెడ్జ్‌మెంట్

పెళ్ళిళ్ళ సీజనొచ్చిందంటే అఖిలేశ్వరికి రక్తపోటు ఎక్కువయిందన్న మాటే! గుర్తున్న ప్రతివాళ్ళు ఓ శుభలేఖ పడేస్తారు. వెడితే ఓ గొడవ, వెళ్ళకపోతే నిష్ఠూరాలు. అందుకని సాధ్యమైనంత

## కతలు

తక్కువ ఖరీదు బహుమతి తీసుకుని, పిల్లల్తో సహా వెళ్ళి సుష్ఠుగా భోంచేసి వస్తూంటుంది. వాళ్ళాయన నెలలో ఇరవై తొమ్మిది రోజులు క్యాంపుల్లోనే తిరుగుతూ వుంటాడు. అఖిలేశ్వరి భయపడుతున్న పెళ్ళిళ్ళ సీజను రానే వచ్చింది. భర్త ఆఫీసులోపనిచేస్తున్నాయనకూతురి పెళ్ళని, స్వంత వూళ్ళో చేస్తున్నాం తప్పక రమ్మని పిల్చారు. పిల్లల్తో ఆ వూరు వెళ్ళి రావాలంటే బోలెంత తైలం వదులుంది. అందుకని ప్రెజెంటేషనే పోస్టులో పంపడానికి నిశ్చయించుకుంది. 'గిఫ్ట్ కార్నర్'కి వెళ్ళి మంచి ప్రెజెంటేషను చూపించమంది. షాపతను చూపెట్టినవన్నీ ఆమెకు ఎంతో ఖరీదుగా అనిపించాయి. ఉన్నట్టుండి ఆవిడ దృష్టి ఓమూలకి పెట్టివున్న నీలం పూల ఫ్లవర్ వాజ్ మీద పడింది. అది కనిపెట్టిన షాపతను "అది మొన్ననే కింద పడి నాలుగు ముక్కలై పోయింది. ఊరికే 'షో'గా వుంటుందని ఆ మూల అలా జాగ్రత్తగా నిలబెట్టాం" అన్నాడు.

"నాకు అదే కావాలి. ఎంత కమ్మి తావు" అనడిగింది అక్కడున్న స్టూలు మీద చతికిలబడుతూ.

షాపువాడు ఆశ్చర్యంలోంచి తేరుకోడానికి రెండు నిమిషాలు తీసుకుని "మీకు తోచినంత ఇవ్వండి" అన్నాడు.

"సరే దాన్ని చక్కగా గిఫ్ట్‌పాక్ చేసి ఇవ్వండి" అని డబ్బు చెల్లించి ఫ్లవర్ వాజ్ వున్న అట్టపెట్టె తీసుకుని తర్వాత దాన్ని పోస్టులో పంపి "హమ్మయ్య డబ్బు కల్సి వచ్చింది. లేకపోతే ప్రెజెంటేషను పోస్టల్ చార్జీలు కలిపి తడిసి మోపెడయ్యేవి. దార్లో విరిగిపోయిందనుకుంటారు" అనుకుని స్థిమిత పడింది.

వారం తిరక్కుండానే పోస్ట్‌మాన్



ఎక్నాలెడ్జ్‌మెంటు రసీదు తెచ్చి పడేశాడు. దాంట్లో చివర "మీ బహుమతి అందింది. చాలా సంతోషం. మీరు ఎంతో కళాత్మకంగా ఫ్లవర్ వాజ్ నాలుగు ముక్కల్నీ విడివిడిగా పాక్ చేయించి అట్టపెట్టెలో పెట్టిపంపడం చూసి మా అమ్మాయి, అల్లుడు అమితంగా సంతోషించారు" అని రాసుంది.

—లక్ష్మి

## షోర్ డెలివరి

డిపార్ట్‌మెంటల్ స్టోర్ చాలా రద్దీగా వుంది.

అక్కడ స్వెట్టర్ల విభాగంలో స్వెట్టర్లకి చాలా గిరాకీగా వుంది.

క్లర్కు చాలా బిజీగా వున్నాడు. రకరకాల ప్రశ్నల్తో అతన్ని వేధిస్తున్నారు కస్టమర్లు.

షోకేసులో పెట్టిన స్వెట్టర్ డిజైను కేసి దాదాపు అరగంటనించి చూస్తున్నాడు కృష్ణమూర్తి. అతనికి చాలా నచ్చిందది. జేబులో డబ్బుకూడా సరిపోతుంది.

మెల్లగా లోనికెళ్ళేడు.

క్లర్కు చుట్టూ జనం.

ఒకసారడిగేడు.. వినిపించుకోలేదు అతను. మళ్ళీ వీలుచూసుకుని అడిగేడు.

అదే సమయంలో ఫోను గణగణ మంది.

మూడోసారి మళ్ళీ అడిగేడు.

మళ్ళీ ఫోను.

అరగంట...ముప్పావు గంట...నిలబడి కాళ్ళు నొప్పెట్టేయి కృష్ణమూర్తికి.

క్లర్కు ఇంకా హడావిడిగా వున్నాడు. పోయిన వాళ్ళు పోగా కొత్తవాళ్ళొస్తున్నారు. వాళ్ళకి సమాధానాలు చెప్తూ ఎడాపెడా మోగుతున్న ఫోన్‌కాల్స్ రిసీవ్ చేసుకుంటూ, బిల్స్ రాస్తూ అన్నిట్నీ గమనిస్తూ సవ్యసాచిలా పన్చేస్తున్నాడు క్లర్కు.

కృష్ణమూర్తి మెదళ్ళో ఏదో తళుక్కుమంది. గబగబా స్టోర్లోంచి బైటికొచ్చి పక్కనేవున్న మెడికల్ షాపు అతన్ని రిక్వెస్ట్ చేసి ఫోనందుకొని నంబర్ డైల్ చేసేడు.

"హలో" అవతల్నుంచి వినిపించింది.

"హలో ! మిస్టర్ షోకేస్‌లో వున్న బ్లూకలర్ స్వెటర్ నాకు పంపగలరా ?"

"అలాగే. మీ ఎడ్రస్ చెప్పండి"



"మీరా స్వెటర్ బాయ్ చేత పంపండి. నేను మీ షాపు పక్కనేవున్న మెడికల్ స్టోర్ దగ్గర అతన్ని రిసీవ్‌చేసుకుంటాను" అని ఫోన్ పెట్టేసి ఐదు నిమిషాలు పోయాక అదే స్వెటర్ తీసుకొస్తున్న బాయ్‌ని దూరంగా చూసి విజిల్ వేసేడు కృష్ణమూర్తి.

## ఆఖరి ప్రశ్న

మాతంగరావు కోర్టులో విడాకులకోసం కేసు పెట్టేడు. తన భార్య గత నాలుగేళ్ళుగా పిచ్చాసుపత్రిలో చికిత్స పొందుతోందని, ఆమెకు నయమయ్యే సూచనలేమీ లేవని, కాబట్టి విడాకులు మంజూరు చేయించవల్సిందని కోర్టువారి దివ్య సముఖానికి అపీలు చేసుకున్నాడు.

అతనికి వ్యతిరేకంగా అతని మామగారు దూర్వాసరావుగారు తన కూతురికి

నయమైందనీ, కానీ తండ్రీకొడుకులు కుమ్మక్కయి కూతుర్ని పిచ్చిదానికింద జమకడుతున్నారనీ కేసు పెట్టేడు న్యాయం కోసం. కోర్టువారు ఇద్దరి వాదనలు విని ఆమెని పరీక్షించడానికి నిశ్చయించి ఓ రోజు ఫిక్స్ చేసేరు.

ఆ రోజు మాతంగరావు మావగారు కూతుర్ని తీసుకుని కోర్టుకొచ్చేడు. ఆమెకి ఇరవై ఎనిమిదేళ్లుంటాయి. పిచ్చి వాలకం ఎక్కడా లేదు.

జడ్జిగారు కళ్ళజోడు సవరించుకుని ఆమెని ప్రశ్నించడం మొదలెట్టేరు.

"నీ పేరు"

"జయమాలినీ మాతంగరావు", తడబడకుండా చెప్పింది.

"మీ నాన్నగారి పేరు"

"దూర్వాసరావు"

కోర్టువారు మాతంగరావుని చూపించి "ఈయన్ని గుర్తు పట్టగలరా" అనడిగేరు.

సిగ్గుపడుతూ "మా వారు" అంది.

జడ్జి విస్తుపోయి మరికొన్ని ప్రశ్నలడిగేరు.

అన్నిటికీ సంతృప్తికరంగా జవాబు ఇచ్చిందామె.

చివరిగా ఓ ప్రశ్న అడిగి కేసు కొట్టేద్దామని అనుకున్నారు.

"మిసెస్ జయమాలినీ మాతంగరావ్! ప్రస్తుతం మీరెక్కడున్నారో చెప్పగలరా"

ఆమె జవాబివ్వలేదు.

అందరూ ఆత్రంగా చూస్తున్నారు. జడ్జి అదే ప్రశ్న రెట్టించాడు.

జవాబివ్వకుండా కోర్టంతట్నీ కలయజూచిందామె. మళ్ళీ అడిగేరు జడ్జిగారు.



కాస్సేపాగి కూడబలుక్కున్నట్టు అంది - "పిచ్చాసుపత్రిలో వున్నాను".

# ఎనిమిది!

మలక్‌పేటలో కనబడ్డాడు రేస్ప్రలావ్. పందెపుగుర్రంలా వగురుస్తున్నాడు.

"ఏమైందోయ్? ఊర్నించెప్పుడు తిరిగొచ్చేవ్?" అడిగేను.

"చెప్తా! చెప్తా! ముందీ తమాషా చూడు. కోఇన్సిడెన్సంటే ఇదే కామోను ఇవాళ తేదీ ఎంత?

"ఎనిమిది"

"నెల"

"ఆగస్టు"

"అంటే ఎనిమిదవ నెల. అంతేనా?"

"అవును"

"గోదావరి ఎక్స్‌ప్రెస్ కరెక్టుగా ఎనిమిదింటికొచ్చింది స్టేషనుకి. నా సామాన్లు పట్టుకున్న కూలీనెంబరు కూడా ఎనిమిది. మరో ముఖ్య విశేషం ఇవాళ రేసులు మొదలై ఎనిమిదో రోజు. నేను

పందెం కట్టిన గుర్రం నెంబరు కూడా ఎనిమిదే..." ఊపిరి పీల్చుకోడానికి కొంచెం ఆగేడు.

"ఓహో గెలిచిందా ?" అడిగేను ఆత్రంగా.

"అదే బాడ్‌లక్ భాయ్! అది కూడా ఎనిమిదో స్థానంలోనే వచ్చింది" దిగాలుగా అన్నాడు రేసుల్రావ్.

# ఎదురుదెబ్బ

అరగంట నుంచి లాయరు సుబ్రమణ్యం ఆమెచేత నిజాన్ని రాబట్టేందుకు విశ్వ ప్రయత్నం చేస్తున్నాడు. ఆమె కూడా లాయరు క్రాస్ ఎగ్జామినేషన్‌కు లొంగడం లేదు.

చివరికి ఆమె వ్యక్తిగత విషయాలని అడిగి ఆవిడ్ని ఇబ్బంది పెట్టాలనుకున్నాడు.

"మేడం! మీరేమనుకోకపోతే మీ వ్యక్తిగత విషయాలు కొన్ని అడగాల్సుంది"

"ఫర్వాలేదు అడగండి" శాంతంగానే జవాబిచ్చిందామె.

"మీ ఆయన దొంగతనాలు చేస్తాడని మీకు తెలుసా?"

"తెలుసు"

"మీ పెళ్ళికి ముందే ఆ విషయం తెలుసా?"

"ఆహా! నిక్షేపంగా తెలుసు"

"మరి ఎలా పెళ్ళాడేరు?"

"నా పూర్తి అంగీకారంతోనే పెళ్ళి చేసుకున్నాను"

"అదే! ఎందుకటువంటి నిర్ణయం తీసుకున్నారు?"

"మా వాళ్ళకి నేనొక్కదాన్నే కూతుర్ని. నా కోసం మావాళ్ళు సంబంధాలు చూడ్డం మొదలెట్టేరు. కానీ చాలా సంబంధాలు తప్పిపోయేయి. ఏవో కారణాలవల్ల"

"అయితే"

"చివరికి రెండే రెండు సంబంధాలు వచ్చేయి. ఒకటి మా ఆయన సంబంధం.



అంటే దొంగ పెళ్ళికొడుకుదన్న మాట. కానీ మా నాన్నగారు రెండో సంబంధం కన్నా ఇదే వెయ్యిరెట్లు నయమనీ, ఈ సంబంధమే నాకు తగినదనీ చెప్పి నిశ్చయం చేసేరు. నాకూ నచ్చింది"

"అదేం" ఆశ్చర్యంగా అడిగేడు సుబ్రమణ్యం – "రెండో సంబంధం తాలూకు వ్యక్తి ఏంచేస్తూ వుంటాడు?"

"అతను లాయర్" నెమ్మదిగా అందామె.

—కల్యాణ్

'రామకృష్ణ బీచ్' దగ్గర, యూనివర్శిటీ వైపు నుంచొచ్చిన సిటీ బస్సులోంచి దిగింది రాజేశ్వరి. ఆమె వెనకే ఒక యువకుడు దిగడం చూశాడు రాజారావు.

'అతను' బస్సు దిగ్గానే రాజేశ్వరి చేతి కోసం లాగ తన చెయ్యి జాపేడు. రాజేశ్వరి చెయ్యి అందించలేదు.

రాజారావు స్కూటర్ స్టార్ట్ చేసిన చప్పుడుకి వాళ్ళిద్దరూ యిటు తిరిగారు. రాజేశ్వరి మొహంలో చిరునవ్వు క్షణకాలం మాయమై, మళ్ళీ అంతలోనే వచ్చేసింది.

వాళ్లు రాజారావుకి చాలా దగ్గర్లోనే వున్నారు. అయినా రాజేశ్వరి చిన్న పరుగుతో అతన్ని చేరింది. అటు తిరిగి, 'రా' అన్నట్టు సంజ్ఞ చెయ్యడంతో 'అతను' భయపడుతున్నవాడిలా, రాజారావును చేరాడు. రాజారావు స్కూటర్ ఇంజిన్ని ఆపాడు.

"రామక్రిష్ణగారు" అంది రాజేశ్వరి, "టెలిఫోన్ ఎక్స్ఛేంజ్‌లో పని చేస్తున్నారు".

"గ్లాట్టు సీయు" అన్నాడు రాజారావు.

"మా బావగారని చెప్పానే రాజారావుగారు ఈయనే.......డిపార్ట్‌మెంటులో అసిస్టెంట్ డైరక్టర్‌గా వున్నారిక్కడ. వరసకి బావగారే అయినా, నాకు తల్లీ, తండ్రీ, దేవుడూ ఆయనే."

నోటితో నమస్కారం చెప్పి కుడి చేతిని పిరిగ్గా జాపేడు రామకృష్ణ. రాజారావే చొరవగా అందుకుని 'షేక్' చేసేడు. ఆ చేతిలోని స్తబ్ధతవల్ల, ఆ మొహంలో తనకగుపించిన పలాయన భావంవల్ల రాజారావుకి అతనిమీద గౌరవ భావం కలగలేదు.

"అచ్ఛా! హావె గుడ్ టైం. నేను వెళ్తొస్తాను!" అన్నాడు ముందుగా సముద్రం వైపూ, ఆ తరువాత రోడ్డు వైపూ చూపించి.

"రామకృష్ణగారు బాగా పాడుతారు బావగారూ, మీరూ కాసేపు వుండరాదూ?"

"నో నో, నాకేం రాదం[illegible] తను ఊరికే అలా అంటుందంతే"

తను బీచ్‌లో అతనితో కొంతసేపు గడపబోతోంది. అందులో ఏదో తప్పుందని అనిపించకుండా ఇందులో స్నేహం, గాన తృష్ణా తప్ప మరేం లేదని అనిపించడం కోసం రాజేశ్వరి తనని కూడా వుండమంటోంది. రామకృష్ణ తనకేం రాదంటున్నాడు. అంటే వినడానికి వీలైందేదీలేదనీ, తనని వెళ్ళిపొమ్మనీ అంటున్నాడా—అనుకున్నాడు రాజారావు.

"పోన్లెండి ఇంకోసారి పాడొచ్చు. ఓసారి మనింటికి తీసుకురా రాజీ"

అలాగే అన్నట్టు తల వూపింది రాజీ.

"ఏ మి టి పాడుతారు మీరు ? క్లాసికలా ?"

"అబ్బే, నాకేం రాదండీ. తను ఊరికే అలా అంటుందంతే"

"లేదు బావగారూ, నిజంగానే బాగా పాడతారు. క్లాసికల్ కాదుగాని బాగానే పాడతారు. ఎప్పుడో యెందుకు? ఇప్పుడే విందురుగాని రండి" అని సముద్రం వైపు దారితీసింది రాజీ.

"అది కాదు సార్. నాకు బజార్లో పనుంది. పదంటే పది నిమిషాలు ఇక్కడ కూర్చుందాం అన్న కండిషన్ మీద వచ్చేను" అన్నాడు రామకృష్ణ.

"పోనీ, ఆ పది నిమిషాలే పాడండి. పెద్ద కాన్సర్ట్ చెయ్యడానికి మీరు రామకృష్ణే గాని బాలమురళీకృష్ణ కాదుకదా" అని రాజారావు రాజేశ్వరి వెంట నడక




సాగించాడు. రామకృష్ణ నిస్సహాయంగా అతని వెంట నడిచాడు.

"రాత్రికి బయల్దేరి ఏలూరు వెళ్ళిపోతున్నాను కదా, అంచేత పరీక్షలెప్పుడో ఖచ్చితంగా తెలుసుకుందామని యూనివర్సిటీకి వెళ్ళాను బావగారూ! ఆయన కూడా బికాం. పరీక్షలెప్పుడవుతాయో కనుక్కుని ఎవరికో ఉత్తరం రాయాలని అందుకోసం వచ్చారిక్కడికి. బజార్లో పనుంది వెడతానన్నారు. నా కేమో మెస్సులో ఈ పూట భోజనమేగాని పనేమీ లేదు. అంచేత పది నిమిషాలు బీచ్‌లో కూర్చుని ఆనక ఎవరిదార్ని వారు వెడదాం అన్నాను. అలా, ఇక్కడ బస్సు దిగాం"

"దానికేముంది? పది నిమిషాలు కాకపోతే ఓ గంట కూర్చోవచ్చు... ఆగస్టు వెళిపోతున్నా ఈ దిక్కుమాలిన ఎండలు విశాఖపట్నాన్నింకా కాల్చుకు తింటూనే వున్నాయి. ఓ గంట బీచ్‌లో గడిపితేగాని నాలుగు రోజులు మళ్ళా మన అద్దె ఇళ్ళల్లో చీకటి గదుల్లో గడపడానికి తగిన ఆరోగ్యం సమకూరదు...అన్నట్టు రామకృష్ణగారూ! మీకు స్వంత ఇల్లుందా ఈ వూళ్ళో"

"ఉంది సార్"

—రాత్రికి రాజీ ఊరు విడిచి వెళ్ళిపోతోంది. పరీక్షలకి దీక్షగా చదువుకుందామని ఏలూరు వెడుతోంది.ఇరవైరోజుల వరకు రాదు. ఇది పార్టింగ్ విజిట్ అని తెలుస్తూనే వుంది. పాపం ఏం మాట్లాడుకుందామని వచ్చారో; మధ్యలో నేను అడ్డం తగిలాను; అని కొంచెం సేపు ఇబ్బందిపడి కూడా అడ్డం తగలడమే మంచిదని నిర్ణయించుకున్నాడు రాజారావు.

"ఇక్కడ కూచుందామా?"

"ఓ.కే." అని చతికిలబడ్డాడు రాజారావు. మామూలుగా గాక, చిన్నపిల్లాడు ఎక్కడినుంచో దూకినట్టు పడ్డాడు.

రాజీ నవ్వింది. ఒద్దికగా కూర్చుంటూ అంది– "చెప్పానుగా. మా బావగారు చాలా స్మార్ట్. ఆయన్ని చూసినవాళ్లెవరూ కూడా ఆయనో పెద్ద ఆఫీసరని గాని, ముప్ఫయ్యేడేళ్ళుంటాయని గాని అనుకోరు"

"ఏం పెద్ద ఆఫీసర్ని కాదండీ బాబూ! ఈ వూళ్ళోనే నా కిద్దరు హజ్‌బెండ్సు వున్నారు"

అప్పటికి రామకృష్ణ కూర్చున్నాడు.

"ఊఁ. మళ్ళా మీకు మార్కెట్లో పనుందన్నారు. మొదలెట్టండి. మీ కిష్టమైన పాట యేదన్నా సరే...నేనూ పది నిమిషాలుండి వెళ్ళిపోవాలి!" అని వాచీ చూశాడు రాజారావు.

"అబ్బె నాకేం రాదండీ, వూరికే..."

"ఇప్పటికామాట మూడు సార్లన్నారు" నవ్వాడు రాజారావు.

"అవన్నీ పాడేవాళ్ళకి మామూలేగా" అంది రాజీ.

"అలాని వూరుకోకుండా మళ్ళీ మళ్ళీ పాడండి సార్ అనడం వినేవాళ్ళకీ మామూలేగా" అన్నాడు రాజారావు.

"పదిసార్లు అడిగించుకున్నాక అద్భుతంగా పాడ్డంకూడా పాడేవాళ్ళకి మామూలేగా" అంది రాజీ.

"అయ్యా నమస్కారం, ఈ తానతందాన ఆపండి" అన్నాడు రామకృష్ణ.

"మీరు తదరిన్నన్నాం అంటేనే ఆపడం"

అతను బాగా పాడుతాడని రాజీ చెప్పడానికి కారణం అతని ఆవేశం

సగమూ, ఆమె అభిమానం సగమూ అని నిర్ణయించాడు రాజారావు. ఆ రెండు చిన్న పాటలూ అయిపోగానే హఠాత్తుగా రామకృష్ణ లేచాడు. "నేనెళ్తాను సార్, పనుంది."

రాజీ కూడా లేచింది "అప్పుడే వెళ్ళిపోతున్నారా?" అంటూ.

"పది నిమిషాలే అన్నావు; పన్నెండు నిమిషాలైంది" అని వాచీ తట్టి చూపించాడు రామకృష్ణ. "మరేమిట్రీ; రాత్రి నీ ప్రయాణం ఖాయమే కదా."

"టిక్కెట్ కొన్నాను. బెర్త్ రిజర్వ్ అయింది. ఇహ రైలు రాకపోతేనే ఆగడం."

"ఏమో! అనవసరం అనుకొంటున్నాను నేను. పరీక్షలు ఇరవై రోజులూ నెలా ఉందనగా ఎక్కడెక్కడి వాళ్ళూ ఇక్కడికొచ్చి చదువుతారు. నువ్వేమో ఈవూళ్ళో చదువవదని ఏలూరు పరుగెడుతున్నావు. ... ఏం సార్. నేనన్నది రైటేనా?"

"మా మెస్‌లో కూర్చుని చదవడం కన్నా సినిమా హాల్లో కూర్చుని చదువుకోవడం సుళువు!"

"అది మాత్రం నేనొప్పుకోను. నేనిప్పటిదాకా రాసిన పరీక్షలన్నిటికీ టెలిఫోన్ ఎక్స్‌ఛేంజ్‌లో కూర్చునే చదివేను. సరేలే. నీకు వెళ్ళాలనిపించింది, వెడుతున్నావ్. ఏదైనా మెటీరియల్ కావాలంటే ఫోన్ చెయ్యి. పంపిస్తాను. ఏలూర్లో బాలయ్యే పేరు గుర్తుంటుందిగా, అతనితో చెప్తే ఫోన్ ఇస్తాడు."

"బాలయ్యా అక్కరలేదు, గోలయ్యా అక్కరలేదు. ఏలూర్లో నా నేస్తం నాగమణి వుంది. తనూ ఈపరీక్షకే..."

కూర్చుని వుండే ఆ మాటలని బట్టి వాళ్ళ పరిచయపు లోతుల్ని, చనువు గాఢత్వాన్ని ఊహిస్తున్నాడు రాజారావు. ఔనంటే కాదన్న వరకు వచ్చింది.

"వస్తాన్సార్" అని వినిపించింది ఇంతలో.

"మంచిది" అంటూ రాజారావుజాపిన చెయ్యి అందుకోకుండానే వెళ్ళిపోయాడతను. రాజీ అతను వెళ్ళిన వేపు కొంతసేపు చూసి, అప్పుడు మళ్ళా కూర్చుంది.

'మీరిద్దరూ ఏదో మాట్లాడుకుందామని ఆయ త్తపడి ఈ అందమైన సాయంకాలం, ఈ సందడైన సముద్రతీరానికి చేరారు. పానకంలో పుడకలా నే నిక్కడ ప్రత్యక్షమై అంతా భగ్నం చేసినట్టున్నాను! సారీ! పోనీ, అలా కొంతదూరం దాకా వెళ్ళి అతన్ని రైలు స్టేషన్‌కైనా రమ్మను' అనే మాటల్ని రాజారావు గొంతులోనే బిగించేశాడు. ఆ సందర్భంగా ఓ నిమిషం పాటు మౌనం పాటించాడు. రాజీ ఆ నిమిషంలోనూ తన వేపు రెండు సార్లూ, రామకృష్ణ వెళ్ళిన వైపు మిగతా సేపంతనూ చూసినట్టు చూసి నిట్టూర్చాడు.

"టెలిఫోన్ ఎక్స్‌ఛేంజ్‌లో పని చేస్తున్నాడా?"

"ఊఁ! ఊఁ. అవును."

"ఏం పని?"

"ఆపరేటరే."

"అదేం?"

"బి. ఏ. తప్పినప్పుడెప్పుడో చేరాడు. ఇప్పుడు ఎం. ఏ. కూడా అయ్యాడు. సర్వీసైంది. ప్రొమోషన్ వస్తుందిట."

రాజారావు మళ్ళా ఓ నిమిషం పాటు వూరుకున్నాడు. తననీ, సముద్రాన్నీ మార్చి మార్చి చూస్తున్న రాజీ చూపుని

ఒకటి రెండు సార్లు వదిలేసి ఆ తరవాత దొరకబుచ్చుకుని మెల్లిగా అన్నాడు— "నా గొడవలన్నీ మీకెందుకు అనకండా నిజం చెబుతానంటే కొన్ని ప్రశ్నలడుగుతున్నాను రాజీ,"

అతనేం అడుగుతాడో స్ఫురించి రాజీకి గుండె గతుక్కుమంది. అయినా చిరునవ్వుతో "అడగండి. కాని జవాబులు ముందే నిర్ణయించినట్టుగా పాతాల్లోవి అడక్కండి" అంది.

"ఇంకేం? నేనేమీ అడక్కూడదని ముందే తేల్చేసేవు"

రాజీ అతన్ని ఓరకంట చూసి చీర కొంగు సర్దుకున్నట్టు నటించి సరిగ్గా కూచుంది.

"సరే, నీకు నా గురించి ఎలాంటి అభిప్రాయం వుందో నాకు పూర్తిగా తెలీదు. నేను నీకేం పాఠం చెప్పకూడదన్నావు. అంచేత నేను నీకు మేష్టార్ని కాదు. మేస్టరు కానివాడు హితబోధ చెయ్యొచ్చో లేదో నాకు తెలీదు. అయినా నీకు హితబోధ చెయ్యడానికి నేనెలాగూ సిద్ధం కాలేను. కాని, నీకూ మా కుటుంబానికీ వున్న పరిచయం వల్ల అలాంటి కోరిక పుట్టొచ్చు కదా. మేస్టర్ని కాను, గార్డియన్నీ కాను. కాని ఇందాక నువ్వే అన్నావు. తల్లీ దండ్రీ దేముడూ— అంటూనూ...ఏం- అంచేత..."

రాజీ చెయ్యి అడ్డం పెట్టింది. తన డొంక తిరుగుడు తనకే ఇబ్బందైనట్టు రాజారావు కూడా తెలుసుకున్నాడు. మరి సూటిగా అడగడానికి ఆ డొంకే అడ్డం వచ్చినట్టు తెలిసిందతనికి. అతను అనవసరంగా ఓసారి లైట్‌హవుస్ వైపు చూశాడు.

అక్కణ్నుంచి కిరణం ఏదీ ఇటు రాలేదు- ఆ క్షణంలో. కాని చూపు మార్చి ఆమె వైపు చూసేసరికి ఆమె ఒంటి మీద పడిన కాంతి పుంజంలో, ఆమెకూడా ఏదో ఇబ్బంది పడుతున్నట్టు కనబడింది.

"అతని పేరేమిటన్నావు?"

"రామకృష్ణ" అంది రాజీ దాహంతో గొంతెండిపోయినట్టు.

"ఊఁ-"

"వాళ్ళ నాన్నగారు తాసిల్దార్ చేసి రిటైరై మూడేళ్ళ కిందట పోయారు."

"తాసిల్దారా? బాగా సంపాదించుంటాడు."

రాజీ తల అడ్డంగా వూపింది. "ఆ రకం తాసిల్దార్ కాదు. అందుకేట, అతన్నెప్పుడూ తాలూకాఫీసుల్లోకాకుండా వేరే డ్యూటీల మీద వేస్తూ ఉండేవారట. ఓ చిన్న ఇల్లుంది దొండపర్తిలో. అంతే."

"ఒక్కడే కొడుకా, పోనీ?"

"పెద్ద కొడుకు."

"ఇంకా!"

"ఇతని తరవాత ఇద్దరూ అబ్బాయిలే. ఆ తరవాత అమ్మాయి"

"తల్లుందా?"

"ఆ. చాలా మంచావిడట."

రాజారావు దీర్ఘంగా నిట్టూర్చాడు, "తండ్రి రిటైరైపోయిన తాసిల్దారు. ఇల్లు తప్ప యింకేం లేదు. తల్లి, ఇంకా ముగ్గురు పిల్లలూనూ. అంతా చదువుకుంటున్నారు కాబోలు. ఇతగాడు పెద్ద కొడుకు. ఎమ్మేలో క్లాసొచ్చిందా?"

"లేదు-"

"మరి?" అని సిగరెట్టు పారేశాడు రాజారావు—ఆ అబ్బాయినే పారేసినట్టు.

"అది కాదు బావగారూ...!"

"ఏమో! నువ్వేం కొత్తగా నిన్ననో




మొన్ననో ఈడేరిన పిల్లవి కాదు. నీకూ ఇరవై మూడేళ్ళు వెళ్ళాయి. ఇలాంటి వాట్లో యెప్పుడూ కూడా, గోతిలో పడే దాకా ఎవరి సలహాకూడా బుర్రకెక్కదు. తీరా గోతిలో పడ్డాక, అయ్యో ఎవర్నయినా సలహా అయినా అడిగేం కాదే అనిపిస్తుంది."

"నేనేం గోతిలో పళ్ళేదు బావగారూ!" అంది రాజీ, నన్ను క్షమించండి అన్న ధోరణి విడవకుండానూ. అదే అందుకున్నాడు రాజారావు-

"నువ్వూ, ఈ రామకృష్ణగారూ మొన్న రాత్రి సెకండ్‌షోకి జగదంబాలో ఇంగ్లీషు సినిమా చూడ్డానికెళ్ళారు. అవునా?"

"ఔను" అన్నట్టు చూసి తల ఒంచుకుంది రాజీ.

"ఆ సినిమాకి, దురదృష్టవశాత్తు అదే ఆటకి నేనూ వచ్చాను. మీరిద్దరూ సరిగ్గా నాముందు వరసలో నా ముందే కూర్చున్నారు. తలలు వెనక్కి పక్కకీ తిప్పకుండా మీరిద్దరూ సినిమా ఎంజాయ్ చేసేరు. అయితే, సినిమా నీ కర్థమైందో లేదో నాకు తెలీదు గాని, అతనికిమాత్రం ఒక్క పిసరూ అర్థం కాలేదని నాకు తెలుసు."

'ఎలాగ?' అన్నట్టు చూసింది రాజీ.

"అతను సినిమా చూడాలనీ రాలేదు; చూళ్ళేదు కూడాను. అతను తెర మీద దృష్టి నిలిపింది ఆరెండున్నరగంటల్లోనూ ఏ పదిహేను నిమిషాలో వుంటుందంతే. మిగతా టైమంతా నిన్ను చూడ్డంతోనే సరిపోయిందతనికి."

రాజీ బిక్కచచ్చిపోయింది.

ఆరోజు సినిమాకి వాళ్ళిద్దరూ లేటుగా వెళ్ళేరు. మూలసీట్లు మూల సీట్లంటూ నెంబర్లు వేయించేడు. ట్లు అప్పటికే ఆరిపోయాయి. న్యూస్ రెవ్యూ కూడా అయిపోవచ్చింది. తడుముకుంటూ వెళ్ళి కూచున్నారు. మూల సీట్లో తనూ, తన పక్కని అతనూ. గట్టిగా చెప్పినా, మెత్తగా చెప్పినా, ఎన్నిసార్లెన్ని విధాల చెప్పినా రామకృష్ణగారు వినిపించుకోలేదు, పట్టించుకోలేదు. కుర్చీ మీదుగా తిప్పి, తన మీద చెయ్యి వెయ్యడానికతను చేసిన ప్రయత్నం యింతా అంతా కాదు... బావగారు అదంతా గమనించకుండా వుండుంటారా?... సరిగ్గా వెనక సీట్లోనే అంటున్నారు తనున్నది. ఇంకేముంది? ఆ 'భాగోతం' అంతా ఆయన కంటపడే వుంటుంది !

"సినిమా అయిపోయాక మీరిద్దరూ ఎక్కడికెళతారో, ఏం చేస్తారో తెలుసుకోవడం నాకవసరమూ లేదు; అలా నిఘా వేసి గమనించడానికి నాకు తీరుబాటూ లేదు. కాని, నేనెంత కాదనుకున్నా, సరిగ్గా నేను నీ చర్యలు గమనించగల అవకాశం వున్ననాడే నువ్వేమైనా కాలు జారిపోకుండా చూడ్డం నా ధర్మం అని నాకెందుకో గట్టిగా అనిపించింది. అంతకి ముందు నువ్వేమైనా అయిపోయి వుంటే అది నాకెలాగూ తెలియదనుకో. అయినా, అంతకి ముందు నువ్వేమీ అవలేదని, నీ ప్రవర్తన నాకొంత హామీ యివ్వడం వల్ల కూడా, నీ సంగతేమిటో కడాకూ కనిపెట్టదల్చుకున్నాను ఆ రాత్రి!"

రాజీ తల ఒంచుకు వింటోంది.

"అంచేత యింటర్‌వెల్లో మీరు పరిసరాలు గమనించుకోడం కోసం తలలు వెనక్కి తిప్పి చూస్తారేమోనని కాస్త

ముందుగానే బైటికి వెళ్ళిపోయి, మళ్ళా స్లయిడ్సు పూర్తయి లైట్స్ ఆఫ్ అయ్యాకనే లోపలికొచ్చి కూర్చున్నాను. సినిమా అయిపోయేటప్పుడు కూడా రెండు నిమిషాలు ముందుగా బైటికొచ్చి స్కూటర్ తీసుకున్నాను. మీరిద్దరూ థియేటర్‌లోంచి బయటపడికూడా చాలా సేపు గేటు దగ్గిర నిలబడి వుండిపోయారు (బహుశా ఏదెక్కాలో తేల్చుకోలేక). రిక్షాల వాళ్ళు, ఆటోల వాళ్ళు మీ చుట్టూ మూగడం, 'బేరం కుదరలేదు గురూ' అంటూ జోకులేసుకోడం నేను దూరన్నించి కనిపెడ్తూనే వున్నాను. చివరికి మీరిద్దరూ ఒక్క రిక్షాలోనే ఎక్కి..."

రాజారావు ఆగాడు.

రాజీ ఏమీ అనలేదు. పెదవి కొరుక్కుని ఇటువేపు లైట్‌హౌస్ పంపిన ఎర్ర కిరణంలో అతని మొహం ఓసారి చూసి తల దించుకుంది.

"ఒకే రిక్షాలో ఎక్కి మీరిద్దరూ వెళ్ళిపోగానే నాకు చాలా కష్టం కలిగింది. వెంటనే స్కూటర్‌తో మీ రిక్షాని దాటి, మీ కడ్డంపడి నిన్ను నాలుగు చివాట్లు



పెట్టి దింపేద్దామనుకున్నాను. ఆ సమయంలో నాకాపని చెయ్యడానికి ఏమీ హక్కు లేదని కూడా వెంటనే తట్టింది. నా దారిని నేనింటికి వెళ్ళిపోయి, శాంతతో ఈ సంగతంతా నిదరలేపి చెప్పి మనస్ఫూర్తిగా ఏడుద్దామని నా ప్రాణం విలవిల్లాడింది."

రాజీ తల అడ్డంగా ఆడించింది. రెండు చేతులూ జోడించింది. "నేను...నేను" అంది పూడుకుపోయిన గొంతుకతో.

"అవునుగాని, నాకు తెలీక అడుగుతాను, అతనికంత తొందరెందుకు?"

రాజీ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది. "బావగారూ! నన్ను నమ్మండి... నేనేం తప్పుపని చెయ్యలేదండీ" ఆ మాటలు ఆమె నోటివెంట రావడానికి పూర్తిగా నిమిషం సేపు పట్టింది. ఆమె ఉద్దేశం రాజారావుకి బోధపడింది.

"మర్యాదస్తుల కుటుంబంలోంచి వచ్చిన పిల్లతో అతను ప్రవర్తించవలసిన విధానం అదేనా అసలు? సినిమా హాల్లో అంతమంది జనం చుట్టూరా వున్నప్పుడే అతనంత కంట్రోల్ లేకుండా నిన్ను స్వంతం చేసుకోవాలని అంత ప్రయత్నం చేసేడే... అలాంటివాడు మూడు గంటల తాపం మనసులో నింపుకుని తనకని బేరం ఆడుకున్న రిక్షాలో రాత్రంతా సద్దుమణిగి జనసంచారం సన్నగిల్లిన



టైంలో నిన్ను ఏమి చెయ్యడు?... అతను నిన్నేం చెయ్యదలుచుకున్నాడో, ఎక్కడికి తీసికెడుతున్నాడో, అక్కణ్ణించి నువ్వు నీ మెస్సుకి తిరిగి వెళ్ళగలుగుతావో లేదో, వెడితేమాత్రం నువ్వు నువ్వుగా వెళ్ళగలుగుతావో లేదో అని నా మనస్సు నీ కోసం యాతన పడింది. అంచేత మీ రిక్షాని నా స్కూటర్‌తో వెంటపెట్టేను...అతను నిన్ను నీ అనుమతి లేకుండా ఏదైనా కాని చోటికి తీసుకెడితే అక్కడ హఠాత్తుగా కనబడదామని, నీ అనుమతితోనే ఒక చోటికి తీసుకెళ్ళినా అక్కడ మళ్ళా నీ అనుమతి లేకుండానో, అనుమతితోనో ఏదైనా కాని పని చేద్దామని ప్రయత్నిస్తే అప్పుడైనా అడ్డుకుందామని ఉరమరిగ్గా నా ప్లాను. దేనికీ నీ అనుమతి ఉండకపోవచ్చుననే నమ్మకమే నా బలం...రిక్షా సరిగ్గా నీ మెస్సు దగ్గిరే ఆగడం, అందులోంచి నువ్వు ఒక్కదానివే దిగడం, దిగీ దిగ్గానే లోపలికి వెళ్ళిపోవడం, ఒక్క నిమిషం మాత్రం ఆగి రిక్షా అతన్ని తీసుకుని వెళ్ళిపోవడం కొంచెం దూరం నించి గమనించి ఇంగ్లీషు సినిమా చూసినంత తేలికైన మనస్సుతో యింటికి వెళ్ళాను తెలుసునా?"

రాజీ 'థేంక్స్ బావగారూ, థేంక్స్!' అనుకుంది. ఆ రాత్రి పరీక్ష అంత కఠినంగా వుండి కూడా తనని తాను శుద్ధంగా, పూర్ణంగా సంరక్షించుకోగలిగినందుకు అప్పుడు కాదు ఇప్పుడు తనని తాను అభినందించుకుంది.

"కాని తప్పు చాలామట్టుకు నీదే" అన్నాడు రాజారావు మళ్ళీనూ— "నువ్వు యిలా తిరగడం యిది మొదటిసారి కాదు. ఔనా?"

రాజీ మాట్లాడలేదు.

"నేను మొదటే చెప్పేను. అడగడానికి నువ్వెవరు అని ఒక్కమాట నువ్వంటే, నేనిప్పుడే యిలాగే లేచి వెళ్ళిపోతాను. మళ్ళీ నేనుగాని, మీ శాంతక్కగాని నీ జోలికిరాం. కాని నాకు, మీ అక్కకి, మీ మంగమ్మత్తయ్యకి నువ్వంటే ఎంత యిదో నీకు బాగా తెలుసు!...ఈ దిక్కుమాలిన మెస్ ఉద్యోగం నీకేం వేల కొద్దీ రూపాయలు పోగుచెయ్యడంలేదు. ప్రాణం పోకుండా రెండు పూట్లా యింత తిండి పెడుతోంది; నెలకి నూట పది రూపాయలు జీతం యిస్తోంది అంతేకదా. ఆ మాత్రం దానికే అక్కడ చేరిన ముఠాతో నువ్వూ కలిసిపోయి వేరే మనిషి అయిపోతున్నావు దేనికి?...రెండు నెలల కిందట నువ్వు ఎ. సి. టి. ఓ. ఆనందరావుతో అప్సరాహోటల్ ఏసీరెస్టారెంట్‌లో నాక్కనిపించేవా లేదా? వాడు ఒకటోరకం కేటుగాడు. వాడి చేతుల్లో పడ్డ ఆడమనిషి మళ్ళా యధాస్థితిలో ఇవతలికి రావడం అసంభవం అని ఈ ఊళ్ళో సగంమందికి తెలుసు. షావుకార్ల దగ్గిర కొట్టేసిందంతా బ్లాక్‌మనీ చేసి ఆడపిల్లల మీద జల్లుతాడు వాడు. ఆ వెధవకి నువ్వెలా చిక్కావు? నువ్వా రోజున నా మాటలు విని అర్థం గ్రహించి పనుందంటూ నాతో ఇంటికొచ్చేసేవనుకో కాని తరువాత వాడెప్పుడూ నీ మీదికి వల విసరకుండా వూరుకున్నాడంటే మాత్రం నేను నమ్మను!"

"ఓసారి వచ్చేడు. కాని ఆవేళ అతనొచ్చేసరికి మెస్ వార్డెనుంది అక్కడ సుభద్రగారికి ఆదివారం టర్న్ డ్యూటీ వుందని ఆ కాగితం యిచ్చేసి వెళ్ళి

పోయాడు. నన్ను చూసి బావున్నారా అని అడిగేడంతే"

"ఏమో ఆ విధంగా ఓ పూట ఆపద తప్పినా అదేం విశేషం కాదు...అయినా సరే వేరే సర్కిల్సులో నువ్వు పాప్యులర్ అయిపోతున్నావు రాజీ. అదీ నాకు పట్టు కున్న విచారం! అంతెందుకు? మా ఆఫీ సులో ఎకౌంటెంటు రంగనాధాచారి నీకు తెలుసునా?"

రాజీ మాటాడలేదు.

"నువ్విలా మాటాడకుండా కూచుంటే నాకు నీ గురించి శ్రద్ధ తీసుకునే బాధ్యత తగ్గిపోతుంది తప్ప మరేం జరగదు. ఇష్ట మైతేనే చెప్పు. రంగనాధాచారి నీకు తెలుసా అంటున్నాను!"

"తెలీదు"

"ఊఁహూఁ! నీ కతను తెలీదు. కాని అతనికి నువ్వు బాగా తెలుసు! అంటే బాగా తెలుసునని అతను చెప్పుకుంటు న్నాడు! ...మీ మెస్సులో జడ్. పీ. ఆఫీసు టైపిస్టు ఊర్వశి వుంది కదా?

"ఉంది"

"ఆ ఊర్వశికి పురూరవుడే మా ఎకౌంటెంటు రంగనాధాచారి. ఊర్వశి అతని భార్యే అని అనుకుంటూ వుండే వాళ్ళం మొన్న మొన్నటిదాకానూ– అత నావిడని వెంటేసుకుని సినిమాలకీ, ఫామిలీ పిక్నిక్స్‌కీ కూడా వచ్చేస్తూవుంటేనూ. ఓసారి లచ్చమ్మ పిన్ని ఊళ్ళోకొచ్చిందనీ, నిన్ను చూడాలనుందంటోందనీ కబురు చెప్పడానికొచ్చేను మీ మెస్సుకి, గుర్తుందిగా. అక్కడ నాకు కనబడ్డ ఊర్వశిని గురించి నాతోబాటు స్కూటర్ మీద వచ్చిన శాస్త్రి అడగ్గా నువ్వు చెప్పేవు; తను జడ్‌పీలో పనిచేస్తోందనీ, మెస్‌లో వుంటోందనీనూ. శాస్త్రి అందరికీ విడమర్చి మరీ చెప్పేడు ఊర్వశి రంగ నాధాచారి వైఫ్ కాదనీ,డూప్లికేట్‌ననీనూ. ఇలాంటి విషయాలు ఒక్కొక్కప్పుడు ఆఫీసుల్లోకొలీగ్సు ఎంతముతగ్గా మాట్లాడు కుంటారో తెలిస్తే గుండె పగుల్తుంది ఎవరికయినాసరే.సినిమాపాటల్లో వుపయో గించే మాటల్లాంటివి వాడుతూ మరీ చర్చి స్తారు. ఒకడేమో రంగనాధాచారిని మాకో సారి ఆ అదృష్టం కలగజెయ్యిగురూ అని అడిగాడట!"

"ఛీ"

"అప్పుడే ఏం విన్నావు?– ఆ తరు వాత వాడేమన్నాట్ట ఆ స్కంక్ రంగనాధా చారి తెలుసా?–సారీ బ్రదరూ ఊర్వశి నా ఒక్కడికే స్వంతం. కావాలంటే వాళ్ళ మెస్‌లో మరొకర్నెవర్నయినా మీకు పరిచయం చేస్తుంది; వాళ్ళ మెస్ క్లార్కు రాజేశ్వరిని లైన్లో పెడుతోందిట; మీ తిప్పలు మీరు పడండి అన్నాడట! అలాంటి మాటలు విని, నా తలకాయ దేంట్లో పెట్టుకోవాలి నువ్వే చెప్పు!... ఇంతకీ నేననేదేంటంటే, రాజీ! నువ్వు పాప్యులర్ అయిపోతున్నావు; నలుగురి దృష్టి ఆకర్షించేస్తున్నావు!...నాకు తెలిసి నంత మట్టుకు ఏ ఆడదైనా ఒక్కడి దృష్టిని ఆకర్షించడం మంచిదిగాని, పది మంది దృష్టినీ కాదని!"

రాజీ కంపించింది. "బావగారూ..." అంది ఏదో చెబుదామన్నట్టు.

"లే, వెడదాం. నేనిలా మాటాడ్డం నీకిబ్బందిగా వుంటుందని నాకూ తెలుసు, కానీఏం చెయ్యను? అభిమానం వున్నచోట ఆవేశం వుంటుంది. నీ వాళ్ళం కనక, నువ్వూ మా కుటుంబంలో ఓ వ్యక్తిగా భావించి నేనివ్వాళ ఇంతిదిగా మాటాడేను. ఏమీ అనుకోకు. శాంతతో కూడా ఈ



సంగతులేవీ నేనెన్నడూ మాటాడలేదు. మీ అక్క చాలా అమాయకురాలు. ఈకాలపు మనిషే అయినా పూర్వకాలపు సత్యకాలం వున్న మనిషి. అయితే ఎంతో అమాయకురాలో అంత గడుసుగానూ ఓ పని చేసింది, అదేమిటో చెప్పనా?"

రాజీ ఖాళీగా చూసిందంతే.

"నువ్వు పైకి రావాలనీ, జీవితంలో నువ్వు ఎదుర్కొన్న లేమినీ, కష్టాల్నీ మర్చిపోయి నువ్వూ నలుగుర్లా ఇల్లాలై మనాలనీ మీ అక్కకి వెర్రి కోరిక. ఎప్పటి కయినా నీ పెళ్ళి తన చేతులమీదుగా జరిపించాలని, నీ పెళ్ళి కోసం డబ్బు కూడబెడుతోంది!"

"ఛా!"

"ఛాయేమిటీ, నిజం! తనే నీకో వరుణ్ణి ఎంచాలని కోరిక అసలు. అలా వీల్లేక పోతే నువ్వే నీకుగా ఎంచుకున్న వరుణ్ణి తను ఆమోదించాలని అభిలాష. అతగాడు ని అందం, జ్ఞానం, చివరికి నీ ఉద్యోగం ఏది చాలదని పేచీ పెడతాడోనని, అలా పేచీ పెట్టకండా లంచం ఇద్దామని ఇప్పటికి మూడువేల రూపాయలకి పైగా పోగు చేసింది!"

"నాతో ఎప్పుడూ చెప్పలేదు, చూసేరా!"

"ఎప్పట్నించి అని అడగవేం? నువ్వు మీ మేనమామగారింటి నుంచి పారిపో యొచ్చావే; అప్పట్నుంచన్నమాట!"

"కట్నం అడిగే చవటని నేను పెళ్ళి చేసుకోను!"

"అది నీ చేతిలో పనికాదు రాజీ!"



"నా చేతుల్లో నా పెళ్ళి కూడా వుండదా?"

"పెళ్ళేకాదు; నీ నిత్య జీవితం – నీ దినచర్య కూడా నీ చేతుల్లో ఉండక పోవచ్చు. జీవితం అనేది ఎలెక్ట్రిసిటీ లాంటిది. దాంతో నువ్వు సుఖపడాలన్నా, ధ్వంసం కావాలన్నా ఒక్కొక్కప్పుడు

అజ్ఞానాంధకారంలో నువ్వు చేజిక్కించుకునే స్విచ్చిని బట్టి ఉంటుంది! ఇంతకీ నీ మనసు తిన్నదైనదార్లో పడాలి కదా...నీ కోసం డబ్బు కూడ బెట్టగలం; నీకాకలేస్తే ఓ పూట మా ఇంటికి పిల్చి ఇంతన్నం పెట్టగలం; నిన్ను తీర్చి దిద్దాలని, నీకో నాలుగు చీరలు కొని పెట్టగలం—అంతేకాని నీ పేర ఎవ్వరం కూడా కేరక్టర్ బాంక్‌లో వెయ్యలేం. ఎవరి కేరక్టర్ వారే స్వయంగా బిల్డప్ చేసుకోవాలిగా"

రాణి 'బావగారి' వైపు విరక్తితో



మెచ్చుకోలు దృష్టితో చూసింది. 'బావగారు' ఇంత అభిమానంతో, ఆవేశంతో మాటాడతారని ఆమె ఎన్నడూ అనుకోలేదు. సహనం, శాంతం సమదృష్టి ఆయనకి అనుశ్రుత విద్యలు. కోపంగాని, ఆవేశంగాని ఆయనకెప్పుడూ కలగవనే ఆమె నమ్మకం.

ఆమె రెండు చేతులతోనూ నిండుగా అతనికి నమస్కారం చేసింది. ఆ నమస్కారం అతని మొహం మీంచి కాళ్ళ మీదికే మార్చింది "ప్రామిస్ బావగారూ! ఇక నుంచీ మీతో చెప్పంది ఏ పనీ చెయ్యన్నేను!" అంటూనూ.

"ఛీ, ఛీ! యేమిటా పని? నన్ను పెద్దల్లో కలిపేస్తున్నావు!'' అని ఆమె చేతుల్ని తన పాదాలమీది నుంచి తన చేతులతో తొలగించాడు రాజారావు. ఆమెని లేవనెత్తి తనూ లేచాడు. "పద ఏడు గంటలు కావస్తూంది. నీ ట్రెయిన్ ఎన్నింటికి?"

"తొమ్మిదిన్నరకి!"

"ఈపూట మా ఇంట్లో భోంచెయ్యకూడదూ! మళ్ళా ఎప్పుడొస్తావో ఏమోనూ."

"వస్తే నాపేర కొంచెం కేరక్టర్ బాంక్‌లో వేస్తారా?"

"రాకపోయినా వేస్తూనే వున్నానుగా"

"అయితే రానూ...!" అని దీర్ఘం తీసింది రాజీ నవ్వుతూ.

"అదికాదు బావగారూ! నేనింకా మెస్ కెళ్ళాలి. అక్కడ ఎకౌంటూ, స్టాక్ రూమూ హైమవతిగారికి అప్పగించాలి. ఆమె సరిగ్గా ఏడున్నరకి వస్తానన్నారు. అయిదు నిమిషాల్లో తాళం ఇచ్చేసి పంపెయ్యాలిసుమా అని మరి మరీ చెప్పేరు. ఆ తరవాత స్టేషన్‌కి పరుగెత్తాలి-గుడ్డలూ, పుస్తకాలూ సంచిలో సర్దుకుని. అంచేత ఇవాళ్టికి వదిలెయ్యండి. నాకేంమీ యిల్లు కొత్తా, అక్కయ్య చేతి అన్నం కొత్తా?''

"సరే పద. నిన్ను మీ మెస్ దగ్గిర డ్రాప్ చేసేసి నేనేదైనా సినిమాకి పోతాను. నాకివాళ తొందరగా ఇల్లు చేరాలని లేదెందుకో"

"ఎందుకో, పాపం?" కొంటెగా నవ్వింది రాజీ.

''ఎందుకా? సినిమా కెళ్తే శాంతతో చెప్పడానికి బోలెడు కబుర్లు దొరుకుతాయి. ఇప్పుడిలా వెళ్ళిపోతే ఇదంతా చెప్పాలనిపిస్తుంది!"

"ఇంకా వున్నాయా బాబూ! అగ్ని పర్వతం భుగభుగలు?"

రాజారావు స్కూటర్ స్టార్ట్ చేశాడు.

"ఎక్కు!"

పిలియన్ మీద కూచుంది రాజీ, రాజారావు మీదికి తగు మాత్రంగా వొంగి. "బావగారు నన్ను ఊళ్ళో వాళ్ళెవరితోనూ తిరగొద్దన్నారు, ఎందుకో అనుకున్నాను!" అంది.

''షటప్!" అన్నాడు రాజారావు గేరు మార్చి.



''డీప్ సింపతీస్. ఎరైవింగ్ టుమారో–రాజేశ్వరి" రాజారావు టెలిగ్రాం

జేబులో పెట్టుకుని నిట్టూర్చాడు.

రాజీకి తాను తెలియజెయ్యలేదు, శాంత మరణించిన విషయం. మొన్న సాయంకాలం ఆ సంగతి మాటల్లో కొచ్చింది. ఎవరో ఓ అబ్బాయి రాజేశ్వరి మళ్ళా ఎప్పుడొస్తుందో కనుక్కోడానికిట రాజారావు ఇంటికి వచ్చాడు. ఆ సమయంలో రాజారావు లోపలెక్కడో వున్నాడు. రాజారావు తమ్ముడు— రాజేశ్వరి ఏలూరెళ్ళిందని, ఎప్పుడొస్తుందో తెలీదని చెప్పాడు. వచ్చినతను రాజారావుగార్ని చూడాలని కోరాడు. ఆయనిప్పుడెవర్నీ చూడ్డంలేదని, భార్య పోయిన నాటినుంచి చాలా అప్రాపంచికంగా వుంటున్నారని విని శాంత మరణించిన విషయం దిగ్భ్రాంతితో అర్థం చేసుకుని, చాలా విచారం వ్యక్తం చేస్తూ వెళ్ళాడట.

అతను రామకృష్ణ అయుంటాడని; అతనే రాజీకి ఈ వార్త తెలియపర్చి వుంటాడని రాజారావు వూహించాడు.

నిన్న రాజీనుంచి శాంత పేరిట ఉత్తరం వొచ్చింది. తాను పదిహేడవ తేదీని బయల్దేరి వస్తున్నట్టు రాసింది. ఆ ఉత్తరం రాసినప్పటికి – అంటే శాంత పోయిన పదమూడవరోజుకి – ఈ వార్త ఆమెకి తెలీదని స్పష్టమైంది.

ఆరోజు బీచ్‌లో రాజీకి హితబోధ లాంటిది చేసి, అక్కణ్ణుంచి ఆమెని స్కూటర్ మీద ఎక్కించుకుని మెస్ దగ్గిరదింపి, వెనక్కొస్తూ ఒక ఇంగ్లీషు సినిమాకి వెళ్ళాడు రాజారావు. తిరిగి ఇంటికి వచ్చేసరికి శాంత మరణించి రెండు గంటలయింది, దగ్గిర దగ్గిరగా.

చాలా దురదృష్టకరమయిన సంఘటన.

శాంత మేనమామ బందరు నుంచి సాయంకాలం రైల్లో వచ్చాడు. ఆయన రాజారావు ఉండే ఇల్లు వెతుక్కుని వచ్చేసరికి ఏడు గంటలు దాటింది. "తెల్లవారు జామున మూడు గంటల కాణ్ణించి ప్రయాణం తల్లీ, చాలా అలిసిపోయినాను. వెచ్చటి నీళ్ళు పెడితే కాస్త స్నానం జేసి ఇంత తినేసి నిద్రబోతాను" అని కోరాడు రావడమే.

అయిదు నిమిషాల్లో అయిపోతుందని, శాంత ఎలెక్ట్రిక్ హీటర్ పెట్టింది. ఎప్పుడూ జాగ్రత్తగానే వుంటున్నది; కొన్నాళ్ళుగా వాడుకలో ఉన్న వస్తువేగాని కొత్తదికాదు గనక. కాని హడావిడిలో ప్లగ్ ఉండగానే నీళ్ళలో చెంబు ముంచింది. అంతే! వెంటనే ఆ తడి నేలను కూలిందామె.

శాంత మేనమామ వచ్చిన ట్రెయిన్‌కే, రాజారావు మిత్రుడు డాక్టర్ రమణారావు ఎవరికో వీడ్కోలివ్వడానికి వెళ్ళగా, అక్కడ రాజారావు కనబడితే తనని బీచ్‌లో డ్రాప్ చెయ్యమని అడిగాడు. రాజారావు అతనితో బీచ్‌కొచ్చి, అక్కడ కొంతసేపు రామకృష్ణ, రాజేశ్వరిలతో గడిపి, అక్కణ్ణుంచి మెస్‌కి, మెస్‌నుంచి సినిమాకి వెళ్ళాడని ఎవరూ వూహించలేదు. మామూలుగా ఆఫీసుకి, క్లబ్బుకి కబుర్లుచేశారు. ముఖ్యమైన వాళ్ళకి టెలిగ్రాము లివ్వడానికి పిలవుతుందని రాజేశ్వరి కోసం మెస్‌కి కబురు పెడితే ఆమె ఏలూరు ప్రయాణమై వెళ్ళిపోయిందని తెలిసింది.

ఆరాత్రి స్వయంగానే ఇచ్చాడు టెలిగ్రాములు, రాజారావు – అన్నగారు, తమ్ముడు, అక్క తనవైపు బంధువులు, శాంతవైపు బంధువులు ఆమె మేనత్త,

మేనమామ ఇక్కడే వున్నారు. రాజేశ్వరికి ఒక టెలిగ్రాం రాసి కూడా ఆఖరు క్షణంలో తీసేశాడు. ఆమె అప్పటికి వాల్తేరు స్టేషన్ దాటి గట్టిగా ఇరవైమైళ్ళు వెళ్ళుండదు. తెల్లారేసరికి టెలిగ్రాం ఏలూరు చేరచ్చు. కొంచెం ఇంచుమించుగా రాజీ కూడా అదేవేళకి ఏలూరు చేస్తుంది. వెంటనే బయల్దేరిపోతుంది, సందేహంలేదు. తనకి ఇరవై రోజుల్లో పరీక్షలు. ఇక్కడుంటే చదువు సాగదంలేదని వెళ్ళింది. ఈ విషాద వాతావరణానికి వస్తే ఈ ఏడాదంతా తనకి దండగ...ఆమెవచ్చి చేసేదేం వుండదు. నిజానికి ఎవరు వచ్చి చేసేదేంలేదు–కాని పిల్లలిద్దరికీ రాజీ దగ్గిర మాలిమి. అందువల్ల అమ్మ ఏమైందని వాళ్ళు అడిగితే కడివెడు కన్నీళ్ళకి వాళ్ళను ఏడ్పింగకుండా తనే అంతో ఇంతో బాధపడి నిదానంగా మరపించే శక్తి రాజీ కుంది; రాజీకే వుంది.

కాని రాజీ తనకి రక్త సంబంధీకు రాలుగాదు. శాంతకైనా చెల్లెలి వరసేగాని దగ్గిర చుట్టరికం ఏంలేదు. అయినా ఈ కుటుంబంతో ఆమెకిగల సాన్నిహిత్యం రక్త సంబంధాన్ని మించిన అనుబంధం అయింది.

పెళ్ళిఅయిన దగ్గర్నుంచీ రాజారావు. తన బంధువుల్లో తను ఒంటరితనం అనుభవించాడు. మనవాడు పెద్ద వుద్యోగంలో చేరాక, స్థిరపడ్డాక ఈ పెళ్ళి అయింది. ఈ స్థాయికి తగ్గ లాంఛనాలు మర్యాదలు జరగలేదు. పిలుపులు లేవు; పెట్టుపోతలు లేవు – ఇలా ఈసడించుకుని రాజారావు స్వజనం ఈ ఏడేళ్ళపాటూ ఈ యింటికి రాకపోవడమేకాక వాళ్ళ యిళ్ళలో మంచీ చెడ్డా వస్తే ఈ దంపతులను ఆప్యాయంగా ఆహ్వానించడం



కూడా మానేశారు. శాంత; ఆమెతో వచ్చిన మేనత్త మంగమ్మ; ఈ మధ్య కాలంలో పుట్టిన (శరత్)బాబు; (రత్న) పాప- యిదే రాజారావు కుటుంబం. ఈ కుటుంబానికి ఆ రక్తబంధువుల యిళ్ళల్లో పెళ్ళిళ్ళు, చావులు తప్ప మరో రకం వార చేరనేలేదు. రాజారావుకి బయటి ప్రపంచంలో కూడా యెక్కువమంది స్నేహితులు లేరనే అతని భావన. వృత్తిరీత్యా పరిచయం అయిన మిత్రుల్లోనే కొంచెం మొహమాటస్తుల్ని స్నేహితులుగా తీసుకొన్నాడతను. అలా ప్రపంచం మొత్తం మీద తనని గట్టిగా అభిమానించగలిగిన వాళ్ళు యిరవై ముప్పయి మంది కన్నా వుండరని అతని అంచనా.

అయినా అతను- అతని అభిమానానికి పాత్రులుగా వుండటానికి మాత్రం కొందర్నే ఎంచుకున్నాడు. మనసులో

చోటిచ్చేటంత దగ్గరగా రావడానికి యెవ్వరూ ప్రయత్నించలేదని బాధ పడుతూనే తన యింట్లో మాత్రం కొందరికి చోటిస్తూనే వచ్చాడు. అతడు నెలకు వెయ్యిరూపాయలకు పైగానే సంపాదించుకుంటున్నాడు. అక్కర్లేదనుకున్నా, ప్రయత్నించకపోయినా మరికొంత డబ్బు తన ఆర్జన కానిది చేరుతూనే వుంది. ప్రాజ్ఞతతో, నేర్పుతో నిలవవేసింది ఐదంకెలకు చేరింది. చాలా ఏళ్ళబట్టి ఉండడాన్ని పెద్ద యిల్లు చవకలో అద్దెకు దొరికింది. దగ్గిర బంధువులు, దూరపు బంధువులు ఎవరయినా విశాఖపట్నానికి ఆఫీసుల పన్ల మీదనో, ఆస్పత్రి పని మీదనో వస్తే వాళ్ళు రాజారావు యింట ఆశ్రయం, ఆతిథ్యం అపేక్షించకుండా వెళ్ళడంలేదు. శాంత బాబాయి కొడుకు యూనివర్శిటీలో చదవడానికొచ్చి రెండేళ్ల పాటు పడమటి గదిలో మొదట పేయింగ్ గెస్టుగా,తరవాత గెస్టుగా వుండిపోయాడు. రాజేశ్వరి వాళ్ళ మేనమామగారింటినుంచి విపరీతమైన పరిస్థితుల్లో పారిపోయి వచ్చింది. ఆమెకు ఇక్కడ పడి తినడం సిగ్గనిపిస్తే ఉద్యోగినులైన అవివాహితులుండే మెస్‌లో క్లర్కుగా ఆమెని చేర్చగలిగే వరకు– అంటే లేడీస్ క్లబ్ ఎటెండెంటుగా వుంటూ మెట్రిక్యూ, టైపూ అవుతున్న రెండేళ్ళకాలం ఆ గదిలోనే వుంది.

అలా వచ్చే పోయే వాళ్ళ సంఖ్య ఎంతో అయింది. అంచేత అతను తన యింటికి 'పాంథశాల' అని పేరు పెట్టాడు. ఎప్పుడో రామిరెడ్డిగారి పద్యం చదివినప్పటి వేడి మళ్ళా నెమరుకి తెచ్చుకుని. ఈపాంథశాల కొచ్చినవారు ధరాక్రాంతులు, పాదుషాలు బహరామ్ జదుషీడులు గారు– 'చుట్టముల్ సఖులు బంధులనేకులు అతిథులై అభ్యాగతులై..' వాళ్ళలో రాజేశ్వరి స్థానం ప్రత్యేకం. అది ఆమె పరిస్థితినీ, అవసరాన్నీ బట్టి ఏర్పడింది; రాజారావు సంతానం ఆమెపట్ల పొందిన అనుభూతుల వల్ల పెరిగినదిన్నీ.

రాజేశ్వరి చిన్నతనం కథ శాంత బాల్యగాథకంటే కూడా దయనీయమైంది.

వచ్చినవాళ్లు చాలమంది వెళ్ళిపోయారు. రాజారావు అన్నగారు మాత్రం భార్యని, అయిదుగురు పిల్లల్ని వదిలే వెళ్ళాడు. శాంత మేనత్త తనిక్కడ వుండలేనని రోజుకొకసారి రోదిస్తూంది.

"పిల్లల్ని వదలి ఎక్కడికి వెడతావు పిన్నమ్మా" అన్నాడు రాజారావు.

"ఎక్కడికన్నా వెళ్ళాలి. ఇంక యిక్కడ నాకేం టుంది బాబూ, నీ ముఖాన్న, ఆ పసివాళ్ళ ముఖాల్న అమ్మాయే కనబడతది. నేనీ కడుపు కోత కెదురు నిలబడలేనయ్యా."

"ఉండటానికి నీకు బాధయితే తప్పకుండా వెళ్ళు. కాని నీకది న్యాయంగాదు పిన్నమ్మా. అట్లా వెళ్ళిపోవాల్సిన అగత్యమూ లేదు. శాంత లేకుండా యెట్లా వుండనూ అంటున్నావు. ఈ యింట్లో శాంత లేకుండా వుందా? మనందర్లోనూ వుందిగా, తను?

ఆ పదహారో రోజున మధ్యాహ్నం రెండు గంటలకి బిక్కమొహం వేసుకుని రాజేశ్వరి వచ్చింది.

* * *

సాయంకాలం అయిదు గంటలైంది.

"నేనెళ్ళొస్తాను బావగారూ" అంటూ రాజారావు గది ద్వారం దగ్గిర నిలుచుని చెప్పింది రాజీ. లోపలికి చూసి ఆశ్చర్య





పడింది.

రెండు కవల మంచాలు, గది మధ్యన సీలింగ్ ఫాన్ కింద వుండేవి. రెండిటినీ అటూ యిటూ జరిపి, గోడల కానించి పెట్టారు. వాటికి దోమ తెరలు కట్టారు. గది మధ్యన మడత మంచం వేసుకుని, దాని మీద బాసిం పట్టుపేసుకుని కూర్చు న్నాడు రాజారావు. ఒడిలో ఒక పెద్ద దిండు, దాని పైన ఒక పుస్తకం. దీక్షగా లాగ చదువుతున్నాడు.

"ఊఁ ?" తలెత్తి చూశాడు. "నువ్వా? దా ! కూర్చో"

మడత మంచం దగ్గరగా వచ్చి అక్క డికొక స్టూల్ లాక్కుని కూర్చుంది రాజీ. రాజారావు తాను చదువుతున్న పుస్త కాన్ని పేజీలు కలిసిపోకుండా దిండు మీద బోర్లా పెట్టి ఆమె వేపు చూశాడు. రాజీ పుస్తకం వైపు చూసింది. గాంధీ ఆత్మ కథ.

"నే వెళ్తున్నాను బావగారూ. ఆ మాట మీతో చెప్పిపోదామని.." ఒక్కసారి రాజారావు కళ్ళలోకిచూసి వెంటనే నేలకు చూసి అంది. రాజీ.

"ఎక్కడికి ?"

"మెస్సుకి !"

"ఏం ?"

రాజీ జవాబు చెప్పలేదు. అతనివేపు మరోమారు చూసిందంతే.

"నువ్వు రాసిన ఉత్తరం చూసేను" అన్నాడు రాజారావు.

పరీక్షలకి మూడు రోజులు ముందుగా విశాఖపట్నం చేరుతానని తను శాంత పేరిట రాసిన ఉత్తరం గుర్తొచ్చింది రాజేశ్వరికి. 'వెళ్ళగానే ఉత్తరం రాయి సుమా' అని ఆ రోజు బావగారు తనని మెస్ దగ్గిర దించేసి అన్నమాట సాధా రణమైన వీడ్కోలు మాటలాగా తీసుకో లేక పోయింది రాజేశ్వరి. దానికి కారణం తను విశాఖపట్నంలో గడిపిన ఆఖరు రోజు వుదంతం. మెస్‌లో ఉండే కొందరు స్త్రీల దినచర్య గురించి, పోనీ ప్రవర్తన గురించి, అక్కడ పని చేస్తున్న తన కంటే ఎక్కువగా ఊళ్ళోవాళ్ళకి, అందునా బావగారికి తెలియడం, అదంతా ఆయనగారు తనకి చెప్పవలసి రావడం ఆమె మనస్సును చిలికింది.

"నాకిక్కడి కొచ్చినా ఆ మెస్సు, అక్కడి బోర్డర్సు గుర్తుకొచ్చి చాలా బాధ కలుగుతోంది అక్కా. వాళ్ళు నన్ను ఒక్క పూట కూడా బాగా చదువుకోనివ్వలేదు. ఎవరికి ఏది కావల సినా నన్నే అందించమనే వాళ్ళు. ఎవరి కైనా ఏమీ తోచకపోతే బాతాఖానీ పెట్టు కోడానికి ఎవరూ దొరక్కపోతే నా దగ్గర చేరే వాళ్లు. ఎవరికైనా బజారుకో, సిని మాకో వెళ్ళాలనిపించి ఒంటరిగా వెళ్ళ డానికి భయమైతే నన్ను తోడు రమ్మనే వాళ్ళు. కాని అందులో ఎవరికీ నా పైన నిజమైన అభిమానం, ఆప్యాయతా లేవు. బయటికి వెళ్ళాక వాళ్ళ స్నేహితులో, సహాధ్యాయులో, మరొకరో అక్కడ తటస్థపడితే నన్ను అక్కడికక్కడ వది లేసి ఒక్కదాన్నీ సిటీ బస్సులో వెళిపో మనడానికి మొగమాట పడేవారు కాదు. ఎవరు గాని నన్ను ఒక ఉద్యోగినిగా, వాళ్ళతోసమంగా యెన్నడూ చూడలేదు. వాళ్ళు మెస్‌కి యిస్తున్న డబ్బులో కొంత భాగంతో నా జీవనోపాధి నడుస్తున్నంత మాత్రం చేత వాళ్లు నన్ను చెలికత్తెగా, సత్రకాయగా, దాసిగా చూడడం భావ్యమా ?... ఒక రాస్కెల్ నన్ను

తన ప్రయోజనం కోసం చెలికత్తెగా వుపయోగించడం సాధ్యపడక, మెసెంజర్‌గా వుపయోగపడతానని దండాలు పెట్టింది! నేనిక్కడికి బయల్దేరి వచ్చేసిన రోజున బావగారు నాతో మా మెస్‌లో వాళ్ళను గురించి తగాదా పెట్టుకున్నారు. ఆ వేళ ఆయన మాటలు నాకు కష్టంగా అనిపించాయి గాని, నేను మళ్ళా ఆలోచించుకుంటే ఆ మెస్‌లో ఎలాంటి రాక్షసులున్నదీ అర్థమైంది !

"నేను పరీక్షలు రాయడంకోసం, ఆ తరవాత అక్కడ వుండిపోడం కోసం; పద్దెనిమిదో తారీకు ఉదయం అక్కడికి చేరేటట్టుగా విశాఖపట్నం వస్తున్నాను. సరాసరి మీ యింటికి వచ్చేస్తాను. ఇరవై అయిదో తేదీ వరకు నేను మెస్సులో పనికి వెళ్ళక్కర్లేదు. కనక అంతవరకు మనింట్లోనే ఉండిపోతాను. పడమటివైపు గదిలో సామాన్లు కొన్ని తీయించేస్తే ఆ గది నాకు ఉపయోగ పడగలదని అనుకుంటున్నాను. అసలు, పరీక్షలయిపోయాక కూడా నేను మకాం వరకు మీ యింట్లోనే ఉండిపోతే బావుంటుందేమోనని అనుకుంటున్నాను. అందుకు వీలవుతుందని లోగడ బావగారూ, నువ్వూ అన్నారు కదా. ఆ విషయం మంగమ్మ అత్తయ్యతో కూడా ఆలోచించవలెను"

"ఇక్కడే వుండిపోతానని రాశావుగా."

అక్క వుంటే తానిక్కడ వుండడానికేమి అభ్యంతరం వుండదు. కాని–

ఆ ఉత్తరం అక్క చదువుకుంటుందని తను రాసింది. బావగారికి చూపించేదేమో కూడాను. అయితే బావగారే, ఆయనొక్కరే చూడడం వేరు. ఇప్పుడా

 

ఉత్తరం సంగతి తల్చుకుంటే తను ఆయన గారికే రాసినట్టుంది - ఆయన ధోరణీ తన ధోరణీ కూడానూ! ఆయన ఆ ఉత్తరం చదివారు. అందులో తను రాసిన మానసిక వివరణ అంతా తను రాయక్కర్లేకుండానే ఆయనకుతెలుసును. నిజానికి తనకా వివేచన కలిగించింది, ఆ కనువిప్పు కలిగించింది బావగారే కదా!

అంతా తలచుకుని సిగ్గుపడింది రాజేశ్వరి.

"అదికాదు బావగారూ... !"

"ఏదీ కాదు ! శాంత లేకపోతేనేం, నువ్వు నాకేమీకావా ? నీకు ఈ యింట్లో వుండే అధికారం లేదా ? చనువులేదా ? తల్లిలేని పిచ్చి ముండలు వాళ్ళిద్దరూ నీ దగ్గిర చనువుగా వుంటారు కదాని ; నీ అంతట నువ్వే నా యింట్లో వుంటానని రాస్తే పుట్టెడు దుఃఖంలోవున్నా గుక్కెడు సంతోషంలా మింగేసి క్షణంలో సగం సేపు సుఖపడ్డాను. ఇక్కడున్నవాళ్ళం ఎవరు? మీ మంగమ్మత్తయ్య, మీ అక్క పిల్లలూ, నేనే కదా! ఇందులో యెవరు నీకు పరాయివాళ్ళు ? నీ ఉత్తరం రాక ముందు ఎప్పట్లా నువ్వు రాంగానే మెస్‌లో దిగుతావేమో; అక్కడికే వచ్చి పిల్చుకొద్దామనుకున్నాను, అసలు!"

రాజేశ్వరి ఒక నిమిషం పాటు మాట్లాడలేకపోయింది.

"కష్టంలో వున్నారు. మిమ్మల్ని బాధపెట్టాలని నా ఉద్దేశంకాదు బావగారూ, నాకన్నా అనేక విధాల పెద్దవారూ, గొప్పవారూను, మీరు ! నేను బ్రతుకే లేదనుకున్ననాడు. నాకు మీ యింట్లో చోటిచ్చేరు: మీ మనస్సుల్లో స్థానం యిచ్చేరు. మీరు పరాయివాళ్ళని అంటేనూ, అనుకుంటేనూ కళ్ళుపోతాయి. కాని యిప్పుడు పరిస్థితులు..."

"ఏపరిస్థితులూ లేవు! నువ్వు వెళ్ళడానికి వీల్లేదంతే. నువ్వు కోరినట్టుగానే పడమటి వేపు గదిలో నువ్వుండొచ్చు. అసలు నా పిల్లలెక్కడుంటే నువ్వూ అక్కడే వుంటావు. మీ మంగమ్మత్తయ్య ఎక్కడుంటే నువ్వూ అక్కడే వుంటావు! ఇదంతా నీ యిల్లు కాదనీ, మేం అందరం నీవాళ్ళం కాదనీ అనగలిగిన వాడెవడైనా వుంటే రమ్మను!

అంచేత, వెళ్ళిపో; అదే మెస్సుకి కాదు, పడమటి గదిలోకి! ఆ గదిలోనే నీ పుస్తకాలూ అవీ పెట్టుకో. దీక్షగా చదివి బాగా పాసవ్వు. మంగమ్మత్తయ్యతో నేను చెప్పానని చెప్పు. అసలావిడతో చెప్పే పనేముంది? నువ్వెన్నడూ ఉండని ఇల్లా యిది? కాదులే ఆవిడతో చెప్పు.." అని బోరగిలా వున్న పుస్తకాన్ని తీసి సరిగా పట్టుకుని చదువుకుంటూ ఉండిపోయాడు రాజారావు.

రాజేశ్వరి ఇంకా ఏదో చెప్పాలని అక్కడలా కొంతసేపు కూర్చుంది. కాని రాజారావు ఆమె వేపు అసలు చూడలేదు.




రెండు నెలలు గడిచాయి.

ఉదయం ఏడున్నర కాలేదు, పూర్ణా మార్కెట్ దగ్గర హోల్‌సేల్ కూరగాయల వర్తకుల కోసం యెదురు చూస్తూ

నుంచుంది రాజేశ్వరి. ఫుట్‌పాత్ మీద మెస్ పని మనిషి రంగమ్మ రెండు పెద్ద ఖాళీ గంపలు పెట్టుకుని కూర్చుంది. ఈ కూరగాయల వాళ్ళు రావడమెప్పుడు, తను కూరలు కొనుక్కుని రంగమ్మను తీసుకుని మెస్‌కి వెళ్ళడమెప్పుడు అను కుంటూ ఆత్రంగా, ఆందోళనగా చూస్తోంది రాజేశ్వరి. ఇవాల్టినుంచి, ఎనిమిదిన్నర తొమ్మిదిన్నర మధ్య షార్టు హాండ్ నేర్చుకుందికి వెళ్ళాలని ఏర్పాటు చేసుకుంది. మొదటి రోజే లేటయిపోతానా అని బాధపడ సాగింది.

పరిచయం ఉన్న చప్పుడు చెవిని పడి అటు తిరిగింది రాజేశ్వరి. అది రాజారావు స్కూటర్ చప్పుడు. రాజారావు చౌల్ట్రీ వేపు నుంచి వస్తున్నాడు. తను మెయిన్ రోడ్డుమీద కాక, పక్క రోడ్డు మీద ఉండడం చేత అతని కంట పడలేదు. తనకోసం గాని వచ్చారా? ఆయనిలా వస్తారన్ని తెలిస్తే ఆయనతోటే వద్దునే అనుకుంది. రాజారావు స్కూటర్ జంక్షన్ దాటి ముందుకు వెళ్ళింది కాని సిటీ బస్సులు ఆగే దగ్గర ఆగిపోయింది.

'నాకోసమే. ఏదో అర్జంటు పని తగిలి వచ్చుంటారు' అనుకుని రెండడుగులు మెయిన్ రోడ్డు మీదికి వేసింది రాజేశ్వరి. ఇప్పుడు తను ఆయనకి కనపడుతుంది.

హటాత్తుగా ఆగింది రాజేశ్వరి.

స్కూటర్ తన కోసం ఆగలేదు.

తెల్ల చీరా, తెల్ల జాకెట్టూ వేసుకుం దొకావిడ. రోడ్డుకి ఆ వైపున స్కూటర్ ఆగింది కదా, ఆవిడ ఈ వైపున నడుస్తోంది. స్కూటర్ ఆపిన రాజారావు





సౌండు వేసి, ఆవిడికి 'రా!' అని సంజ్ఞ చేసేడు, చెయ్యూపి, 'వస్తున్నా, వస్తున్నా' అన్నట్టు చేతోనే సంజ్ఞ చేసింది ఆవిడ కూడానూ. రోడ్డు దాటబోయింది. అప్పుడే రోడ్డు మీద అడ్డం వచ్చిన సిటీ బస్సు వాతపడకుండా వుండాలని ఆగి, బస్సు ముందుకు సాగేక చిన్న పరుగులాంటి నడకతో ఆయన్ని చేరుకుంది.

'బావగారు' స్లాకుషర్టు జేబులోంచి మడత పెట్టిన నోట్లబొత్తి తీసి, విప్పి ఆమెకు ఇచ్చారు. ఆమె తీసుకుంది. "థాంక్స్" అని వుంటుంది; చిన్న నవ్వు మాత్రం కనపడింది. ఒకవేలు నోట్ల బొత్తి వేపు చూపించి "లెక్కపెట్టు" అన్నట్టు సంజ్ఞ చేశాడతను. ఆమె తల అడ్డంగా ఆడించి, ముక్కుమీద వేలేసు కుంది. బావగారు ఆమె చేతిలోంచి ఆ నోట్ల బొత్తి తీసుకొని లెక్కపెట్టి ఇచ్చారామెకి. ఏదో సంఖ్య చెప్పి వుంటారు. ఆమె ఔనన్నట్లు తలాడించింది. ఆయన జేబులోంచి ఒక కాగితం తీసి విడిగా పెట్టుకోమన్నట్టుగా (చెప్పి) ఇచ్చాడు. ఆమె నమస్కారం చేసింది. అది చాలా ఎక్కువ డబ్బే, ఐదూ పదీ కాదు; వందా రెండు వందలూ కూడా కాదు.

బావగారు స్కూటర్ స్టార్టు చేసేరు. ఆయన దగ్గిర డబ్బు తీసుకున్నావిడ, మళ్ళీ రోడ్డుదాటి ఇటువేపువచ్చేసింది. ఆమె, రాజేశ్వరిని దాటి బ్రాంచి రోడ్డు మీద కొంచెందూరం వెళ్ళేలోగా బావగారు స్కూటర్ స్టార్ట్ చేసి, కొంచెం ముందుకు పోనిచ్చి, మళ్ళా ఏదో మర్చిపోయినట్టు టర్నింగ్ తిప్పి, మెయిన్ రోడ్డు వదలి బ్రాంచ్ రోడ్డు మీదకి, ఆవిడ నడుస్తున్న వేపుకి వచ్చాడు. ఆవిడ అప్పటికి ఒక రిక్షా (మాట్లాడేసుకున్నట్టుంది)

ఎక్కడానికి సిద్ధంగా ఉంది.

రాజారావు స్కూటర్ని ఆమెకి దగ్గరగా పోనిచ్చి ఆపాడు.

ఆమె మీద దృష్టితో తను చాలా సమీపంలో ఉన్నా చూడలేదే బావగారు అని ఆ ఏకాగ్రతకు ఆశ్చర్యపడింది రాజేశ్వరి.

"సాయంకాలం మా ఆఫీసుకొస్తే నేను రెడీగా ఉంటాను!" స్కూటర్ ఇంజిన్ చేస్తున్న శబ్దంలో కలిసిపోకుండా బిగ్గరగా మాట్లాడాడు రాజారావు.

ఆవిడ తల అడ్డంగా వూపింది.

"పోనీ, మీ యింటి దగ్గర అంటే మరీ సందులో కాకుండా, జ్ఞానాపురం బస్స్టాప్ దగ్గరో, డాక్టర్ నాయర్ ఆస్పత్రి దగ్గరో ఉంటానంటే నేను స్కూటర్ మీదొచ్చి పికప్ చేస్తాను?"

ఆవిడ దానికి అంగీకారంగా తల వూపింది.

"సరిగ్గా నాలుగున్నరకి అక్కడుండాలి. ఓకే!" అని స్కూటర్ పోనిచ్చాడు రాజారావు. ఆవిడ రిక్షా ఎక్కింది.

"విచక్షణ లేకుండా యెవ్వరితోనూ తిరగొద్దు. ఎప్పుడు ఏ ప్రమాదం ముంచుకొస్తుందో, ఎవరెలా గోతిలోకి తోస్తారో తెలుసుకోడం కష్టం" అని ప్రబోధించే బావగారు...

పొద్దుటే ఆయన మామూలుగా లేవని వేళకి పూర్ణా మార్కెట్ దగ్గిర స్కూటరెక్కి కనబడ్డం వింతగా ఉంది రాజీకి.



ఆవిడ యింటికి బయలుదేరుతారు. ఆవిడ యింటి దగ్గిర లేకపోతే యెక్కడి కెళ్ళిందో కనుక్కొనీ, వెతుక్కొనీ యిక్కడికొచ్చుంటారు. నడిరోడ్డు మీద కలుసుకున్నారు. అంత డబ్బు ఆవిడ కెందుకిచ్చారో? అసలావిడ యెవరో?

సాయంకాలం నాలుగున్నరకి జ్ఞానాపురం బస్‌స్టాప్ దగ్గిరకెళ్ళి ఆవిడిని "పికప్పు" చేస్తారుట. యెక్కడికో—?

బుర్రుమని లారీ రావడం; రోజూ అలవాటుగా వినే కూరగాయల వర్తకుల కేకలు. రాజీని ఈ లోకంలో దింపాయి మళ్ళీ.

"వాట్ రాజీ! ఏమిటా చూపు? ఎవరా స్కూటరాయన? " అని భుజం మీద కొట్టి పలకరించింది హైమవతిగారు.

ఆవిడ నవనారీ గృహం సలహాదార్లలో ఒకరు. ఒక్కొక్కప్పుడు మార్కెట్‌లో సరుకులు దగ్గిరుండి కొనిపించి రేట్లు నోట్ చేసుకుంటుంది. కూరగాయలు ఎంచుకుంటొందా లేదా అని రాజేశ్వరిని పరిశీలిస్తోంది.

"నమస్కారం మేడమ్" కంగారు పడింది రాజీ. "ఆయన మా బావగారండీ! అసిస్టెంటు డైరెక్టర్‌గా వర్క్ చేస్తున్నారు !''

* * *

పది గంటలు కొట్టింది గోడ గడియారం. అది చూసి, వరండా మీద నుంచి స్కూటర్ దింపుతూ తన రిస్టువాచీ చూసుకున్నాడు రాజారావు. పదింపావు. మరీ ముందుగా బయల్దేరి వెళిపోడం లేదు అనుకొన్నాడు.

గేటులోంచే లోపలికొస్తూ కనబడింది రాజేశ్వరి.

"అన్నీ మంచి శకునములే—" అన్నాడు చిన్నగా నవ్వి రాజారావు, సినిమాపాట పరసలో.

"కన్యాలాభ సూచనలే" అని తరువాతి ముక్క గుర్తొచ్చింది రాజీకి. దాంతో మొదట ఒళ్ళు పులకరించి "వెంట" "ఆ కన్య ఎవరో, నేను కాదు కదా నే" అనుకుని, మొహంలో నవ్వు పోయింది.

"నా శకునం మీకురోజూ ఉన్నదేగా"

"అయినా నీ మొహంలో యివాళేదో కొత్త కళ కనబడుతోంది"

"మీ మొహంలోనే అనెందుకనుకోకూడదు?" అనుకుంటూ మెట్లెక్కి రోడ్డు వేపు తిరిగింది రాజేశ్వరి.

"షార్టుహాండ్ లెసన్సుకి యివాళ్ళించి వెళతానన్నావు వెళ్ళేవా ?" అన్నాడు రాజారావు; రోడ్డుమీద తను వెళ్ళబోయే దిక్కుకి స్కూటర్ తిప్పి.

రాజేశ్వరి తల వూపింది, వెళ్ళా నన్నట్టుగా.

"అదీ సంగతి. అందుకే, ఆ కొత్త కళ" అని ఒక అభాండం వేసి స్కూటర్ స్టార్టు చేసి గాగుల్స్ తగిలించుకుని కూర్చున్నాడు రాజారావు.

రాజీ లోపలికొచ్చేసింది.

"పిల్లలు బడికెళ్ళిపోయారా అత్తయ్యా?" అని పలకరించింది. ఎదురు వచ్చిన మేనత్తను చూసి.

"ఇంకా ఎందుకుంటారు పిల్లలు ? పది దాటలేదూ, టైము ?"

గోడగడియారం చూసి, రిస్టు వాచీ చూసుకుంది రాజీ. పావు గంట స్లో. ఈ గడియారం ఆగిపోనన్నా ఆగిపోదు. అని చిరాకు పడి, స్టూల్ తెచ్చుకుని, దాని మీద నుంచుని గడియారం తలుపు తెరిచి దిద్దింది. మళ్ళీ రెండు రోజుల్లో అయిదు నిమిషాలు స్లో యేడుస్తుంది,

అని ఏకంగా పదీ ఇరవైయ్యేదుకి సెట్ చేసింది. స్టూల్ దిగి, రిస్టువాచి ఊడ దీసుకుని దానికి కీ యిచ్చింది.

రాజీని ఆసాంతం గమనిస్తున్న మంగమ్మకి ఆ రిస్టు వాచీ చూడగానే నిట్టూర్పొచ్చింది. అదిశాంత చేతినిష్టండేది.

"పిల్లలు బాగా పేచీలు పెట్టారా అత్తయ్యా?" అని స్టూల్ గోడవారకి తోసేసి, చిన్న నవ్వుతో అడిగింది రాజీ.

పిల్లలిద్దరూ శారదా బాలవిహార కాన్వెంట్ లో చదువుతున్నారు. వాళ్లకి ఉదయం పదింటికి స్కూలు. సాయంకాలం నాలుగు వరకూనూ. మధ్యలో పన్నెండున్నర నుంచి ఒకటిన్నర వరకు రీసెస్. ఉదయం తొమ్మిదిన్నరకి అన్నాలు తిని వెళతారు వాళ్ళు. రీసెస్ బెల్ కొట్టగానే పరుగెత్తుకుంటూ వస్తారు. ఓ రోజు రెండు పెట్టెల రైలులాగా, ఓ రోజు నువ్వు ముందా నేను ముందా అని పందాలు వేసుకున్న వాళ్ళలాగా పుస్తకాలు స్కూల్లోనే వుండిపోతాయి.

రోజూ ఆ వేళయ్యేసరికి ఉడక పెట్టిన స్వీటో, పెరుగన్నమో సిద్ధంగా వుంచుతుంది మంగమ్మ. అయిదు నిమిషాల్లో గబగబా తినేసి మళ్ళా పరుగో పారిపోతారు. నాలుగంటలకి పాలు, దాంతో బిస్కెట్లో, బన్నో, బ్రెడ్డో ఏదంటే అది పుస్తకాలక్కడ పెట్టుకుని ఆటకు వెళతారు- ఆరు గంటల వరకూను. రాత్రి తొమ్మిది గంటలదాకా గొడవ పెట్టుకుంటూ చదువులు వల్లిస్తారు.

ఈ కార్యక్రమంలో రాజీ పాత్ర చాలా వుంటుంది.

వాళ్ళిద్దరూ ఉదయం లేవగానే పాలు తనే కాచి గ్లాసుల్లో పోసి యిస్తుంది. మెస్సు పని అయిపోయేసరికి తొమ్మిది. వెంటనే వచ్చేసి వాళ్ళకి భోజనం తనే వడ్డిస్తుంది. రాత్రి చదువులయ్యేసరికి మెస్సునుంచొచ్చి వాళ్లకి భోజనంపెట్టి తన దగ్గిర పడుకోబెట్టుకుంటుంది. భోంచేసి చెయ్యి కడుక్కుని రావడంలో ఎవరు ముందయితే వారు రాజేశ్వరి పక్కమీద, రెండో వాళ్ళు అమ్మమ్మ పక్కమీద. వాళ్ళకి కథలు చెప్పడం, వాళ్ళచేత కథలు చెప్పించడం, పాఠాల్లోంచి ప్రశ్న లెయ్యడం, వాళ్ళిద్దరిమధ్యా ఆరోగ్యకరమైన పోటీలు పెట్టడం, ఒకర్నొకరు ఓడించడానికి కోరిక కలగజేసి వాళ్ళ ఆలోచనల్ని పదును పెట్టడం యివన్నీ రాజీకి చాలా యిష్టమైన కోరికలు, డ్యూటీలు!

వాళ్ళు బాగా నిద్ర పోయాక మంగమ్మా, రాజేశ్వరీ ఆ మంచాలమీదనే ఒదిగి పడుకుంటారు కబుర్లు చెప్పుకుంటూనూ. రాజారావు హాల్లోనో, గదిలోనో మడత మంచం వాల్చుకుని ఏదో పుస్తకం చదువుకుంటూ వుంటాడు. లేకపోతే ఆఫీసునుంచి తెచ్చుకున్న ఏదో ఫైలును కూలంకషంగా పరిశీలించుకుంటూ వుంటాడు. హటాత్తుగా ఎప్పుడో పిల్లల సంగతి గుర్తొస్తుంది. "పిన్నమ్మా!" అని కేకేస్తాడు. మేలుకుని వుంటే సమాధానం వస్తుంది. లేకపోతే లేపుతాడు. అప్పటికి రాజీ కూడా మేలుకుని వుంటే రాజారావు కొడుకుని ఎత్తుకుంటాడు. రాజేశ్వరి అతని కూడా పడక గదిలోకెళ్ళి పిల్లల మంచాలు సరిగా వున్నాయో లేదో చూసి, లేకపోతే సరిచేసి వెంటనే వెళ్ళి పాపని తీసుకొచ్చి పడుకోబెడుతుంది.

రాజారావు వీధి తలుపు గడియతీసి స్కూటర్ లోపల పెట్టుకుని రాముల్ని కేకేస్తాడు. వాడు నిద్రలేస్తూ చాపా సరం



జామా తెచ్చుకుని రాజారావుతో కూడా రెండు నిమిషాలు తిరిగి గేటు దగ్గిర్నుంచీ పెరటి ద్వారం వరకూ అన్నీ సరిగా ముయ్యడం సంగతిచూసి హాల్లో పడుకుంటాడు. రాజారావు తాళాల గుత్తిని మంగమ్మ తల దిండుకింద వుంచి తన గదికి వెళతాడు. పిల్లలిద్దరి మంచాల మధ్యా తన మడత మంచం వాల్చుకుని కేవలం ఒక దిండు మాత్రం వేసుకుని, సీలింగ్ ఫాన్ స్లోగా ఆన్ చేసుకుని టేబిల్ లైటు తలదిక్కున పెట్టుకుని మళ్ళా పఠనంలో – అలా అలా ఎప్పుడో నిద్రలో పడతాడు.

"పిల్లలన్నాక పేచీలు పెట్టకుండా ఎట్లా వుంటారు?" అంది మంగమ్మ. "అయినా ఏదో నాకు తోచినట్టు పెట్టాను. నీ చెయ్యి అలవాటు మీద నా చేతమ్మట ఏం తినలేదు [illegible]ంచలు... నీకేమో ఆ పాటమేదో తప్పదన్నావుగా మరి?"

"తప్పుత్తమ్మా. షార్ట్‌హాండ్ పరీక్ష కూడా పాసైతే బావగారు నాకింతకంటే మంచి వుద్యోగం చూస్తానన్నారు. నేనిప్పుడు చేస్తున్న మెస్సు ఉద్యోగం ఆయనగారికి నచ్చలేదు" అంటూ లోపలి గదిలోకి నడిచింది రాజీ.

రాజేశ్వరి తాడుమీద వేలాడుతున్న చీరతీసి చుట్టపెట్టుకుంటూ వుండగా

"నిన్ను పై సదువులకి పంపి ఎక్కడో మంచి వుద్యోగం చూడ్డం తప్ప మరో ఆలోచనేలేదు అబ్బాయికి!" అని అక్కణ్నించి ఇవతలికి వచ్చేసింది.

రాజేశ్వరి గుండె దడదడా కొట్టుకుంది. "ఏంటత్తమ్మా నువ్వనేది!" అని నాలుకదాకా వచ్చిన మాటని అక్కడ బిగించేసి తలుపు అవతల్నించి మంగమ్మ ఆ సంభాషణ యింకా కొనసాగిస్తుందేమో, దాన్నుంచి రక్షించుకోవాలన్నట్టుగా సగం సగం కట్టుకుంటున్న చీరను నేల మీద ఈడ్చుకుంటూ గది తలుపు లోపల బిగించింది.

నిజానికి ఈ ఆలోచన ఉదయం ఏడూ నలభై నిమిషాలకి తనకే కలిగింది.

అంతకు ముందు అసలు కలగలేదని కాదు.

వేసవి మబ్బులా ఎక్కడో దూరాన తెల్లగా వున్న ఈ ఆలోచన ఈ ఉదయం ఆ తెల్లచీరా, తెల్ల జాకెట్టూ...తనకన్నా చురుగ్గా...తనకన్నా ఓ అరకేజీ అవయవ సౌష్టవంతో...ఆయనగారు పెద్దమొత్తంగా డబ్బు చేతిలోపెట్టి సాయంకాలం నాలుగున్నరకి స్కూటర్ మీద వెళ్ళి "పికప్" చేసుకుంటాననడంలో...శ్రావణ మేఘంలా దట్టమై వర్షించడానికి సిద్ధంగా...బెదిరిస్తూ...తనని బెదిరిస్తూ...

అయినా ఆయనెక్కడ, నేనెక్కడ?

అయినింట్లో పుట్టి చిన్నతనం నుంచీ స్వతంత్రమైన భావాలతో, నిశితమైన కార్యదీక్షతో పెద్ద చదువు చదివి సరాసరి మంచి వుద్యోగాన్ని చిన్నవయసులోనే సాధించి మెరిసిపోతున్నారాయన. బంధువులకీ స్నేహితులకీ ఎవరికి ఏం చేసినా అది తన డ్యూటీయేనని ఆయన అనుకున్నా నిజానికి అవన్నీ వారందరికీ వుపకారాలూ, జీవిత మార్గాలున్నూ.

మరి నేనో ? బురదలో పుట్టింవాన్ని. బురదలోనే పెరిగాను. మేక వన్నెపులు లాంటి జనం నావాళ్ళు. జీవితంలో ఎన్నోసార్లు నేను ఘోరమైన పతనం చెంది నీచమైన జీవితంలో కొట్టుకుపోవలసినంతలేసి ఆపదలు నాకొచ్చేయి. అలా పతనమైపోకుండా నేనివాళ యిలా జీవిస్తున్నానంటే దానికి సూటిగానో, చాటుగానో బావగారే కారణం. సాంబం మానయ్యోగారింట్లో అంత అవమానం జరిగాక నేను పారిపోయిరావడానికి నాకు ఆశ్రయం యివ్వగలిగిన వారు ఈ బావగారు ఉండడమే ఆనాడు కారణం. ఏడుపులోంచి నవ్వును ఒలికించి నాకు లేడీస్ క్లబ్‌లో అటెండెంటు వుద్యోగం, అక్కణ్నించి ఈ నవనారీ గృహం మెస్సులో గుమాస్తా వుద్యోగం రెండూ ఆయన ద్వారా వచ్చినవే. ఆయన నాకు గార్డియన్. అక్క నాకు వరసకి అక్కే గాని నిజానికి తల్లే కదా... నా పెళ్ళి కోసం మూడు వేల రూపాయలు కూడబెట్టింది."

అయినా ఆవిడ యెవరు ? ఆవిడకి బావగారు అంత డబ్బు ముట్ట చెప్పడం దేనికి ? ఈ పిల్లల్నీ, ఈ ఇంటినీ నేను దిద్దలేనని అనుకుని ఆవిణ్ని చేరదీసే వుద్దేశం కలిగిందేమో బావగారికి? నన్ను వేరే విధంగా సెటిల్ చేసి తను వేరే విధంగా సెటిలవ్వాలని బావగారికి ఆలోచన కలిగిందా ? దురదృష్టం నన్నింకా వెంటాడుతూనే వుందా ?

అయినా ఆ అదృష్టానికి నాకు అర్హత లున్నాయా ?

అంత వుత్తములు బావగారు. నాకే ఈ ఆలోచన రావడం పొరపాటు. మంగ

మ్మ త్తయ్యకి రావడం ఇంకా అన్యాయం. నా కోసం యింత చేస్తున్న బావగార్ని నేను ఈ గౌరవం అడగొచ్చునా? అది పాపం కాదా?

—ఇలా ఆలోచనలు ఉదయంనుంచీ తనని వేధిస్తున్నాయి. ఎంతో సమయం గడవలేదు. అయినా నిత్యకృత్యాల మధ్య ఈ ఆలోచన్లు తనని వదలడంలేదే ఎందుకని?

* * *

"నీ కోసం మెస్సుకి వెళ్ళాను!"

రామకృష్ణ గొంతు విని నిర్ఘాంత పోయింది రాజీ.

రాత్రి తొమ్మిది దాటింది.

గర్ల్స్ హైస్కూల్ బస్‌స్టాప్ దగ్గర నిలబడింది రాజీ - మెస్సులో పనంతా పూర్తి చేసుకుని, బావగారింటికి వెళ్ళడానికి బస్సుకోసం చూస్తూ.

"నేను పది నిమిషాలయింది ఇక్కడ నిలబడి. అంతకు ముందు మెస్‌లో నే ఉన్నానే!" అంది రాజేశ్వరి పొడిగా.

రామకృష్ణ ప్రేమికుడిలా నవ్వాడు. "నేను నూరు రోజుల్నుంచీ నీ దర్శనం కోసం తపిస్తున్నాను!" అన్నాడు.

"నేనిప్పుడు మెస్సులో ఉండడంలేదు. కేవలం పనివేళ మాత్రమే"

"అవును. మకాం మీ బావగారింట్లోనే అని మీ వార్డెన్ చెప్పారు...నువ్వు నాతో చెప్పినట్టు కాకుండా ఏలూర్నించి పది రోజులు ముందుగానే వచ్చేసేవుట కదా"

"అవును. ఘోరం జరిగిపోయింది. మా అక్క పోయిందని కబురు తెలిసి వచ్చేశాను"

"సర్లే... నేనేగా నీకామాట ఉత్తరం రాస్త!"

"మీరా?" అంది రాజీ దబాయింపుగా. "ఏం కాదు, మీకు నా అడ్రెసెవరిచ్చారు? మీరు మా బావగారింటి కెప్పుడెళ్ళారు? మా అక్క పోయిన కబురు మీరు నా కెప్పుడు రాశారు? అంతా వట్టిది"

"నేను మీ బావగారింటికి వెళ్ళాను. కబురు విన్నాను. మీ మెస్ వార్డెన్ నడిగి నీ అడ్రస్ తీసుకున్నాను. నీకు కార్డు రాశాను. అంతా వట్టిదంటావేమిటి?" అని కలియబడ్డాడు రామకృష్ణ.

"నా కందలేదు. బహుశా నేనక్కడ బయల్దేరేక అక్కడ చేరిందేమో— మీరు రాసేనంటున్న ఆ కార్డు! కార్డే కదా, చావు కబురే కదా అని ఎవరో చదివేసి చింపేశుంటారేమోలెండి" అంది రాజేశ్వరి గబగబా.

"అదేమిటి అలా మాట్లాడతావు? నేను మద్రాసు వెళ్ళేక కూడా నీకు ఉత్తరం రాశాను. అదలావుంచు. నువ్వు ఎప్పుడో రెండు నెలల కిందట ఈ ఊరొచ్చేసి, పరీక్షలు కూడా రాసేసి మళ్ళా మెస్సులో చేరి కూడా ఒక్కసారైనా నా గురించి ఎవర్నీ భోగట్టా చెయ్యలేదుట—ఎందుకిలా అయింది?"

"మీరు మద్రాసు వెళ్ళారని మీ ఆఫీసుకోసారి బావగారు ఫోన్‌చేస్తే చెప్పారుట. అది సరే— మీరు మద్రాసెందుకు వెళ్ళేరు? అక్కణ్నుంచి ఎప్పుడొచ్చేరు? నేనిక్కడికి వచ్చి రెండు నెల్లు దాటిందే. ఇప్పుడా మీకు తీరుబాటయింది, నన్ను వెతుక్కొంటూ రావడానికి? నేను మా బావగారింట్లోనే వుంటున్నానని మా వార్డెన్‌గారు చెప్పిందన్నారు. బావుంది, మరి ఆ యిల్లు మీకూ తెలుసే. అక్కడికైనా రాలేదేం?"

రామకృష్ణ నవ్వాడు. "నువ్వు చివరికి




ఎలా తయారయ్యావంటే రోజూ హీరోని అపార్థం చేసుకునే తెలుగు సినిమా హీరో యిన్లా గన్నమాట !"

"సర్లెండి. మీరు హీరోనూ, నేను హీరోయిన్నున్నూ. అదొక్కడే తక్కువ ఈ జాతకానికి" అని మొహం ముడుచు కుంది రాజీ.

"చెబుతా విను. నువ్వు రఫ్‌గా సెప్టెం బరు పదో తేదీని వచ్చుంటా విక్కడికి. నేను తొమ్మిదో తేదీని మద్రాసు వెళ్ళేను. అక్కడ మా దూరపుచుట్టం ఒకాయన బెస్ట్ అండ్‌కోలో పని చేస్తున్నారు. థర్డ్ క్లాస్ ఎమ్మేగాణ్ని నేను. నాకు కొత్తగా ఎవడిస్తాడులే ఉద్యోగం ? ఇలా హెడ్ ఫోన్స్ తగిలించుకుని టెలిఫోన్ ఆపరే టర్‌గా జీవితం వెళ్ళబుచ్చాల్సిందే అను కుంటున్న నాకు నువ్వు ఏలూరు వెళ్ళిన ఓ వారం రోజులకి ఆయన దగ్గిర్నుంచి ఉత్తరం వచ్చింది. ఇక్కడొక ఇంగ్లీషు దిన పత్రికలో సబ్ ఎడిటర్స్ కావాలట. నువ్వు వస్తే వేయిస్తాను. అయితే ఏడాది పాటు అప్రెంటిస్ చెయ్యాలి. అంత వరకూ స్టైయిపెండేగాని జీతం ఇవ్వరు. ఆలోచించి అంగీకారం అయితే వెంటనే రా—అంటూనూ".

"ఓహో..."

"మొదటేడాది స్టైయిపెండు నూట ఎనభై రూపాయల చొప్పున యిస్తారట. ఆ లెక్కని ఏ రెండు మూడు నెలలో అయితే సర్దుకోవచ్చు గాని సంవత్సరం పాటు బతకాలంటే సొంటి కొమ్ము ఒంటి వాడికైనా సరే కష్టం, అసాధ్యం అని నేను డ్రాప్ చేసుకున్నాను. కాని తొమ్మిదో తేదీ తెల్లారేసరికి టెలిగ్రాం వచ్చింది. నేను వెంటనే మా డివిజనల్ ఇంజినీర్‌గారి దగ్గిర కెళ్ళి ఒక నెల సెల వుకి ఆయన్ని ఒప్పించి ఆరోజే మెయిలు ఎక్కేశాను."

"అంటే యిక్కడ సెలవు పెట్టి అక్కడ పని చేశారా ?"

"అంతే తప్పింది కాదు. అయితే, గుడ్డిలో మెల్ల ఏమిటంటే ఇక్కడ నాకు సుమారుగా నాలుగు నెలల పదిహేను రోజులు పూర్తి జీతంమీద సెలవున్నాది. ఆ తరువాత సగం జీతంమీద మరో ఆర్నెల్లు పెట్టొచ్చన్నారు. ఏదో అలా ఒక ఏడాది గడిపేసి ఈలోగా వర్క్ నేర్చుకుని అక్కడ వుండిపోదమో ఇక్కడికి వెనక్కి వచ్చెయ్యడమో తేల్చుకుందామని తెగించేశాను".

దూరంగా టు-టౌన్ పోలీస్ స్టేషన్ దగ్గర పదమూడో నెంబరు బస్సు కంటి కానింది రాజీకి.

"అదుగో బస్సొస్తోంది. అదిక్కడికి రాగానే నేవెళ్తాను" అంది.

"తరువాత బస్సులో వెడుదువుగాన్లే వుండు!"

"అయ్యబాబోయ్, అప్పుడే తొమ్మిది ఇరవై. ఇంక నేనుండలేను బాబూ, అసలీ బస్సుల్ని నమ్మమని ఎవడు చెప్పేడు ? ఆఖరి బస్సు రైలు స్టేషన్ దగ్గర తొమ్మిది నలభైకంటారు. వాడు ఎనిమిదిన్నరకే 'డిపో' అని బోర్డు తగిలించుకుని అలా వెళ్ళిపోతాడు. అంచేత నేను పోతాను బాబూ."

"నువ్వు యివాళ ఎందుకింత కంగారు పడిపోతున్నావో తెలీడం లేదు నాకు. ఇంతాచేస్తే తొమ్మిదిన్నర కాలేదు. లోగడ మనం రాత్రి రెండు గంటలదాకా కలిసి వుండలేదా, కబుర్లు చెప్పుకోలేదా?"

'ఉన్నానుగా—ఎంత అనిష్టంతో

వున్నాను! ఎంత ప్రగల్భంగా చెప్పు కుంటున్నాడు' అనుకుంది రాజీ.

మౌనం ఆసరాగా తీసుకొని "ఇప్పుడు అప్పటి కంటే చిన్నదానివై పోయి భయపడుతున్నావా?" అన్నాడు రామకృష్ణ నవ్వి.

"చిన్నదాన్ని కాలేదు గాని; వార్డెన్ మార్పు కదా" అని రాజీన్నీ నవ్వింది.

"ఊఁ ఊఁ. అయితే అప్పుడు అమ్మ చాటు బిడ్డవి; యిప్పుడు బావగారి చాటు మరదలి వన్నమాట-!"

"మీ రలా గనడం బావు లేదు సుమండీ."

"నువ్వు నొచ్చుకుంటావనుకోలేదు రాజీ! సారీ. ఊరికే సర్దాకన్నాను."

"అక్క పోయిన తరవాత బావగార్ని చూస్తే ఎంత రాతి గుండెవాళ్ళకైన కడుపు తరుక్కుపోతుందనుకోండి. మనుషుల కోసం, అభిమానించే బంధువుల కోసం బావగారు మొహం వాచివున్నారు-ఏళ్ళ తరబడి. అయితే మా అక్కంటే ఆయన కెంతో యిష్టం, ప్రాణం కంటే కూడాను. అక్కవుంటే అందరూ వున్నట్టే అనుకునే వారాయన. అలాంటి అక్క పోగానే, బావగారు సన్యాసిలాగే అయిపోయారు. పిల్లలిద్దరికీ నా దగ్గిర బాగా చనువు. పైగా అక్కడ మా మేనత్తగారుంటారు. మాదంతా వొకటే కుటుంబం. అంతేగాని; నేను మెస్ వదిలి బావగారింటికి వెళ్ళానని నన్ను బావ చాటు మరదలు అనడం బాగాలేదు ......అయినా మిమ్మల్ని అనడందేనికి? యిందతా నా దురదృష్టం!"

"సారీ రాజీ! నువ్విలా ఫీలైపోతావని తెలిస్తే నేనలా అనుండే వాణ్ణి కాదంటున్నానుగా! అయినా నేనేం అన్నానని, నువ్వంత యిదైపోడానికి? మీ బావ గారు నీకు తండ్రీ, గురువూ, దైవం అని నాకు చెప్పనే చెప్పావుగా. నీకు వార్డెన్‌గా ఉండ తగరాయేమిటి, అన్న అర్థంలో అన్నానంతే."

బస్సు వచ్చేసింది. రాజీ చెయ్యి అడ్డం పెట్టింది. బస్సాగింది.

"వస్తానండీ."

ఎక్కబోతున్న రాజీని ఆపాడు రామకృష్ణ, దిగవల్సిన వాళ్ళు దిగగానే 'రై...రై!' అన్నారెవరో. బస్సు వెళ్ళిపోయింది.

"సారీ ఎగైన్. నేను నీతో గట్టిగా పది నిమిషాలు మాటాడలేదు. నువ్వెళ్ళిపోతానంటే కష్టంగా అనిపించి ఆపేశాను. పోనీ నేనూ ఆ బస్సులో యెక్కేద్దామా అంటే ఈ సైకిలొకటి, తంటసంలాగ తగిలించుకున్నాను!"

"పోన్లెండి. నడిచిపోదాం. సైకిల్ ఉందిగనక అట్నుంచి మీరు దర్జాగా హాయిగా వచ్చేద్దురు."

"మీ బావగారింటి దాకా రానా?"

"రండి!"

"మీ బావగారుంటారా, యింటి దగ్గర?"

"ఉంటే యేం?" అని వంకరగా చూసింది రాజీ.

"ఉంటేనే, వస్తాను ఆయనతో కూడా కాసేపు మాట్లాడొచ్చు కదా."

"అయితే పదండి. సైకిల్ స్టాండ్ తీసి నడిపించండి. నేనూ నడుస్తాను. తోవంతా చెబుదురుగాని, మీ కథ-!"

"కథేమీ లేదు......అక్కడ ఎప్రెంటిస్ సబ్ ఎడిటర్‌గా చేరేను. ఇక్కడ సెలవు పూర్తి జీతమ్మీద




యింకో రెణ్ణెల్లుండొచ్చు. సగం జీతం మీద మరో ఆర్నెల్లుందంటున్నారు. అంతా అయిపోయేదాకా అక్కడ పని చేస్తాను. అది బావుంటే దీనికీ, ఇది బావుంటే దానికీ రిజైన్ చేస్తాను" అన్నాడు రామకృష్ణ-సైకిలుకి రాజేశ్వరికీ మధ్యగా నడుస్తూ.

''బావుంది. కథేమీ లేదంటూనే తెలుగు సినిమా ఇంటర్వెల్ వరకంత చెప్పారు."

"తరువాత కథ తెరపై చూడ్డమే.''

నిండుగా, తృప్తిగా నవ్వింది రాజీ.

ఆ పారవశ్యం అయిపోయాక ''అక్కడ వుద్యోగం దీనికన్నా బావుండాలి కదూ ?'' అంది రాజీ.

"బావున్నాదా, మరీ బావున్నాదా? అందులోనూ, పత్రికాఫీసులో పని కదా. బోలెడుమంది పరిచయం అవుతున్నారు డెయిలీనీ''

"ఇంకేం ఏ సినిమావాళ్ళో పరిచయం అవుతారు. చటుక్కున మిమ్మల్ని సినిమాల్లో ప్లేబాక్ సింగర్‌గా తీసికెళ్ళిపోతారు!'' అని మళ్ళీ నవ్వింది రాజీ.

"నువ్వలాగే జోకులేస్తూ వుండు. నేను లైఫ్ యిచ్చే షాక్స్‌కి తట్టుకోలేక.."

జగదంబా జంక్షన్ దగ్గిరి కొచ్చేరలా కబుర్లు చెప్పుకుంటూ యిద్దరూనూ. అక్కడ హటాత్తుగా రామకృష్ణ "నమస్కారం సార్ !" అని ఆగేడు. రాజేశ్వరి అటు చూసింది. రోడ్డు పక్కన వున్న షాపులో ఏదో కొన్నట్టున్నాడు.



రాజారావు అప్పుడే రోడ్డు మీద పెట్టిన స్కూటర్ దగ్గిర కొచ్చి ముందుబ్యాగ్‌లో పెడుతున్నాడా వస్తువులు.

"నమస్కారం!... రామకృష్ణగారు కదు? ఎప్పుడొచ్చేరు?"

"నేనాండీ?..." అని కంగారుపడ్డాడు రామకృష్ణ, "నిన్న మెయిల్లో–"

"మద్రాసెళ్ళారగా!"

"అవునండీ, నా గురించి భోగట్టా చేసేరా?"

"మరేండీ. ఆ మధ్య మా ఫ్రెండొ కతనికి కొత్త టెలిఫోన్ కనెక్షన్ కావలసి వస్తేనూ, మీ వాళ్ళు కొంచెం అల్లరి పెట్టున్నారని, ఎవరితోనన్నా చెప్పించ మనీ రిక్వెస్ట్ చేసేడు. మీకిదివరకు డి. ఇ. టి గా ఉండేవారు సీతారామయ్య గారు ఆయన్నాకు తెలుసు. కాని ఆయన ట్రాన్స్ఫరై పోయార్ట. పోనీ ఎస్.డి.ఓ. లెవెల్లో ఎవర్నయినా కాంటాక్ట్ చేద్దామని మిమ్మల్ని కన్సల్ట్ చేసేందుకు మీ నెంబర్‌కి రింగ్ చేసేను. మీరు మద్రాస్ వెళ్ళేరన్నారు....జబ్బు పడ్డార్టగా? మద్రాసా, రాయవెల్లూర్ వెళ్ళారా?"

"మద్రాసేనండి" సిగ్గుపడుతూ చెప్పాడు రామకృష్ణ.

"ఏమిటి, సిక్‌నెస్సు? మన వూళ్ళో కె.జీ. హెచ్. వుంది కదా?"

రామకృష్ణ సిగ్గును నవ్వుగా మార్చాడు. "సిక్ అంటే సిక్ కాదండి; సిక్ లీవు– అంతే."

"చాలా రోజులు పెట్టినట్టున్నారే?"

"అవునండీ. చాలా రోజులింకా పెట్టాలి కూడానూ."

రాజేశ్వరి అందుకుంది – "ఆయన మద్రాసులో ఒక ఇంగ్లీషు డెయిలీలో సబ్ ఎడిటర్‌గా వెళ్ళిపోతున్నారు బావ గారూ."

"ఐసీ. కంగ్రాచులేషన్స్."

"థాంక్సండీ. కాని ఇంకా ఏం డిసైడ్ చేసుకోలేదండి. ప్రస్తుతం సెలవులో వుండి అప్రెంటిస్ చేస్తున్నాను. బాగా తక్కువ యిస్తారండి ఒక ఏడాది పాటు స్టయిపెండు అంటూనూ. ఏడాది పోయాక స్కేల్లో పెడ్తార్ట. ఏడాది గడిచినా స్కేల్లో పెట్టకండా అలానూట ఎనభైతో ఏడవమంటారు కూడానండి కొందర్ని."

"నూట ఎనభై రూపాయలా? ఘోరం కదు?"

"చెప్పేను కదండీ. దాని పేరు స్టయి పెండు. ఆమాత్రం జీతంకూడా లేకండా ఓ పాతిక మంది కంపోజిటర్లు వుంటా రండి ఆ ఆఫీసులో?"

"అయ్యో! న్యూస్ పేపర్లంటే దేశంలో కష్టాలు నలుగురికీ చెప్పేవి కదా. అక్కడా అండర్ పేమెంటేనా?"

"అవునండీ...పాపం మీ మిసెస్ పోయార్ట కదండీ. వెరీ సారీ సార్" అన్నాడు రామకృష్ణ. "ఆ రోజుల్లోనే వచ్చిందండి నాకీ ఆఫర్. మీకోసారి కనబడదామని మీ ఇంటికి వచ్చాను. మీరెక్కడో లోపల వున్నారని, డిస్టర్బ్ చెయ్యడానికి వీల్లేదని అన్నారు, మీ బ్రదర్– రెండు నెలలు దాటిందనుకుంటా నండి."

"అవును. రెండు నెలలకెక్కువే అయింది. మనం మొట్టమొదట కలుసు కున్న రోజునే మా మిసెస్ పోయింది!"

రామకృష్ణ మాటాడలేదు.

రాజేశ్వరికి రాజారావు మాట విని, రామకృష్ణ నిశ్శబ్దం చూసి బాధ కలి




గింది. 'మనం మొట్టమొదట కలుసుకున్న రోజునే మా మిసెస్ పోయింది' అనడంలో 'మనం మొట్టమొదట కల్సుకున్నందు వల్లనే' అన్న ధోరణి వచ్చేస్తోందేమోనని, 'మనం మళ్ళీ రెండో సారి కల్సుకున్నాం- ఇవాళ ఏమవుతుందో' అన్న ధోరణి కూడా వచ్చేస్తోందేమోననీ భయపడింది. అయినా ఆమెకి కూడా మాట రాలేదు నోట.

"మరి నేనెళ్ళొస్తానండి" అన్నాడు రామకృష్ణ.

"రండి. మా ఇంటికే బయల్దేరినట్టున్నారే!"

"అవునండీ మీ ఇంటికే. కాని పెద్ద పనేం లేదండి. నేను మళ్ళా రేపే మద్రాస్ వెళిపోతున్నానండి. అంచేత ఓ మాటు మిమ్మల్ని చూదామని బయల్దేరాను. రాజీ మీ ఇంట్లోనే వుంటోందని తెలిసింది. చాలా సంతోషం సార్- ఆ మెస్ రూం ఖాళీ చేయించి మీ ఇంట్లో వుంచుకున్నందుకు. ఆ వుద్యోగం కూడా మాన్పించేస్తే..."

"చూడాలి. మరేదైనా జాబ్ దొరకాలి కదా."

"మీరు గట్టిగా తల్చుకుంటే అదెంత పని సార్ ?"

"సర్లెండి. ఇన్నాళ్ళూ నేను గట్టిగా తల్చుకోకనే ఈ ప్రపంచం అంతా ఆగిపోయిందంటారాయేమిటి?" అని నవ్వాడు రాజారావు.

"పోనీ ఎవర్నయినా చూసి పెళ్ళి చేసెయ్యండి" అని రాజేశ్వరివైపు పెంకెతనంగా చూశాడు రామకృష్ణ.

"బాగుందండోయ్! అది మాత్రం అంత సుళువా, అందులోనూ ఇలాంటమ్మాయికి?- ఈ రాక్షసికి!"

రాజేశ్వరి ఆ కులాసాలో చిరాకు చూపించింది. "నాకేం. తక్కువో ?" అంటూ కలియబడి, "పైగాట, నేను రాక్షసినట ! ఊరుకోండి!"

"రాక్షసి అంటే గుణం ఒక్కటేనా ? నిశాచరి అన్నమాట. అంటే ఎవరు రాత్రి పది గంటల వరకూ ఇంటికి చేరరో వారంతా నిశాచరులు కదా !" అన్నాడు రాజారావు, సరదాకన్నానన్నట్టు నవ్వి. "అచ్చా! మరి నేను వెళ్ళాలి. కావాలంటే మీరు మరికాస్సేపు ఉండి రండి, మా యింటికి. లేదా, ఇలా వచ్చేసినా సరే..." అని స్కూటర్‌స్టార్ట్ చేశాడు. రాజేశ్వరి వెనకాల కూచుందికి ప్రయత్నం ఏమీ చెయ్యకపోయే సరికి "విష్యు బెస్టాఫ్ లక్" అని గేర్ మార్చబోయాడు.

రామకృష్ణ చెయ్యి అడ్డం పెట్టాడు. "నో సార్! నేనూ అర్జంటుగానే వెళ్ళిపోవాలి. రాజీని మీతో తీసుకుపోండి" అని రాజేశ్వరి వేపు తిరిగి, "లెటర్స్ రాస్తూ వుండేం" అన్నాడు.

రాజేశ్వరి స్కూటర్ వెనక సీటు మీద కూర్చుంటూ "గొప్ప తెలివే. అడ్రసయినా ఇవ్వలేదు గాని, లెటర్స్ రాయాలిట!"

"నేననుకుంటూనే వున్నాను నీ తెలివి ఇలా బండబారి పోతుందని!" అన్నాడు రామకృష్ణ. "ఆఁ తెలిసింది ! నువ్వు ఉండడం మీ బావగారింట్లోనే అయినా భోజనం ఇంకా మెస్‌లోనే కదా. అదీ సంగతి ! లేకపోతే న్యూస్ పేపర్ఆఫీసు అడ్రసు కూడా కనుక్కోలేనంత బ్లంట్ అయిపోవు!"

"ఆఁఆఁ చాల్లెండి!" అని రాజారావుకి

సిగ్నల్ ఇచ్చింది రాజీ.

రాజారావు ఓ చెయ్యి రామకృష్ణకు ఊపి, స్కూటర్ని పరుగెత్తించాడు.




కె.జి. హెచ్.— అప్ దగ్గిర అన్నాడు "మద్రాసు నీళ్లు వంట పట్టాయి కుర్రాడికి!"

రాజీ మాట్లాడలేదు.

"కొంచెం నున్నబడ్డాడు కదూ?"

"........."

"కొంచెం కండ కూడా పట్టాడు, ఏం?"

"........."

"మాట ధోరణి కూడా మారింది."

"........."

"మొత్తం మీద బాగా మారాడు! లేకపోతే నా మొహం! చక్కగా ఎమ్మే పాసయ్యీకూడా టెలిఫోన్ ఎక్స్ఛేంజిలో ఉద్యోగమేమిటి? న్యూస్ పేపర్లో సబ్ ఎడిటరన్నా అంత గొప్ప జాబేమీ కాదు గాని ఎలాగైనా చదువుకున్న వాళ్ళతో, థింకర్స్‌తో మెసుల్తాడు కదా."

"........."

"అయినా అక్కడా ఏవో క్షుద్ర రాజకీయాలుంటాయి గావును. తెలుగు వాళ్ళు—తమిళులు అనుకుంటాను. ఒకరు ముందు కొస్తే మరొకరు ఓర్చలేరు!"

"........."

"ఇతనికి ఏదో ఫుల్ ఉన్నట్టుంది, కదూ?"

"........."

"మాట్లాడవేం రాజీ,"

రాజేశ్వరి అతని మీదికి వంగింది. "నేను మాట్లాడినా మీకు వినపడదు బావగారూ" అంది బిగ్గరగా.

"నేనేం మాట్లాడినా మీరు సరిగ్గా అర్థం చేసుకోరు" అన్నానని— కనీసం అలాటి అర్థం స్ఫురింప చేసేనని అనుకుంది రాజీ, ఆమాట అని.

రాజేశ్వరికి ఉదయం నుంచి బావగారిమీద చాలా కసిగా వుంది. నాకెందుకింత కోపంగా వుంది ఈయన మీద అని నాలుగైదు సార్లు తనని తాను ప్రశ్నించుకుంది. బావగారు ఇవాళ రామకృష్ణ ఎదురుగా బొత్తిగా కఠినంగా ప్రవర్తించినట్టనిపిస్తోంది. తనూ, అతనూ మాట్లాడుకుంటూ వస్తున్నారు. అందులో ఏమిటి తప్పు? రామకృష్ణ ఇంకా మద్రాసు విశేషాలు చెబుతున్నాడే తప్ప, పూర్వంలాగా కనబడిన వెంటనే బీచికిపోదాం, సినిమాకి పోదాం, హోటల్లో దూరుదాం అంటూ హింసించలేదు. ఈ మాత్రం దానికి బావగారికి అంత ఇదెందుకు?

రామకృష్ణ కనబడ్డది మొదలు బావగారు చేసిన ప్రసంగం - అది ఎంత మాత్రం హుందాగా లేకపోగా, అసహ్యంగా కూడా వుంది! - జబ్బు పడిపోయార్టగా అని పలకరించడం; మద్రాసా, రాయవెల్లూరా అని పరామర్శించడం. అంటే ఏమిటి? విశాఖపట్నం కేజీహెచ్‌లో కుదరని జబ్బు, రాయవెల్లూరు వెళ్ళిపోవలిసినంత జబ్బు రామకృష్ణగారికి రావాలనా యేమిటి ఆయన ఉద్దేశం?

రామకృష్ణగారితో తనని గురించి చేసిన చర్చ...అదీ లేకిగా వుంది. తనని ఈ జాబ్ మాన్పించి ఇంకోటి చూడమని అతనన్నప్పుడు; పోనీ పెళ్ళి చేసెయ్యమన్నప్పుడు—బావగారేమన్నారు? నేనేదో తన కంట్రోల్లోలేనట్టు; ఆయన తల్చుకుంటే నా జీవితాన్నే మార్చెయ్యగలిగినట్టూనూ! మార్చెయ్యగలిగే వుండొచ్చు గాని ఆయన రామకృష్ణగారితో అలా మాట్లాడ్డం చాలా అనవసరం! రాత్రిళ్ళు నేను ఇంటికి ఆలస్యంగా వెడుతున్నానని పాయింటు తీసి నన్ను నిశాచరీ, రాక్షసీ అన్నారు. నాడ్యూటీ అలాటిదని ఆయనకీ తెలుసీయనకీ తెలుసు! మరి దాన్ని ఏదో తప్పులాగా బహిరంగంగా చర్చించుకోవడం దేనికి?

'మనం మొదటిసారి కల్సుకున్ననాడే నా మిసెస్ పోయింది!' అన్నారు. అది చాలా అమానుషం.

రామకృష్ణ వెళ్ళిపోయాక కూడా ఆయన అతన్ని గురించి అన్నమాటలు సమంజసంగా లేవు. ఎనభై రోజుల తరువాత రామకృష్ణగారు నాకు కనపడ్డారు. నేనేమో అతనికి రంగొచ్చిందని, కండొచ్చిందని, నున్నబడ్డాడని, ధోరణి మారిందని, చదువుకున్నవాళ్ళతో ఆలోచనా బలం కలవాళ్ళతో మెసిలి ధగధగలాడిపోతున్నాడని మురిసిపోయి పొంగిపోయి అతన్తో తిరుగుతున్నానన్న అభాండం వేసినట్టు తెలియకుండా వేసేరు బావగారు. అసలు రామకృష్ణగారితో నేనెప్పుడూ ఎంత మాత్రం కూడా ఇంటిమేట్‌గా మాట్లాడలేదు. అతనెప్పటికప్పుడు చొరవ చెయ్యబోవడం, నేను తగ్గమంటూ వుండడమే జరుగుతోంది. అయినా అతనితో మాట్లాడుతున్నానని, తిరిగేస్తున్నానని బావగారికి ఈర్ష్యకాబోలు అనుకుంది రాజేశ్వరి.

'బావగార్ని' అన్నిరకాలుగా అనిష్టంతో చిత్రించుకోడానికి కారణం పొద్దుట పూర్ణా మార్కెట్ దగ్గిర తెల్లచీరా, తెల్ల జాకెట్టుతో కనబడిన ఆవిడేనని అసలు తట్టలేదు రాజేశ్వరికి.

* *

చీర మార్చుకుని డైనింగ్ టేబిల్ దగ్గిర కొచ్చేసరికి రాజారావు తనే స్వయంగా పళ్ళెం మంచినీళ్ళు పెట్టుకుని అన్నం వడ్డించుకుంటున్నాడు. నేతి గిన్నె కోసం అలమారువేపు తిరిగి చెయ్యిజాపే వేళకి వెళ్ళింది రాజేశ్వరి.

"చాల్లెండి, అంతా హడావుడే! నే వస్తున్నానుకదా, ఈ మాత్రందానికే..." అని ఆయన చేతికి అందకుండా నేతిగిన్నె తీసుకుంది.

రాజారావు నవ్వాడు "నేననేదీ అదే రాజీ. ఈమాత్రందానికే..."

"కరిగేదాకా ఆగగలరా, ముద్ద వెయ్యమంటారా?"

"ముద్దే"

ఒకముద్ద వేసి రెండో విడత కోసం గాస్‌పొయ్యి దగ్గిరి కెళ్ళింది రాజీ.

"అవున్లెండి. ఇవాళ అసలే లేటయిపోయింది!" అని పొయ్యి వెలిగించి నేతిగిన్నెను పట్కారుతో పట్టుకుని నీలిమంట మీద దూరంగా పెట్టింది.

"అవును లేటయింది"

మళ్ళీ అతని వేపు పెంకెతనంగా చూస్తూ "మీరూ రాక్షసులయ్యారు, పాపం" అంది రాజీ.

రాజారావు నోట్లో ముద్దతో ఆమెవేపు చూసేడు.

"రాత్రి పదిగంటల్లోగా ఇంటికి చేరని వాళ్ళందరూ నిశాచరులూ, రాక్షసులూ అన్నారు కదండీ" అని నవ్వుతూ కరిగిన నేతితో వున్న గిన్నెను స్టవ్ ఆఫ్‌చేసి టేబిల్ దగ్గిరికి తెచ్చింది రాజీ. టేబిల్ మీద డెకొలామ్ వేడెక్కిపోకుండా ఏర్పాటు చేసిన రబ్బరు డిస్కుమీద పెట్టింది గిన్నెను.

"కూర్చో. నిలబడ్డం ఎందుకు? ఇంకా చాలా సేపు పడుతుంది. ఇవాళ చాలా ఆకలిగా వుంది."

'ఆకలో, కోపమో?' అనుకుంటూ పైకి "నిలబడ్డం మెస్సులో అలవాటు" అని నవ్వింది రాజీ; కూర్చుంది.

"చివరికి మా ఇల్లు కూడా ఒక మెస్ చేసేటట్టున్నావు నువ్వు" అన్నాడు రాజారావు. "నేను గ్రహించలేదు. నువ్వీ ఇంట్లో ప్రవేశించిననాడే నా జీవితం ఒక మెస్సయిపోయింది." అనుకున్నాడు.

"పిక్చర్ కెళ్ళారా?"

"లేదు సింహాచలం వెళ్ళాను"

"ఉదయం వెళ్ళకపోయారా?"

"ఉదయం వెళ్ళేరోజింకా రాలేదు."

"......?"

"అదికాదు రాజీ ఉదయం వెళ్ళడానికి నేనేం కొబ్బరికాయ కొడదామనీ, కొండెక్కుదామనీ వెళ్ళలేదుగా."

'గెస్టుహౌసులు కిందనే ఎక్కువ వున్నాయి' అనుకుంది రాజీ కసిగా. "మరెందుకెళ్ళారుటో?" అంది.

"అదంతా వో కథ"

'అవును, కథేమరి!' అనుకుంది రాజీ. 'జరిగిన కథేమిటో ఎలాగూ చెప్పరు. చెప్పేకథయినా ఎలా వుంటుందో విందాం' అని కూడా అనుకుంది.

"చెప్పండిమరి–అదీ చాలా సేపుపడుతుందా?"

రాజారావు ఒకవాయి అన్నం తినడం పూర్తిచేసి చెపాతీల గిన్నె చూపించేడు. రాజీ మూత తీసింది. అందులో రెండున్నాయి. రెండూ వెయ్యబోయింది. చెయ్యి అడ్డం పెట్టి ఒకవేలు చూపించేడు, ఎడం చేతో గ్లాసు అందుకుని మంచినీళ్ళుతాగుతూ.

రాజేశ్వరి అతని పళ్ళెంలో ఒక చపాతీ, మరికొంత కూరా వడ్డించింది. "అది నువ్వు తిను" అని రెండో చపాతీ చూపించేడు రాజారావు.

"వద్దు బావగారూ! నాకాకలి లేదు" అంది– అన్ని భావాలూ ఆ క్షణంలో మరిచిపోయి, తన సహజమైన మోహ మాటంతో.

మూతగా వుపయోగించి ఇప్పుడు పక్కన పెట్టిన ప్లేటులోకి, గిన్నెలోవున్న చపాతీని గిన్నెను ఎడంచేత్తో పట్టుకుని పడేశాడు రాజారావు. కూరను గరిటెతో వడ్డించాడు. "నడిచి నడిచి అలిసిపోయుంటావు. ఒక్కటి తిను. ఇంతలో నీకేం వొళ్ళొచ్చెయ్యదు" అన్నాడు.

"చపాతీకి ఒళ్ళు రాదు. ఇదిగో దీనికి!" అని నవ్వుతూ కొంచెం నెయ్యి వడ్డించుకుంటూ అంది రాజీ.

"మరేం? ఒళ్ళంటే నీకూ యిష్టమే" నవ్వాడు రాజారావు.

"ఎవరి ఒళ్ళు వారికి ఎంత లావైనా యిష్టంగానే వుంటుంది" అని సుతారంగా చపాతీని విరచడం అరంభించింది రాజీ.

* * *

"మా ఆఫీసులో రంగయ్య అని క్లాస్ ఫోర్ ఉద్యోగి ఒకడు సుమారు రెండు నెలలకిందట పోయాడు. అతని భార్య–చాలా చిత్రం అనిపిస్తుంది చెబితేను–గ్రాడ్యుయేటు!" అని ప్రారంభించాడు రాజారావు.

తెల్లచీరా తెల్లజాకెట్టూ, గ్రాడ్యుయేటన్నమాట! అందుకే ఆ మిలమిల— అందుకే ఆ స్మార్ట్‌నెస్సు — అనుకుంది రాజీ.

"ఇతగాడు తెచ్చిన జీతమంతా తాగడానికీ బ్రాకెట్లకీ వాడేస్తుంటే గోలెట్టేసేది. ఆఖరికి భరించలేక ఓసారి సరాసరి ఆఫీసుకొచ్చేసి మా డిప్యూటీ డైరెక్టర్ గారితో మొరెట్టుకుంది. అయ్యా, నేను ప్రతినెలా జీతాలరోజున వస్తాను. ఆయన జీతం అంతా కాకపోయినా కనీసం నూటయాభై రూపాయలు నా చేతికి యిచ్చేటట్టు ఏర్పాటు చెయ్యండి బాబూ. లేకపోతే కొంపలో తిండి వుండడం లేదంటూనూ".

"పాపం" అంది రాజీ; సగం జాలి 'కథ అల్లకం' మీద అనుభవిస్తూ.

"పోనీ నువ్వు గ్రాడ్యుయేట్నంటున్నావు కదా, ఏదైనా ఉద్యోగంలో చేర్రాదుటమ్మా అని మా డి. డి. గారు అన్నారు. అలా పనికిరాదంటాట్ట రంగయ్య. వాళ్ళ కుటుంబంలోనే కాక వంశంలో లేదుట, కులంలోనే లేదుట ఆడది ఉద్యోగమో, మరేదో చేసి సంపాదించుకోడం."

'మరోటి!... అదేమిటో ?' అనుకుంది రాజీ– "అలా వుంటాయి గావును, ఫాల్స్ ప్రెస్టేజీలు!" అంటూ.

"చివరికి ఆ యేర్పాటు జరిగింది. గత ఏడాదిగా, లేక పదిహేను నెలలయిందో మరి; రంగయ్య వైఫ్ వచ్చి నెలనెలా నూటయాభై రూపాయలు పట్టుకెళ్ళడం అవుతోంది. రెండు నెలల కిందట రంగయ్య లివర్‌కి సిరోసిస్ వచ్చి చచ్చిపోయేడు. అతను బతికుండగా అతనికి రావలసుండిన కొన్ని ఎరియర్స్, అతను పోయిన నెలలో ఆ రోజులకి అతని జీతం, ఈ రెండు నెలలకీ ఆవిడికి రావలసిన ఫామిలీ పెన్షను– యివన్నీ కలిపి సుమారు ఏడెనిమిదివందల రూపాయలుంటాయి. నిన్ననే ఆవిడ పేర బిల్సు కాష్ అయ్యాయి. ఆవిడ తాసిల్దార్ దగ్గిర్నుంచి లీగల్ హెయిర్ సర్టిఫికెట్ తెచ్చుకోడమే లేటయింది; లేకపోతే ఎప్పుడో అయిపోను!

"నిన్న సరే, కాష్‌కోసం గుమాస్తా బ్యాంక్ కెళ్ళాక, అతని పెళ్ళాన్ని కె.జి.హెచ్. లో జాయిన్ చేసేరని అతన్ని వెంటనే రమ్మని కబురొచ్చింది. ఈవిడేమో డబ్బుకోసం ఆఫీసుకొచ్చి కూర్చుంది. మా డి.డి. గారు బిల్సు మీద ఆవిడ సంతకాలు తీసుకొని ఆ డబ్బు నిన్నరాత్రో, ఈ ఉదయమో అందజేసే పూచీ నామీద పెట్టేరు. నిన్నరాత్రి కాష్ క్లర్క్ వచ్చేసరికి ఏడున్నర అయింది. పెట్టిన సంతకాల దాఖలా డబ్బు నేను తీసుకుని యివాళ వుదయం ఆవిడికి అందజేసేను!

"ఈ పనంతా ఇలా అవుతుండగా తను సింహాచలం దేవస్థానంలో ఒక క్లర్కుద్యోగానికి అప్లయి చేసేననీ, రేపు ఇంటర్‌వ్యూ వుందనీ, ఎవరైనా రికమెండ్ చేస్తే తనకొస్తుందనీ నాతో చెప్పుకుని ప్రాధేయపడింది రంగయ్య భార్య. సరే రాఘవరావుగారు నాకు బాగా తెలుసు కదా అని ఆ పూచీకూడా నెత్తినేసుకుని ఇవాళ సాయంకాలం ఆవిడ్ని సింహాచలం తీసికెళ్ళి ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌కి పరిచయం చేసి ఆవిడ విషాద గాథంతా చెప్పి సాయం చెయ్యమని రికమెండ్ చేసేను!"

ఇదన్న మాట కథ! .

ఇదేనా, అసలుకథ ?

సింహాచలం—

దేవస్థానం—

చౌల్ట్రీలు, గెస్టుహౌసులు ఉన్నా యక్కడ—

రాజేశ్వరికి తెలుసును......

మెస్‌లో కొందరక్కడికి 'హోటూ' వుంటారు. అందులో రంగనాయకి ఒకతె.

అగ్రికల్చర్ డిప్యూటీ డైరెక్టర్ ఆఫీసులో స్టెనోగా వుంది ప్రస్తుతం. పోలీస్ సర్కిల్ ఇనస్పెక్టర్ మధుసూధన రావుగారికి 'బంధువు'. ఆయన మోటార్ సైకిల్‌మీద తరచు కనిపిస్తుంది—సినిమా హాళ్ళ దగ్గర, బజార్లోనూ. అదేమంటే, "అదంతే. కొందరిదే అదృష్టం" అంటుంది రంగనాయకి.

రంగనాయకి తనకన్నా నాలుగేళ్ళు పెద్దదైనా సినిమాల విషయంలో, పుస్తకాల విషయంలో యిద్దరి అభిరుచులూ దగ్గర దగ్గర ఒక్కటే. అలా జరిగింది "రంగా" అంటే "రాజీ" అని పిల్చుకోడం.

ఓ మారు సరిగ్గా ఏడాది అయి వుంటుందిప్పటికి.

"రాజీ! మనం సింహాచలం వెళ్ళాలోయ్ ఇవాళ!" అంది రంగ ఉదయం కాఫీలవగానే.

శాంతక్కా, బావగారూ, మంగమ్మత్తా, పిల్లలూ ఆ రోజు భీమ్లీ వెళ్ళారు— బావగారి స్నేహితుడొకాయన మినీబస్ ఏర్పాటు చేస్తేను.

చాలా రోజులైంది గుడికెళ్ళి.

"సరే వెడదాం" అంది తను.

"ఉదయం ఎనిమిదిన్నరకి బ్యారక్స్ దగ్గిర బస్సెక్కేరు ఇద్దరూనూ. ఎనిమిది గంటలకే బస్‌స్టాపు దగ్గిర చేరేరు. రెండు బస్సులు కొంత ఖాళీగా వెళిపోతూవుంటే కూడా "ఈ బస్సొద్దు; తరవాతి బస్సులో వెడదాం" అంటూ ఆపు చేసింది రంగనాయకి.

ఎనిమిదిన్నరకొచ్చిన బస్సు బాగా రద్దీగా వుంది. అయినా "ఎక్కు, ఎక్కు" అని రాజేశ్వరిని బస్సులోకి నెట్టింది రంగనాయకి.

సింహాచలంలో దిగగానే కొండమీది కెళ్ళే దేవస్థానం బస్సు సిద్ధంగానూ వుంది, టిక్కెట్ల కౌంటర్ దగ్గిర క్యూ లేదు కూడానూ.

సంబరపడి పరుగెత్తింది రాజీ.

"ఆగు, ఆగు!" అని పైట చెంగు పట్టుకోబోయింది రంగనాయకి. అది అందినట్టే అంది చేజారిపోతే ఈ మాటు జడే పట్టుకుని ఆపింది.

"అబ్బ!" అని అరిచి ఆగింది రాజీ.

"మనం యిక్కడ ఆగిపోతున్నాం" అంది రంగ.

"దేముణ్ణి చూడొద్దూ?"

"నో. చందన్ గెస్ట్‌హౌస్‌కెడుతున్నాం"

"ఎందుకు?"

"చెబుతాగా!"

కొంతదూరం నడుచుకుంటూ వెనక్కొచ్చి, కొండవాడ్డున తోటలో రాష్ట్ర ప్రభుత్వం వారు నిర్మించిన అతిథి గృహానికి వెళ్ళారిద్దరూనూ.

పీళ్ళకి కొంచెం ముందు ఇద్దరు యువకులు—చేతుల్లో పెద్ద పెద్ద ఎయిర్ బ్యాగ్స్‌తో.

రూమ్ నెంబర్ టు తాళం అడిగి తెరిచారు ఆ యువకులు. "రా!" అని లోపలికి తను వెడుతూ రాజేశ్వరిని లాగింది రంగనాయకి.

తెలిసిన వాళ్లు కాబోల్లే. కాసేపు




కూర్చుని తనే వొచ్చేస్తుందనుకుని వెన కాలే వెళ్ళింది రాజీ.

అక్కడ ఐదు నిమిషాల్లోగా తెలిసి పోయింది. అక్కడికి రంగనాయకి వొచ్చిందెందుకో, తనని లాక్కొచ్చిం దెందుకో కూడానూ.

"ఛీ! ఎంత బుద్ధిలేదు నీకు! ఇది ఎలాంటి పుణ్యక్షేత్రం! మీరు తల పెట్టింది ఎంత పాపపు పని?" అని విరుచుకుపడింది రాజీ రంగనాయకి మీద.

మగవాళ్ళిద్దరూ యేదో పనున్నట్టు "మీరు మాట్లాడుతూ వుండండి రంగ నాయకిగారూ, మేం అలా వెళ్ళి ఇప్పుడే వచ్చేస్తాం!" అని గదిలోంచి బయటి కొచ్చారు.

"అలాగే సార్" అని రంగనాయకి చిరునవ్వు నవ్వుతూ తలుపుగెడ వేసింది లోపల. రాజేశ్వరిని గుచ్చి కౌగలించుకుని మంచంమీద కూర్చోపెట్టి, "ఆవేశపడకు సోదరీ" అంది. రాజేశ్వరికి వొళ్ళంతా తేళ్ళూ జెర్రులూ పాకినట్టయింది. రంగ నాయకి ఆమెను సేదదీర్చే ప్రయత్నంలో ఒళ్ళంతా తడిమి, అక్కడా అక్కడా ముద్దాడి, "నేను చెప్పినట్టు విను రాజీ. ఇందులో తప్పేమీ లేదు. అందులో మన లాంటి స్వతంత్రులకి. వాళ్ళిద్దరూ ఎవ రనుకుంటున్నావు? వైజాగ్‌లో పెద్ద పెద్ద బిజినెస్ మాగ్నేట్స్ కొడుకులు. అందులో ఆ పొట్టివాడులేడూ ఆయన గారు ఒక పెద్ద షిప్పింగ్ కంపెనీకి మేనేజరు. బాగా డబ్బున్న వాళ్లు ఇద్దరికి ఇద్దరూనూ. డబ్బే కాదు. మంచి సర దాలున్న వాళ్ళు, సంస్కారం వున్న వాళ్లు. ఏమీ బలాత్కారం వుండదు.



పువ్వులా చూసుకుంటారు. అడుగులకి మడుగులొత్తుతారు. ఎందుకు ఈ అందం, వయస్సూ అడివికాచిన వెన్నెల చేస్తావు? ఎన్నాళ్ళిలా చప్పిడి బతుకులో అల్లాడుతావు? ఎంతసేపు? పట్టుమని ఓ గంట అంతే! చెరి నూటయాభై రూపాయలూ పుచ్చుకొని టింగురంగా అని వెళిపోతాం. అంతే" బుజ్జగించి, బెల్లించి, బ్రతిమాలి, భంగపడి చెప్పింది.

"రెండు నూటయాభైలు మూడు వందలూ నువ్వే పుచ్చుకో" అని ఊచలా లేచింది రాజేశ్వరి. "ఇలాంటి వెధవ పన్లు నేను చెయ్యను" అని నిరాశలో ఆశగా తనని పట్టుకున్న రంగనాయకి పట్టు విడిపించుకుని, తప్పించుకుని తలుపుగెడ తీసి ఏమీ అలసిపోకపోయినా చెమట్లు కక్కుతూ యివతలికొచ్చేసింది.

ఆ రావడం తిన్నగా బస్ టెర్మినస్ కొచ్చి, వైజాగ్ వెళ్ళే బస్సులో కూర్చుని కూడా "ఛా! యింత దూరం వొచ్చి కొండెక్కకుండా వెళిపోడమా?" అనుకుని, దిగిపోయి, కొండమీదికెళ్ళే బస్సుకి టిక్కెట్టు కొనుక్కుని ఆ బస్సు ఎక్కింది రాజేశ్వరి.

"గొప్పఆపద తప్పించేవు అప్పన్నా" అని మనసారా మొక్కిన దేవుడి సన్నిధి నుంచి బయటికొచ్చి తేలికపడిన మనసుతో హుషారుగా వెయ్యి మెట్లూ దిగి విశాఖపట్నం వొచ్చే ఆరో నెంబరు సిటీ బస్సెక్కి కూర్చుంది. ఖాళీగా వున్న ముందు సీటులో "ఈ బస్సు అరగంటకి గాని కదలదమ్మా" అని చెప్పాడు కండక్టరు. "ఏం ఫరవాలేదండీ! నేను అర్జంటుగా వెళ్ళిపోనక్కర్లేదు" అని అలాగే కూర్చుండిపోయింది.

బస్సు బయల్దేరింది. కాని దేవస్థానం ఆఫీసు దగ్గిరకొచ్చేటప్పటికి ఒక కానిస్టేబుల్ చెయ్యడ్డం పెట్టి బస్సాపాడు. ముందుగా 'పోలీసు' జీపు ఉంది.

అందులో వెనుక సీట్లో ఇందాక గెస్టుహౌస్‌కొచ్చిన మగవాళ్ళు ఇద్దరు; వాళ్ళ ఎయిరు బ్యాగులు, మరో ఇద్దరు పోలీసు వారు.

బస్సాపిన పోలీసు కానిస్టేబుల్ బయటి నుంచి "ఎక్కు!" అని ఎవర్నో గద్దించాడు. బస్సులో ఎక్కిందో స్త్రీ. మొహం కనబడకుండా చీరచెంగు ముసుగులా కప్పుకుంది. ఆ చీర ఉదయం రంగనాయకి కట్టుకొన్నదే.

నిర్ఘాంతపోయింది రాజేశ్వరి.

కాపలాగా బస్సెక్కిన కానిస్టేబుల్, రంకనాయకికి తన పక్కని చోటు చేయించి డ్రయివర్ వేపు తిరిగి వెకిలిగా నవ్వి, "రైట్ రైట్!" అని గేటులోకి వెళ్ళాడు.

బస్సు గోపాలపట్నం చేరే లోపుగా రంగనాయకి మెల్లిగా రహస్యం చెబుతున్నట్టు మాట్లాడింది. "నీ కాళ్ళకు దండం పెడతాను రాజీ. ఈ ఆపదలోంచి నన్ను రక్షించే పూచీ నీదే. ఏమీ పెద్ద శ్రమ పడక్కర్లేదు. సర్కిల్ ఇనస్పెక్టర్ మధుసూదనరావు గార్ని చూశావుకదా నువ్వు. ఆయన్నెలాగైనా పట్టుకోవాలి నువ్వు. నువ్వు చెప్పడమే ఆలస్యం ఆయన మిగతా పనంతా చూసుకుంటారు. అలా అని ఎంతో టైం లేదు. పొద్దువాలిందంటే ఈ పులులు నన్నేం చేస్తాయో నీకు తెలుసు. ఆ తరవాత నువ్వు చూడగలిగేది నా శవాన్నే."

* * *

సాయంకాలం నాలుగు కాక ముందే




హాస్టల్ ముందు మోటార్ సైకిల్ దిగింది రంగనాయకి. మధ్యలో ఎక్కడ ఆగిందో; ఉదయం బయలుదేరినప్పటి కంటే ఫ్రెష్‌గా ఉంది. అయినా ఆ మొహం చూడాలనిపించలేదు. ఇంక ఎన్నడూ 'రంగా' అని పిల్చి దాంతో మాట్లాడాలనిపించలేదు. "ఈపాటికి బావగారూ, అక్కా వొచ్చేసుంటారు. అక్కడికి పారిపోతాను" అనుకుని లేచింది రాజీ.

రావడమే తిన్నగా తన రూమ్‌లో కొచ్చింది రంగనాయకి. ఒళ్ళంతా వాడిపోయినా మొహం చాటంత చేసుకుని చాటు తీసేసింది. తలుపు గెడ పెట్టేసి అక్షరాలా రాజేశ్వరి కాళ్ళమీద తలవంచి రెండు చేతులు జోడించి మొక్కింది. "నా ప్రాణం కాపాడేవు. నా వుద్యోగం కూడా కాపాడేవు. నీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలీడంలేదు రాజీ."

ఏడుపు లేదు. నవ్వు లేదు. మొహం నిర్లిప్తంగా, నిర్భావంగా వుంది. లేచింది రాజీ పాదాల నుంచి రంగనాయకి. వస్తూనే టేబిల్ మీద పడేసిన వాలెట్ తీసింది. తెరిచి అందులోంచి వందరూపాయల నోట్లు లాగిందివతలికి. అవి మూడు కాదు; ఐదున్నాయి. ఆ ఐదూ మరుక్షణంలో రాజేశ్వరి కాళ్ళ మీద పడ్డాయి. "వాళ్ళిస్తానన్నది నూట యాభయ్యే. కాని, మధుసూదన్‌రావు గారు వాళ్ళని కూడా విడిపించడంలో వాళ్ళని హడలగొట్టి వాళ్ళ జేబుల్లో, సంచుల్లో ఉన్నదంతా వూడ్చి యిందులో పెట్టారు. నిజానికి యిది నాకు చాలా ఎక్కువ. నీకిచ్చేద్దామని అప్పుడే అనుకున్నాను. అలాంటప్పుడు అది ఏమీ ఎక్కువ కాదు. చందమామకో నూలు పోగంతే. కాదనకు, తీసుకో రాజీ. నువ్వు గాని యివాళ నాతో రాకపోతే, ఒకవేళ వచ్చినా గెస్టుహౌసు నుంచి తిన్నగా టవున్‌కొచ్చేస్తే నేను చచ్చిపోయుండేదాన్ని రాజీ."

అని, అప్పుడు భోరుమని ఏడ్చింది రంగనాయకి. ఆ ఏడుపు మానం అమ్ముకున్నందుకు కాదు, శీలం పోగొట్టుకున్నందుకు కాదు. అవన్నీ తన యిష్టప్రకారం జరిగినవి. మరి ఆ ఏడుపు ఎందుకు ? నేరస్తురాలిగా కోర్టుకెక్కి ఉద్యోగం పోగొట్టుకోనందుకు, రిమాండ్‌లో వారంట్ వచ్చేదాకా వుండిపోయి ఇష్టం లేకుండా శీలం నష్టపోనందుకు. ఆ సంతోషంలో ఏడ్చిన ఏడుపది.

అదంతా ఇప్పుడు గుర్తుకొచ్చింది.

"అలా అయితే ఫర్వాలేదు లెండి. కాని అక్కపోయి నిండా మూడు నెలలు కాలేదు కదా; సింహాచలం వెళ్ళేంత కూడదేమో అని అనబోయానిందాక. తప్పు మాట అంటే మన్నించండి బావగారూ" అంది రాజీ– ఒక అర్థం స్పృహలో వుంచుకుని.

"అలాంటి అపచారం నేనా చేస్తాను? అన్నాడు రాజారావు.




"రామక్రిష్ణగార్లేరా?" అనడిగింది రాజేశ్వరి గుమ్మంలో నుంచున్న ఇరవై ఏళ్ళ


చతుర ... లీల

అమ్మాయిని చూసి కొంచెం చిరునవ్వు మొగాన పోసుకుని.

''మా పెద్దన్నయ్యేనా? లేడే!'' అని కంగారు పడి, క్షణంలో తేరుకుని "మీరు రాజీ కదండీ'' అని బోలెడు నవ్వు తెచ్చుకుంది. "రండ్రండండి! అన్నయ్యిప్పుడే వచ్చేస్తాడు" అంటూ లోపలికి తీసికెళ్ళింది రాజేశ్వరిని.

ముందు గదిలో ముగ్గురు కుర్రాళ్ళున్నారు. బెల్‌బాటం పాంట్లు, స్టెప్‌కటింగ్ క్రాపింగుల్లో వున్నారు. ఇద్దరు చదరంగం బల్లకటూ యిటూ కూచున్నారు-మూడో అతను కొంచెం పక్కగా చూస్తూ.

అక్కడ నాలుగో కుర్చీ ఖాళీగా వుంది. దాన్ని వో చేత్తో అందుకుని, "పదండి" అని లోపలి గదిలోకి దారి తీసింది ఆ అమ్మాయి. అక్కడ కుర్చీ వేసి, "కూర్చోండి" అని చూపించి, తను మంచం మీద కూర్చుంది.

"మంచినీళ్ళిమ్మంటారా?''

"వొద్దు. మీ అన్నయ్యగారెప్పుడొస్తారు?

"ఒస్తాడు లెండి, నాతో మాట్లాడరా?" అని దొంగ నవ్వు నవ్విందా అమ్మాయి. "అన్నయ్య మీ గురించి నాకంతా చెప్పేడు లెండి" అంది.

"రామక్రిష్ణగారు మీ గురించి నాకు చెప్పేరు. కాని నేను మీ "పేరేమిటో మర్చిపోయాను..." అంది రాజీ, మాట కలిపి.

"నా పేరు...'' మళ్ళీ నవ్విందా అమ్మాయి "న-యో-మి-"అంది విడి విడిగా అక్షరాలు పలుకుతూ.

"నయోమీ అంటే?"

''అదొక అయోమయం పేరు" అని తన జోక్కి తనే నవ్వుకొంది. నయోమి. ''మా నాన్నగారికి 'నా' మీద నమ్మకం. 'నా' మీద అంటే," గుండె మీద వేలుపెట్టి చూపించుకుంటూ, "నా మీద కాదండోయ్, 'న' అనే అక్షరం మీద! దాంతో మా యింట్లో అందరి పేర్లు 'న'అనే అక్షరంతో మొదలయ్యేవే పెట్టేరు. మా అన్నయ్యల పేర్లు వరుసగా నరసింహ రామకృష్ణ, నారాయణమూర్తి, నాగభూషణం. అక్కడ కూచుని చదరంగం ఆడుతున్నారే అందులో తెల్ల బలం వాడు నారాయణమూర్తి. పక్కని కూచుని చూస్తున్నవాడు నాగభూషణం. నల్లబలంతో ఆడుతున్నవాడు..."గొంతు బాగా తగ్గించి "నరసరాజని, మా రెండో అన్నయ్య ఫ్రెండు లెండి. మేమంతా నసరాజని అంటాం. తొందరగా అనేస్తే అవతలి వాడికి నరసరాజన్నట్టుగానే వినపడుతుంది. కావాలంటే మీరోసారి ట్రై చెయ్యండి!"

రాజేశ్వరి మనసులో ప్రయత్నం చేసి ఆ నిజం గ్రహించినట్టు నవ్వింది.

"మా పెద్దన్నయ్యకింకో ఫ్రెండున్నాడు. అతని పేరు సంగమేశ్వరరావు. అతన్ని మా అన్నయ్య డెలిబరేటుగా 'సగం మేసిన ఆవు' అని పిలుస్తాడు. కొన్నివేల సార్లు అలా పిల్చుంటాడేమో! అయినా ఆ మానవుడు సంగమేశ్వరావని పిల్చినట్టే, డిఫరెన్సేమీ లేనట్టే వుంటాడు!"

రాజేశ్వరి గోడల మీదకి చూసింది. ఓ గోడ మీద పెద్ద ఫొటో, దండవేసి.

"సరే-నాన్నగారికి నా మీద నమ్మకం అన్నాను కదా. నా దగ్గిరి కొచ్చేటప్పటికి అంటే; నాలుగో సంతానం అయిన నా పేరుపెట్టడం దగ్గిరకొచ్చేటప్పటికి నారా




యణమ్మా, నాగమ్మా, పనికి రాలేదుట; ఎందుకంటే ఆ రెండు పేర్లూ మా చిన్నన్నయ్యలిద్దరికీ పెట్టేసినవే. పోనీ సరసమ్మ అని పెడదామనుకుంటే మళ్ళీ యిందాక నేనన్నట్టు నసమ్మ అయి పోతుందని ఎవరో సలహా యిస్తే 'నయోమి' అని పెట్టేరు నా పేరు !" అని విడిగా "నాలుగు వందల ఇరవై నాలుగు!'' అంది.

"అదేమిటా నెంబరు ?'' అంది రాజే శ్వరి నవ్వుతూ.

"అదా?... నా నయోమీ నామకరణ గాథ నామ మాత్రంగా చెబితే ఎవరికీ అర్థంగాదు. ఈ రికార్డంతా వెయ్యవల సిందే. ఇలా నా అంతట నేను ఇప్పటి దాకా నా పేరు చెప్పి నా పేరు గురించి చెప్పుకోవడం మీతోకలిసి నాలుగు వందల యిరవైనాలుగు మందికన్న మాట!"

రాజేశ్వరికి నవ్వొచ్చేసింది.

"నా పేరు రాజేశ్వరి" అంది.

"కాని అన్నయ్యకి రాజీ. ఆ సంగతి నాకొక్కదానికే తెలుసు. మిగిలిన వాళ్ళలో మా అమ్మకి మీ గురించి చెప్పాడుగాని 'రాజీ ధోరణి' చెప్పలేదు. అంటే మీ ఇంటి మసి"

"నా ఇంటి మసి నా దగ్గిరే ఉండి పోనీ" అని రాజేశ్వరి ఓ జోకు పేల్చింది.

"నయోమీ!" అని ముందుగదిలోంచి ఒక కేక.

"వస్తున్నా!" అని స్ప్రింగు తన్నినట్టు లేచి "ఇప్పుడే వస్తాను" అని రాజేశ్వరికి చెప్పి దానికి కూడా బోలెడు అంగికం సమకూర్చి ఇంతాచేసి తలుపు దగ్గిరకి మాత్రం వెళ్ళింది నయోమి. తలుపు కొద్దిగా తెరిచి పట్టుకుని "పెద్దన్నయ్య ఫ్రెండురా. ఎన్‌గేజ్ చేస్తున్నాను! ఏం?" అని దబాయించింది.

ఆ పిల్ల కొంచెం ఎక్కువగా మాట్లాడుతుందని వీలున్నంత వరకు సరదాగా, హాస్యంగా మాట్లాడానికి ప్రయత్నిస్తుందని రాజేశ్వరి తెలుసు కుంది. అలా తెలుసుకున్నందుకు, అసలా అమ్మాయిని చూడగలిగినందుకు చాలా సంబరపడింది.

అవతల్నుంచి నయోమి అన్నల్లో ఒకరు "సరే ఎవరో పాపం ! నీ పేరూ ఆ గాథా అన్నీ చెప్పావా?" అన్నాడు.

"ఏదీ ఇంకా బైబిలు రిఫరెన్సు అదీ చెప్పినట్టు లేదు" అని రెండో అన్నయ్య.

"నా యిష్టం, అవిడిష్టం. మధ్య మీరెవరు అడగడానికి?" అంది నయోమి.

"పోనిలే నీ నామధేయగాథ చెబితే చెప్పేవుగాని నీ పాట కచేరీ మాత్రం పెట్టి చంపకు" అని ఒకడు.

"మనింటికి గెస్టులెవరూ రాకుండా నాన్నగారు మహా గొప్పవుపాయం కని పెట్టారు దీనికి సంగీత శిక్షణంటూ ఒకటి పెట్టి ! సర్లే వెళ్ళు అవిడ ఎంత చేసు కుంటే అంతా అనుభవిస్తుంది పాపం!" అని రెండోవాడు.

"నాకేం? నేనందరికన్నా బాగా పాడ తాను! వినలేకపోతే చెవులు మూసు కోండి!" అని తలుపు భడాలున మూసి లోపలికొచ్చింది నయోమి.

రెండు మూడు క్షణాలు ఊరుకుని రాజేశ్వరి "పాటలొచ్చన్నావుగా! పాడు తావా ?" అంది.

నయోమి బెదిరించినట్టు వేలు ఆడించింది. "చూస్తున్నాను ఇందాకట్నుంచీ ! అప్పుడే నువ్వు నువ్వని ఏకవచన ప్రయోగం మొదలెట్టేరు !" అని రాజేశ్వరి చెవిదాకా నోరుతెచ్చి "ఏదీ ఇంకా

నేను మీ ఆడపడుచుని కాందే! అప్పుడే యింత చనువు తగునటో?" అంది నెమ్మదిగా.

"సారీ" అంది రాజేశ్వరి ఆమెని నువ్వన్నందుకు నిజంగానే నొచ్చుకుంటూ.

"శారీల్లేవు, ఇంకా లంగా ఓణీలమీదే వున్నాను!" అంది నయోమి మళ్ళా బోలెడు ఆంగికం చేసేసి.

రాజేశ్వరి ఆ చురుకుతనానికి నిస్సహాయురాలైనంత సంతోషంలోపడిపోయింది. 'పొదండి' అంది. లోపల వున్న యింకో గదిలోకి చూపించి "మీ అమ్మగారు కూడా లేరా ఇంట్లో?" అనడిగింది.

"అమ్మా, పెద్దన్నయ్యా కలిసే వెళ్ళారు. వచ్చేస్తూనే వుంటారు. వెళ్ళి పిల్చుకురానా? మీ పని అర్జంటా? మా అన్నయ్య అన్నట్టు లైట్నింగా?"

ఏదో ఒకమాట మామూలుగా మాట్లాడిందని కొద్దిగా నవ్వునుంచి ఆశ్చర్యంనుంచి తప్పుకోబోయిన రాజేశ్వరి మళ్ళా ఆ లైట్నింగ్‌కి సంభ్రమంలో పడిపోయింది.

"అబ్బెబ్బే అదేంలేదు. నాకసలు ఆయనతో పనే ఏమీ లేదు. ఎన్నాళ్ళో అయింది ఆయన నన్ను మా యింటికో సారి రా రాజీ అంటూనూ. మరి యివాళే మెయిల్లో వెళ్ళిపోతారటగా మీ అన్నయ్యగారు?"

తలుపు హఠాత్తుగా తెరుచుకుంది.

'రామకృష్ణగారి తల్లి' అనుకుంది రాజేశ్వరి, వచ్చినావిడ్ని చూసి.

వయసు చేత, కడుపు కలిమి చేత సంపాదనా పరుడు కాకపోయినా పండితుడికి భార్యగా దీర్ఘకాలం కాపరం చెయ్యడంచేత నిండుగా, ప్రసన్నంగా వున్న ఆవిడను చూస్తే రాజేశ్వరికి మనసులో గౌరవంతో నిండిన స్నేహకాంక్ష కలిగింది. చటుక్కున కుర్చీలోంచి లేచి చేతులతో మాత్రం నమస్కారం పెట్టింది ఆవిడకి.

సరిగ్గా ఆ క్షణం ఆవిడ తల అటూ శరీరం యిటూగా నిలబడింది ఆ ద్వారం మీద. అవతల ఇద్దరు కొడుకులున్నారు. ఇవతల కూతురుంది.

"వాడికి నిర్మల నచ్చిందర్రా" అందావిడ విశాలంగా నవ్వుతూ పిల్లలందరూ వినాలని.

"అమ్మా! అమ్మా!" అని మంచం మీదినుంచి దూకి పరుగున వెళ్ళి ఆవిణ్ణి కావిలించుకుంది నయోమి. "ఎవరొచ్చేరో చూడమ్మా అటు. రాజేశ్వరిగారు. పెద్దన్నయ్య స్నేహితురాలమ్మా! ఈ వూళ్ళో నవనారీ గృహం అని ఉద్యోగస్తురాళ్ళ మెస్సులో పని చేస్తున్నారూ. బియ్యేకి ప్రయివేటుగా కట్టేరూ. ఈవిడేనమ్మా.." అని ఆవిడవేపు అయోమయంగా చూస్తున్న రాజేశ్వరితో "మా అమ్మ" అని చెప్పింది నయోమి.

"నమస్కారమండి" అంది రాజేశ్వరి తడారిన గొంతుకతో.

"నమస్కారం" ఆవిడ ఆనందం అంతా క్షణంలో మాయమైంది.

రాజేశ్వరికా తరువాత ఏం మాట్లాడాలో తెలీలేదు. నవ్వుదామని ప్రయత్నించింది. అది చాలా వికారంగా ఒచ్చి మూతి వంకరపోతున్నట్టు స్ఫురించింది. హఠాత్తుగా వెళ్ళిపోవాలని బుద్ధి పుట్టేసింది. 'నే వెళ్తానండీ' అంటే బావుంటుందా? ఇదంతా బావుంది కనకనా, అది బావులేకపోవడానికి?...కాసేపుంటే దార్లో ఎక్కడో ఏ వక్కపొడి పొట్లం కోసమో ఆగివస్తున్న రామకృష్ణగారు రావచ్చు.




తనకే కళ్ళంట నీళ్ళు రావచ్చు. అతను రాకపోయినా ఈ కన్నీళ్ళని ఆపడం యెలాగు?...పారిపోవాలి...వీధి గుమ్మానికి వెళ్ళేలోగా దారిలో ఏమీ లేవుకదా. దేన్నో తన్నుకుని పెద్ద రభస అవదు కదా...గుడ్లలో తిరిగిన నీరు వల్ల అనని చూపుతో వీధి ద్వారం వేపు చూసింది.

పేపరు ముఖానికి అడ్డం పెట్టుకుని చదువుకుంటూ వస్తున్న ఒడ్డూ పొడుగూ రామకృష్ణగారి ఆకారమే. అతనెందుకు చూస్తాడు? చూడడు. అలవాటైన దారి. సబ్ ఎడిటర్ అవబోయే అప్రెంటిస్‌లాగా పేపర్ని ఎకడెమిక్ ఇన్టరెస్టుతో చదువుకుంటూ వచ్చేస్తున్నాడు.

వచ్చేస్తున్నాడు.

అతని దారికి అడ్డురాకుండానే వెళ్ళిపోవాలి.

"వస్తానండి" అని గోడమీద తుమ్మెసి జోరుగా వెళ్ళిపోయింది రాజేశ్వరి. ద్వారం దగ్గర చెప్పులు తొడుక్కుంటూ వుంటే రామకృష్ణ ఎడంకాలు ఆమె ఎడం కాలుకి తగిలింది.

అతను అప్పటికే విడిచేశాడు జోడు.

"అరె!" అన్నాడు రామకృష్ణ. తగిలిన కాలిని చూసి, తట్టిన మొహం వెంటనే చూసి– "ఎప్పుడొచ్చేవు?"

"కొంతకాలం అయింది. వెళ్ళిపోతున్నానిప్పుడే!" అని నవ్వింది రాజేశ్వరి. ఒక్కనోరే కనక పక్కుమని ఒక్క నవ్వే రాలింది. కాని రెండు కళ్ళు కనక రెండు అశ్రువులు రాలక తప్ప లేదు.

ఆ కన్నీళ్ళ మొహం ఎలా వుంటుందో ఆమెకి తెలుసు. అది మెడికల్ కాలేజీలో ఎనాటమీ డిపార్టుమెంటులో పెట్టిన కంకాళం. పెదవు లుండవు కనక పళ్ళు కనబరుస్తూ అదే నవ్వు అనుకోమని మనని చూసి నవ్వినట్టుంటుందే. అదీ ఆ నవ్వు. అమ్మో! ఆ నవ్వు రామకృష్ణగారికెలా చూపించడం?

అతని చేతిలో పేపరు తీసుకుని, దాన్నడ్డం పెట్టుకుని కళ్ళు పైట చెంగుతో ఒత్తుకుంది రాజేశ్వరి. నిర్ఘాంతపడి చూస్తున్న రామకృష్ణకి, అతని తమ్ముళ్ళకి, స్నేహితుడికి, ఆఖరికి ఆ తల్లికి జరిగిందేమిటో తెలియనట్టూ, జరగవలసిందేమిటో తోచనట్టూ అయిపోయింది. నయోమి రాజేశ్వరి దగ్గరికి పరుగెత్తి వెళ్ళింది.

కన్నీళ్ళొత్తుకుందికి అడ్డంగా పెట్టుకున్న పేపర్లో నాలుగవ పేజీలో బి. ఏ. రిజల్ట్సు అని కనబడితే నిలదొక్కుకుని పేజీలు తిప్పింది రాజేశ్వరి.

"నా రిజల్ట్ వచ్చేసింది నయోమీ. బావగారి దయవల్ల పాసయ్యాను" అని పేపరు నయోమి కిచ్చేసి "వస్తా" అని వెళ్ళిపోయింది.

పేపరు పుచ్చుకున్న నయోమి మాత్రం 'పాపం' అని ఆ వీధి ద్వారానికి చేరబడి నించుంది. వెళ్ళిపోతున్న రాజీని చూస్తూ.

* * *

కొంతదూరం దాకా వెనక్కి తిరిగి చూసుకుంటూ నడిచింది రాజేశ్వరి.

జరిగిందేమిటో తనకి తెలుసును ఇప్పుడు.

తనకి తెలిసిందని అతనికీ తెలిసుంటుంది.

"ఏ పరిస్థితుల్లో అలా జరిగిందో చెప్పడానికయినా రాకపోతాడా అని

ఆశతో అలా వెనక్కి తిరిగి చూసు కుంటూ నడిచి వంద గజాలు నడిచేలోగా యిద్దర్నీ ఢీ కొట్టింది రాజేశ్వరి. ఒక మోటారుసైకిల్ కింద పడబోయి చీవాట్లు తింది.

అక్కడితో తెలిసింది - సిటీ బస్సు ఆగే 'చెట్టు జంక్షన్' వరకైనా తను నడిచి వెళ్ళడమనేది సాధ్యమయ్యే పని గాదని.

ఖాళీగా తను వెడుతున్న వైపుకి వెళు తున్న రిక్షాను ఆపి, "డాబా గార్డెన్స్‌కి పోనీ!" అని చెప్పి, బేరమైనా ఆడకుండా యెక్కి కూర్చుంది. కూర్చోడం, వెనక్కి చారబడ్డం, కళ్లు మూతలు పడ్డం అంతే తెలుసు.

"ఏయ్ రిక్షా! ఆపు !!" అని పరి చయం వున్న గొంతు వేసిన కేకకి కళ్లు తెరిచింది రాజీ.

"అస్టలొచ్చిందమ్మా. దిగండి" అన్నాడు రిక్షా అబ్బాయి ఆపి.

ఆ సమయంలో తను హాస్టల్లో వుంటు న్నట్టు వీడికెలా తెలిసిందని గాని, ఈ రిక్షా ఆపింది రంగనాయకి అని గాని సందేహం, స్ఫురణా కలగలేదామెకి.

"ఏంటిది రాజీ! నిన్ను నమ్ముకుంటే రాజమండ్రిలో కాదు. గోదావర్లోనూ కాదు; గంగలో దిగడమే కాబోలు!" అని స్వాగతం చెప్పింది రంగనాయకి.

అప్పుడు గుర్తొచ్చింది- రంగనాయకి ఈరోజు మెయిల్లో రాజమండ్రి వెడు తోందనీ, తననికూడా రమ్మందనీ, తను సరే అన్నదనీనూ.

ఇరవై ఏడేళ్లు వ్చ్చిన రంగనాయకి...

మూడు నాలుగు ఉద్యోగాలు మారిన రంగనాయకి...

స్వతంత్రంగా బతకడం, బతుకులో తీపిని ఆస్వాదిస్తూ ఆ చేత్తో డబ్బు కూడా సంపాదించుకోడం నేర్చి పలువిధాలా పండి పోయిన రంగనాయకి...

ఇవాళ తనుకూడా సాయం వస్తానంటేనే గాని స్వంత వూరైన రాజమండ్రి వెళ్ళ లేనన్నది...

నిన్న సాయంకాలం చెప్పింది;

రేపు రంగనాయకికి పెళ్ళిచూపులు!

"నాకిది మొదటిసారి కాదు, డజన్ల కొద్దీసంబంధాలు రాకపోయినా,ఆరేడుసార్లు ఈ పరీక్షకి కూర్చున్నాను! కాని ఈసారి మాత్రం ఎందుకో నాకిపెళ్ళి గ్యారంటీగా అయిపోతుందని అనిపిస్తోంది గురూ!... నాకు క్లాస్మేట్లున్నారు, కొలీగ్సున్నారు గాని అక్క చెల్లెళ్ళు అన్నదమ్ములూ లేరు. అమ్మ వుందిగాని నాకావిడతో పరి చయమే లేనట్టు అనిపిస్తుంటుంది వుడూనూ. అంచేత నువ్వు నాకూడా రావాలి రాజీ; చెలికత్తెగా కాదుసుమా, చెల్లెలుగా!" అంటూ బతిమాలింది.

ఎంత నెమ్మదిగా బుజ్జగించి అడిగినా రంగనాయకితో ప్రయాణం అంటే భయమే రాజేశ్వరికి. "ఆఁ; అప్పుడు సింహాచలం తీసికెళ్ళావుగా. అలాగేనా యిదికూడానూ?" అనడిగింది, "నన్నింకా నమ్మవా రాజీ; ఆ పద్ధతి అప్పుడే ఆపే శానుగా!" అని రెండుచేతులూ జోడించి అంది, రంగ.

నిన్నరాత్రి మెస్ వార్డెన్ పర్మిషన్ కూడా తీసుకుంది రంగనాయకి; తనని రెండురోజులపాటు తీసికెళ్ళేందుకు.

"చప్పున భోంచేసిరా! టైమప్పుడే పదకొండు కావస్తోంది!" అని ఆర్డర్ వేసిన రంగనాయకి, తనే చప్పున తెల్ల బోయి, "అదేంటి గురూ, మొహం అలా గుంది?" అని రాజేశ్వరిని రోడ్డుమీదే




పొదివి పట్టుకుని, "నువ్వుండవోయ్, స్టేషనుకెళ్ళాలి; అదీ ఇదీ కలిపి ఇచ్చేస్తాలే!" అని రిక్షాఅబ్బికి చెప్పి, రాజీని నడిపించుకెళ్ళింది లోపలికి.

"ఈ మెయిల్లోనే రామకృష్ణగారు మద్రాసు వెళతారు" అనుకుంది రాజేశ్వరి.

అనేసినట్టు యెరగదు.

"రామకృష్ణ గారెవరు?"

"రామకృష్ణ ఎవరా? నేను నీ దగ్గర ఎన్నడూ ఆయన పేరయినా ఎత్తలేదే! నేనాయన్ని గురించి అనుకుంటూవుంటే సరిగ్గా యిప్పుడె నీకెలా తెలిసిందా పేరు? అనుకుని దిగ్భ్రమతో చూసింది రాజేశ్వరి.

"మనతోబాటు వస్తున్నాడా? రాజమండ్రిలో దిగడా?"

రాజేశ్వరి బొడ్లోంచి రుమాలు తీసి మొహం ఒత్తుకుంది; నీడకి రాగానే. చెమటకీ, కన్నీళ్ళకీ రుమాలు చాలలేదు.

"ఇంతకీ ఎవరు తల్లీ ఆ రామకృష్ణుడు? కొంపదీసి నీ బాయ్‌ఫ్రెండా, లేకపోతే నీకునమ్మించి హాండిచ్చేశాడా?"



"రెండూనూ" అనుకుంది. కాని అప్పటికి స్పృహ వచ్చింది. అంచేత ఆ మాట అనలేదు. జరిగినదానికి విచారపడి లాభం లేదు. జరగవలిసింది విచారించాలి అన్న సంకల్ప బలం తెచ్చుకుంది.

"అదికాదు రంగా! నేను నీతో రాజమండ్రి వెళ్ళవలసుంటుందని మా బావగారింట్లో చెప్పలేదే! యెలాగిప్పుడు?"

"బావగారంటే... డిపార్టుమెంటు ఎ.డి.గారేనా? రాజారావుగారు కదూ, ఆయన పేరు? ఇందాక వచ్చారిక్కడికి. విజయనగరంలో అతని కొలీగ్ ఎవరో యిల్లు కట్టుకుని గృహప్రవేశం చేస్తున్నారుట రేపు. ఈ పాటికి కార్లో బయల్దేరేసి వుంటారు ఆయనా, వాళ్ళ పిన్నిగారూ, పిల్లలిద్దరూనూ. నిన్ను కూడా రమ్మని పిలవడానికొచ్చేరు.నీకు రావడానికి వీల్లేకపోతే ఇంటికొచ్చి వుండమన్నారు. నీ దగ్గర తాళం వుందటగా. నేనే చెప్పాను నువ్వు, నాతో రాజమండ్రి వస్తున్నావనీ మళ్ళీ రావడం సోమవారం వుదయానికే ననీనూ"

"ఎందుకని అడగలేదా? ఆయనతో నేనే యెందుకు చెప్పలేదనీ అడగలేదా?"

రంగనాయకి నవ్వింది "అడగలేదు. నే చెప్పిందంతా వినీ, అలాగా అని నన్నోసారి యెగాదిగా చూసి స్కూటరెక్కి వెళిపోయాడు"

"అయ్యో బాబోయి కొంప మునిగింది! నేను అర్జంటుగా ఆయన్తో చెప్పాలి. ఆయన పర్మిషన్ లేకుండా నేను గడప దాటడానికి వీల్లేదు. ఆయనెవరనుకున్నావు? నా గార్డియన్, నా గాడ్ ఫాదర్" అని చతికిల్లా పడిపోయింది రాజేశ్వరి.

"లే! చాదస్తం నువ్వూను! గార్డియన్ట, గాడ్ ఫాదర్ట!! తలకాయలేకపోతే సరి!... నీసంగతి తెలిసే కాబోలు ఆయన ఫోన్ నెంబరొకటి యిచ్చి వెళ్ళాడు. ఆయన సంగతి తెలీక నేనది నోట్ చేసుకున్నాను కూడాను!" అని రాజీని బలవంతంగా లేవతీసింది రంగనాయకి.

'నా సంగతి కాదు. నీ సంగతే తెలిసుంటుంది ఆయనకి' అనుకుంది రాజేశ్వరి. అప్పటికామెకి పూర్తిగా తన మీద అదుపు ఏర్పడింది. అంచేత ఆ మాట కూడా అనకుండా వూరుకుంది, డైనింగ్ హాలువేపు నడుస్తూ.

* * *

రైల్వే స్టేషన్‌కి మెయిల్ చేరడానికి కొద్దిగా ముందుగానే తామిద్దరూ వచ్చి సందుపల్ల రంగనాయకీ, రాజేశ్వరీ లేడీస్ కంపార్టుమెంట్‌లో సీట్లు సంపాదించుకోగలిగారు. మెయిలు స్టేషన్ కొచ్చిన పది నిమిషాలకి రామకృష్ణ, నయోమి హడావుడిగా ప్లాట్‌ఫారం మీదికి రావడం కిటికీ చాటునుంచి కనిపెట్టి మొహం దాచుకుంది రాజేశ్వరి. వాళ్ళు వెళ్ళేది మద్రాసు కావడాన్నీ, రామకృష్ణ ముందురోజే బెర్తులు రిజర్వ్ చేసుకోడాన్నీ కాబోలు వాళ్ళెంత హడావుడిగా వచ్చినా, రిజర్వేషన్ బోగీకి వెళ్ళిపోడం చూసింది రాజేశ్వరి.

"అదుగో అతనే కదూ నీ బాయ్ ఫ్రెండు రామకృష్ణగారు? లేచి వెళ్ళి గుమ్మం దగ్గిరనుంచో. మనం ఇక్కడున్నామని అతనికి తెలియడం మంచిది!" అంది రంగనాయకి.

రాజేశ్వరి ఆమెనోటి మీద తన చెయ్యి పెట్టింది– "నీ మొహం ఊరుకో"

రంగనాయకి రాజేశ్వరి చెవిదాకావంగి, "ఏదో మధ్యమధ్య కాఫీలు అందించ




డానికి పనికొస్తాడనే గాని, నేనేం అతన్ని చెరచనులే" అంది.

"అతనలా చెడే మనిషి కాదు. అతని దృష్టి పెళ్ళి మీదే వుంది తప్ప నీలాగ క్షణికానుభవం మీద లేదు. పైగా అతనో బాటు అతని చెల్లెలుంది. మహా అద్భుతమైన తెలివి కలది !"

"మంచిదే. ఎవరి ప్రియుల్ని వాళ్ళు అలాగనుకోవడం సహజమే. పోన్లే. అతని వూసెందుకు ? ఏవైనా కబుర్లు చెప్పు"

"నాకేం వుంటాయి కబుర్లు ? నేనేం నీలాగ అనుభవం సంపాదించేనాయేమిటి ? ఒట్టి దురదృష్టపు ఘటాన్ని !"

"అయింది కదా ! అనుభవమే అదృష్టం అన్న లెక్కకి వచ్చావు కద ! అదీ మంచిదే. అది సరేకాని, ఇవాళ మనకి ప్రయాణం వుందని నీకు గుర్తు లేదా లేక గుర్తుండీ కూడా వంటకన్నీ అప్పగించి ఎటో వెళిపోయావా ? అట్నుంచి రావడమే శోషొచ్చి పడిపోయి నట్టొచ్చావు. ఏమిటి కథ ? మీరిద్దరూ కీచులాడుకోలేదు కద ! ఏం జరిగింది, నాతో చెప్పవా ?"

రాజేశ్వరి నీరసంగా నవ్వింది. "ఎప్పుడేనా చెప్తాను. ఇప్పుడు మాత్రం నన్ను వేధించకు, నాకివాళెందుకో మాట్లాడ్డానికి కూడా వోపిక లేకుండా వుంది. నువ్వేదైనా చెప్పు వింటానంతే"

"నేనేం చెప్పినా నా గురించే చెప్పుకోవాలి. నీకు నా గురించి తెలిసింది తక్కువ. అంతా చెప్పెయ్యాలని వుందసలు. వింటే హడలి చస్తావుకదాని దయ తల్చి వూరుకున్నా నిన్నాళ్ళానూ. ఇహ యివాళ తప్పదు. మనిద్దరం నూట ముప్పై మైళ్ళు పక్కపక్కని కూర్చుని మళ్ళీ ఎప్పుడు ప్రయాణం చేస్తాం ? నాలుగ్గంటలసేపు యివాళా, ఒక రోజంతా రేపూ మనం యిద్దరం కలిసి యింకెప్పుడుంటాం?"

ఏముంది, హడిలి చావడానికి?

పోలీసు ఇనస్పెక్టర్ మధుసూదనరావుగారున్నారు. అంతకు ముందు ఫారెస్ట్ ఆఫీసర్ సుబ్బారాయుడుగారుండేవారు. ఇంకా అంతకుముందు ఈమెకి మొట్టమొదటి వుద్యోగం యిచ్చిన అధికారి తమ్ముడు, ఒకప్పుడు రాజమండ్రి కాలేజి లెక్చరరు ప్రభాకర్ వీరందరుకాక సింహాచల 'క్షేత్రం' వుంది. క్షేత్రంవున్న చోటికి బీజం రాదామరి ? సింహాచలమది అందరిదీ. గెస్టుహౌసులకి తీసికెళ్ళి వందా రెండు వందలూ ముట్టజెప్పగల స-రస గంధర్వులున్నారు. గాంధర్వ విధులున్నాయి. అవి చెప్పే రంగనాయకి తనని హడలగొట్టాలనుకుంటూంది.

కడచిపోయిన శృంగారంలో జుగుప్స కనబడినట్టు రంగనాయకి తన కథలు చెప్పిన ధోరణిలో పగరూ వెగటూ నింపింది.

"నేను బి. ఏ. చదువుతున్నప్పుడే — అంటే మా నాన్నగారు పోయిన మూడు నెలలకే; మా అమ్మ నాకు మొదటిసారిగా పెళ్ళి సంబంధం తెచ్చింది. నాన్నగారు ఉన్నంత కాలం ఇంట్లో ఏం వుంది, ఇల్లెలా గడుస్తోంది, రేపటికి ఏం వుంది అన్న ఆలోచనేలేని అమ్మ ఒక్కసారిగా తన కడుపు కట్టుకుని నానోరూ మూసేసి నన్ను పెంచవలసొచ్చింది. తను ఉండే రెండు గదులు మినహా మిగిలిన ఇంటికి వొచ్చే అద్దె, నాన్నగారి ఇన్సూరెన్సు, ప్రావిడెంటు ఫండు, గ్రాట్యుయిటీల ద్వారా వొచ్చిన సొమ్ముమీద బ్యాంక్ వడ్డీ, ఇవే

మాకప్పటికి ఆధారం. ఆ మొదటి సంబంధం డబ్బు కారణంగానే తప్పి పోయింది. అప్పటికీ ఇప్పటికీ తేడా ఏమిటో తెలుసునా? అప్పుడు నా పెళ్ళి చేసుకుంటే, అమ్మకి ఆ ఇంటద్దెకాక బ్యాంకులో ఏడాదికి ఆరువందలు వడ్డీ వచ్చేపాటి డిపాజిట్టు అంటే ఏడు వేలుంటే సరిపోయేది. అప్పుడు ఆ మాత్రం కూడా లేసందువల్ల ఆ పెళ్ళి ఆగిపోయింది. ఇప్పుడు? నా దగ్గిర, నా పెళ్ళికి ఇవాళ ఈ సంబంధం వాళ్ళు అడుగుతున్న పదిహేనువేలు కాక, పెళ్ళి ఖర్చులకి మా వైపు నుంచి పడే రెండువేలు కాక, అమ్మ జీవితం వెళ్ళబుచ్చడానికయ్యే బ్యాంక్ డిపాజిట్టు ఏడువేలూకాక, విడిగా మరో పదివేలున్నాయి. అంచేత ఈ సంబంధం తప్పకుండా సెటిలవుతుందన్న నమ్మకం నాకేర్పడింది!"

"ఏం డబ్బులే అది?" అని అసహ్యించుకుంది రాజేశ్వరి.

"ఇవాళ సాయంకాలం అయిదు గంటల్లోగా మనం మా ఇంటికి చేరుకుంటాం. నా రెండుడజన్ల కథలూ నీకు చెప్పేను. ఈ రాత్రి శుభ్రంగా స్నానం చేస్తాను. నీకు నా కథలన్నీ చెప్పడం వల్ల నామనసులో కల్మషం అంతా పోయినట్టు, లోపలి మాలిన్యం అంతా కడిగేసుకున్నట్టూ అయింది. అలాగే ఆ స్నానంతో నా శరీరమూనూ. రేపతను నన్ను చూడ్డానికి వస్తారు. అతనెలాంటివాడైనా సరే నేనీ పెళ్ళికి వొప్పేసుకోదల్చుకున్నాను. అతనొప్పుకుంటే మా అమ్మని కూడా



మా ఇంటికి తీసుకుపోతాను. అతని కోసం నాకు నెలనెలా ఏడువందల యాభై రూపాయల జీతం ఇచ్చే వుద్యోగం మానేస్తాను. అతనితో నిజాయితీగా, పవిత్రంగా సంసారం చేసి అతనికి పిల్లల్ని కంటాను అంతే. ఈ పాత జీవితపు అనుభవాల్ని మర్చిపోయి మరో రకం కులాసా తెచ్చుకుని కొత్త జీవితం ప్రారంభిస్తాను. ఈ అనుభవాలు నన్ను బాధించవని, వీటి నీడలు నన్ను వెంటాడవని, వీటి ప్రభావం నా ఇకమీదటి జీవితం మీద పడనివ్వనని ప్రతిజ్ఞ తీసుకునే ఈ సంబంధం గురించి ఒక నిశ్చయాని కొచ్చేను. అప్పుడు ఈ సోకాల్డ్ సంసార పక్షపు మహా పతివ్రతలే నాకు తీసికట్టు అనిపించేటంత బలంతో నా ప్రవర్తన సాగుతుంది. మనుషులూ, ముఖ్యంగా మొగాళ్ళూ అంటే నాకుండే అవగాహన నాకు మేలే చేస్తుందిగాని కీడు చెయ్యదని నేను ఆశపడుతున్నాను!''

రాజేశ్వరి వణికి పోయింది ఆ స్థైర్యం చూసి.

రంగనాయకి కిటికీలోంచి చూస్తోంది. ఈ ప్రయాణంలో వెనక్కెళ్ళిపోతున్న దృశ్యాల్లాగే, ఈ జీవితంలో వెనక్కి తప్పుకున్న అనుభవాలు మళ్ళా ఎదురవ వన్నమాట రంగనాయకికి అనుకుంది రాజేశ్వరి. ఆమె కెందుకో కళ్ళు చెమర్చాయి.

* * *

''రంగా!'' లోపల్నించి పిల్చింది రాజీ.

''ఓ, యొస్తున్నా!''

కుర్చీలోంచి సగంలేచి, "ఇప్పుడే వస్తాను" అని, ఎదురుగా కూర్చున్న 'పెళ్ళికొడుకు' దగ్గర లాంఛనప్రాయంగా అనుమతి తీసుకుని లోపలికి వెళ్ళింది రంగనాయకి.

లోద్వారం తలుపు పక్కన వున్న తెరలోంచి ఇవతలివాళ్ళకి కనిపించ కుండా పక్కకొదిగి నిలుచుంది రాజేశ్వరి.

"ఏం?" అంది రంగనాయకి స్పీడుగా లోపలికొచ్చి. "అక్కడికి రమ్మంటే వొచ్చావుగాదు. నిన్ను చూసిన కళ్ళతో నన్నుచూస్తే తన్నితాను మర్చిపోయి నన్నుకాదని నిన్నే కావాలంటాడని నీ అనుమానం! ఎందుకుట?"

రాజేశ్వరి "ఇక్కడ చెప్పను'' అని సంజ్ఞచేసి, రంగనాయకిని చెయ్యిపట్టుకుని ఇంకా లోపలికి తీసుకుపోయింది. అక్కడ వరండాలో అద్దెకుండే వాళ్ళ పిల్లలు ఆడుకుంటూ గొడవ చేస్తున్నారు. అయినా అదేమంచిచోటులా కనపడింది రాజేశ్వరికి.

"నిన్న నువ్వు విప్పిచెప్పిన నీమనసు, నీ పరిస్థితులూ నాకు బాగా మనసు కెక్కాయి. అంచేత ఇవాళ వుదయంనించి ఇప్పటిదాకా కూడానూ నిన్ను ముస్తాబు చెయ్యడంలో ఆనందం పొందేను. నువ్వన్నది రైటే. నీకంటె ఓ చాయ ఎక్కువ దాన్ని నేను. అందుకే వాళ్ళ ఎదుట పళ్ళేదు. కాని అతన్ని నేను చూసేక నీకు కొన్ని విషయాలు చెప్పాలని నా కనిపించింది!"

"అబ్బ ఏమిటి రాజీ సొద?"

''అతనెవరన్నావు?"

"పెళ్ళికొడుకే"

''అదిసరే ఏ వూరు?"

"నిడదవోలుకీ, తణుక్కీ మధ్య వూరు. కాల్దరో ఏదో అన్నారు''

''అతని పేరు నారాయణ అవునా?"

"అవును!"

"పదిహేనెకరాల పొలం, రెండు ఇళ్ళు. తల్లీ తండ్రీ లేరు. బాబాయిగారు పెంచారు. అయిదేళ్ళ కిందట అతన్నీ అన్నాళ్ళూ పెంచిన బాబాయిగారు పోయారు. వాళ్ళ బాబాయిగారి కొడుకు అప్పటికి హైదరాబాదులో ఉద్యోగం చేసుకుంటూ వుండేవాడు. బాబాయిగారు పోయిన మూడేళ్ళలో ఆ పొలం, ఇల్లూ ఇతను కలిపేసుకున్నాడు. అతనేనా?''

"అవునుకాబోలు. అవన్నీ తెలీదు. మొత్తం పదిహేనెకరాలు పొలం, రెండిళ్ళు అంతే తెలుసు''

"వయసు ముప్ఫయ్యయిదు''

"అవునుట"

"ఇప్పటిదాకా ఒక పెళ్ళి కూడా కాలేదు''

"కరెక్ట్. అవునుగాని ఏంటి నీ ప్రశ్నలూ సమాచారం! నేనెళ్లాలి! అవతల వాళ్లు ఎదురుచూస్తున్నారు. నేనిక్కడ నీతో కబుర్లు చెబుతూ కూర్చోడం బావుండదు ఆ తరవాత చెబుదువుగాని దేసోది" రంగనాయకి వెళ్ళిపోబోయింది.

"రంగా"చెయ్యిపట్టుకుని ఆపింది రాజీ "అతను నాకు బాగా తెలుసు రంగా. సారీ. డబ్బు సంపాదించటం ఒక్కటే లెక్కలోకి తీసుకుంటే చాలా సమర్థుడే. కాని రంగా. అతనికి లేని వ్యసనం లేదు రంగా అతను నాకు చాలా దగ్గిర బంధువు. వరసకి బావ కూడా!"

రంగనాయకి చలించలేదు. రాజేశ్వరి భుజంమీద తట్టింది "నేనెక్కడ తప్పులో అడుగేసేస్తానేమోనని నువ్వు హృదయ పూర్వకంగా హెచ్చరిక చెయ్యడం నాకు చాలా సంతోషంగా వుంది రాజీ! కాని నేనిప్పుడు ఒక్క అడుగు కూడా వెనక్కెయ్యలేను. ఇప్పటికే ఒకరికొకరం ఇష్టమని మాటలనుకోవడం అయిపోయింది. అమ్మకూడా యిష్టపడింది!" అంది నవ్వుతూ.

"ముందే చెబుదామనుకున్నాను. కాని అతన్ని నేను చూడ్డమే చాలా ఆలస్యమైపోయింది. మీ అమ్మగారు మధ్యలో ఓసారి లోపలికొచ్చేరు 'టీ'లు పట్టుకెళ్ళటానికి. అప్పుడావిడకి తెర అడ్డొచ్చి ట్రేలో కప్పులు కదులుతాయేమోనని తెర ఒత్తిగిల్లించి పట్టుకోవడంలో కనబడ్డాడతను. గుండె నీరైపోయింది. నిన్ను లోపలికి రమ్మని రెండుసార్లు సంజ్ఞలు చేస్తే నువ్వు రాలేదు. అంచేత నోరు తెరిచి పిలిచేను. ఒకటి చెబుతున్నాను రంగా. ఈ పెళ్ళి జరిగితే నువ్వు సెగలోంచి నిప్పులో పడడం ఖాయం. నువ్వు ఎత్తి ఎత్తి కాలు ఎంగిలాకుమీద వేస్తున్నావు!"

రంగనాయకి చిరునవ్వుతోనే వుంది. రాజేశ్వరి నడుం పట్టుకుని లోపలిగదిలోంచి ముందు గదిలోకి తీసుకొచ్చింది. ముందు గది తెరముందు "నేను వాడి మొహం చూడను!" అని బిగిసిపోయి బరువెక్కింది రాజేశ్వరి. "ఏం భయం లేదు. అతను నిన్నేం చెయ్యడు. నేనున్నాను రా" అని గుసగుసలాడి ముందుగదిలోకి లాక్కొచ్చింది రంగనాయకి.

"అరె! రాజమ్మా, ఏంటి నువ్విక్కడ?" అని లేచి నిలబడ్డాడు పెళ్ళి కొడుకు నారాయణ.

"అమ్మాయి నేస్తురాలు. వైజాగ్‌లో వుంటుంది" అంది రంగనాయకి తల్లి పెళ్ళికొడుకునూ, కూడా వచ్చిన స్నేహితుణ్నీ అనునయంగా చూస్తూ.

"అవునండి మా బంధువులమ్మాయే. నాకు మరదలి వరస!" అని తటాలున

కూచున్నాడు నారాయణ. నవ్వబోయిన అతని మొహం పళ్ళు బయట పెట్టిందిగాని అందులో నవ్వు రాలేదు. సరిగ పద అని కాగితం మీద రాస్తే మోహనం రాదు.

"మొత్తానికి ఓ యింటివాడివవుతున్నందుకు సంతోషం నారాయణ బావా!" అంది రాజేశ్వరి దేపులా-అదేపు చూడకుండా, సంతోషం అన్నందుకు నవ్వకుండా.

"ఒక యిల్లేంటి మీ నారాయణ బావకీ. దీంతో మూడిళ్లు!" అని పకపకా నవ్వాడు కూడా వచ్చినాయన.

"మీ శాంతక్కా, బావగారూ కులాసేనా? అక్కడేగా నువ్వుంటా?" అని అడిగాడు నారాయణ.

రా జే శ్వ రి చురుగ్గా చూసింది. "శాంతక్క పోయింది, నీకు తెలవదా?"

"అరె! తెలవదే!"

"ఇప్పుడలాటియన్నీ యెందుగ్గాని అల్లుడుగారూ! తమరు ఊరెళ్ళగానే బ్రామ్మల్ని కేకేసి మూర్తం పెట్టించండి" అంది రంగానాయకి తల్లి - "అనుకున్నదేదో తొరగా అయిపోవాలగా".

అతిథులిద్దరూ లేచారు. అర నిమిషం మర్యాదల్తో వెళ్ళారు.

"నేనెళ్ళి వంట జేస్తాను. మీరు కబుర్లాడుకోండి" అని రంగానాయకి తల్లి లోపలి కెళ్ళింది.

అంతసేపూ నిలబడేవున్న రాజేశ్వరిని పొదివి పట్టుకుంది రంగనాయకి. "దా!" అని మంచం వరకు తీసికెళ్ళి "కూర్చో! కూర్చోవాలని లేకపోతే అలా నడుం వాల్చు" అంది ఆమెని మంచం మీద కూర్చోబెట్టి, తనూ కూచుంటూ.

"రంగా! నీ వరస చూస్తే నువు కేవలం డబ్బే చూసుకున్నట్టుంది గానీ, ఆ మనిషి నీ కెంతమాత్రం తగడు. నువ్వెక్కడ? అతనెక్కడ? నువ్వేమో బి.ఏ. దెపు హయ్యేచు, షార్ట్ హేండు హయ్యేచు. మరి అతనో? పొట్ట చీలిస్తే అక్షరం లేనివాడని అనడానికి వీల్లేదు. కాని మూడుసార్లు స్కూల్ ఫైనల్ తప్పాడు. ఆ తరువాత చదువు జోలికి వెళ్ళలేదు. ఈ లోపులో పేకాట, తాగుడు, ముండలు - అన్నీ అలవాటయ్యాయి. అతనికి ఆడదంటే అయిదు రూపాయల నోటు పాటి కూడా కాదు. నేనేదో ఇంత వరకు వచ్చిన నీ పెళ్ళి చెడగొడ్తున్నాననుకోకు! ఇది మాత్రం నిజం రంగా" అంది రాజీ బాధతో.

రంగనాయకి ముఖంలో ఎప్పటి చిరునవ్వే.

"యు ఆర్ ఆల్వేస్ ఎ గుడ్ ఫ్రెండ్ రాజీ!" అని రాజీని బుగ్గ ముద్దాడింది రంగ. అతను నాకివాళే పరిచయం. నీకైతే చాలాకాలం నించి తెలుసు. అంచేత నీ మాట నమ్ముతాను. కాని ఇటు చూడు రాజీ! నా సంగతి కూడా నీకు నిన్న సాయంకాలం సరికి పూర్తిగా తెలుసు. ఆ లెక్కని అతను నాకు సమవుజ్జీయే కదా. నాలాంటి దానికి అంతకంటే పవిత్రుడు యెలా దొరుకుతాడు రాజీ? దొరికినా అలాంటి మునీశ్వరుణ్ని నేనెలా తట్టుకుంటాను? అందుకే నేను నిన్న రైల్లో వస్తున్నప్పుడే చెప్పాను. ఈమారు ఎలాంటి వాడొచ్చినా సరే, నేను మాత్రం ఒప్పేసుకుంటానని. ఈ పెళ్ళికొడుకు ఫలానా అని నాకు తెలీకపోయినా ఇతను పడమటి గోదావరి జిల్లా పల్లెటూరివాడనీ, ముప్పయ్యేదేళ్ళున్నాయని, బాగా ఆస్తి వుందని, రెండు రోజులకోసారి రాజమండ్రిలోనో, తణుకులోనో డబ్బు

ఖర్చుపెడుతూ కనిపిస్తాడని – ఇవన్నీ కర్ణాకర్ణిగా తెలుసు. నా కతని ఆస్తీ, ఇళ్ళూ కాదు నచ్చుత. అతని బలహీనతలే నాకు నచ్చినై. అలాంటి మనిషితో అయితే నేను ఇంకాస్త నిర్భయంగా సంసారం చెయ్యగలను !...నా కింకొక టనిపిస్తుంది. చెప్పనా ?"

రాజేశ్వరి ఖాళీగా చూసిందంతే.

"ఒకవేళ అతను కూడా యిన్నాళ్లూ జీవితంలో డబ్బు యిచ్చే సుఖాలన్నీ కొనుక్కుని, ఆకలి తీరి ఆబతీరి చివరికి ఈ ముప్పయ్యొయిదేళ్ళ తరవాత నాకు లాగే పరివర్తన చెంది తనదంటూ ఒక యిల్లాల్ని, తన వాళ్ళంటూ ఓ యిద్దరో ముగ్గురో పిల్లల్ని పొంది ఇకమీదట బుద్ధిగా వుందామని ఒక నిర్ణయానికొచ్చే డేమో?"

"..."

"మాకిద్దరికీ యిప్పుడు సరిపడ్డంత డబ్బుంది. ఒకరికి తెలియకుండా మరొకరికి రెండు రకాల ప్రపంచానుభవం వుంది. అంచేత ఒకరి తప్పులొకరు తెలుసుకుని క్షమించుకోకపోయినా ఒకరితప్పుల్ని మరొకరు తేలిగ్గా చూడగల వేళ యిదేనేమో?" అన్నది రంగనాయకి కళ్ళలో మెరుపు ఏమాత్రం తగ్గకుండా.

"ఆశించడం తప్పుకాదు" అన్నది రాజేశ్వరి గోడకి చేరబడే ప్రయత్నం చేస్తూ కళ్ళుమూసుకుని.

రంగనాయకి ఆమె వీపును ఒక చేత్తో ఆపి, గోడ ఒడ్డున ఒక పెద్దదిండు పెట్టి చెయ్యితీసేసింది. రాజేశ్వరి సుఖంగా చేరబడ్డాక లేచి కాళ్ళవైపు ఒక స్టూల్ తెచ్చి వేసింది. రాజేశ్వరి ఆ స్టూల్‌మీద కాళ్లు పెట్టుకుంది.

"అయితే నేనొక్క విషయం అడగదల్చుకున్నాను. నువ్వు ఆయన గురించి నాకు పూర్తిగా చెప్పావు. సరే నాగురించి నీకెలాగూ తెలుసనుకో. అయితే ఒక సందర్భంలో నావల్ల నీకు మహా అపచారం జరిగింది. నువ్వొకనక తట్టుకుని నన్ను క్షమించావు. ఆ విధంగా అతని వల్ల కూడా నీకెప్పుడైనా అపచారం జరిగితే అతన్ని నువ్వు క్షమించడంకాదు. నీకతనిచేత క్షమాపణ చెప్పించే పూచీ నాది. ఆ విషయంలో నువ్వేమైనా చెబితే వినాలని వుంది" అంది రంగనాయకి ఆమె మీదికి ఒంగి మంచం మీద కూర్చుని.

"ఎక్కువ మాట్లాడితేనే ఎక్కువ తప్పులు చేస్తాం" అని బావగారు చెప్పిన మాట గుర్తొచ్చింది రాజేశ్వరికి. కళ్లు మూసుకునే తల అడ్డంగా వూపింది రంగనాయకి ప్రశ్నకి బదులుగా ఎంతో చెప్పాలనిపించినాసరే.

కళ్లు తెరిస్తే కన్నీరు...!




"ఏటమ్మా యింతాలస్యమైందివ్వాళ? ఎక్కడికెళ్లావో, ఎప్పుడొస్తావోనని బెంగెట్టుకు సస్తున్నాను" అని కొంచెం చిరాకూ మరి కొంచెం అభిమానం మేళవించి అడిగింది మంగమ్మ – రాజేశ్వరి గుమ్మం ఎక్కుతూంటే జవాబు కోసం చూడకుండా ఆమె లోపలికెళ్ళి టేబిలు




మీద ఏర్పాటుగా వుంచిన ఒక టెలిగ్రాము, ఒక ఉత్తరమూ తెచ్చి ఇచ్చింది.

రాజేశ్వరి ముందు ఆదుర్దాగా టెలిగ్రాం విప్పింది "సన్‌డే - సెకండ్ సెప్టెంబర్ - షార్ట్‌హాండ్ టెస్ట్-ఎయిట్ ఎ. ఎం - హోటల్ పంచవటి ప్రిమిసెస్-ఇంటర్వ్యూ - త్రి పి.ఎం. - సేమ్‌డే-సుధాకర్ క్రూసిబుల్స్"

"సన్‌డే-రేపే-రేపుదయమే!" అంది రాజేశ్వరి.

"ఏంటమ్మా అది ? అంతా బాగున్నారా?"

రాజేశ్వరి సంతోషంగా నవ్వింది. "అవునత్తమ్మా! ఏంలేదు-రాజమండ్రిలో వుద్యోగానికి పెట్టాను కదా, వాళ్లు టెలిగ్రాం యిచ్చారు. రేపు ఉదయం పరిక్షంట. మధ్యాహ్నం యింటర్వ్యూ అంట"

"రేపు పరీక్షకి రమ్మని ఇవ్వాళే ఇలా అదర గొట్టేసి టెలిగ్రాం యివ్వకపోతే నాలుగు రోజులు ముందుగా ఉత్తరమే రాయకూడదో ఏమో ?" అంది మంగమ్మ గాభరా అంతా తగ్గినా యిబ్బంది తొలగని ధోరణిలో.

"రేపు ఉదయం ఎనిమిదింటికి పరీక్ష. అంటే ఈ రాత్రి లోగానే రాజమండ్రి చేరాలి" అని పైకే అనుకుంది రాజేశ్వరి. అప్రయత్నంగా వాచీ చూసుకుంది. పన్నెండు దాటి అయిదు నిమిషాలైంది.

అప్పుడు గుర్తొచ్చిందామెకి. తన దగ్గర రాజమండ్రి వెళ్ళి రావడానికి డబ్బు లేదని-

శనివారమని-

పన్నెండు గంటలు దాటింది గనక ఎకౌంట్‌లో డబ్బు వున్నా విత్‌డ్రాయల్ ఇవ్వరని.

'అయినా చూద్దాం, అక్కడ శేషమణిగారు వుండకపోతారా ? ఆవిడ ఈ మాత్రం సాయం చెయ్యకపోతారా ?" అనుకుంటూ, "అత్తమ్మా! నే నర్జంటుగా బ్యాంకు కెళ్ళాలి. ఏమంటే రాజమండ్రి వెళ్ళిరావడానికి అథమం ముఫై నలభై రూపాయల్లాకా వుండాలి. బ్యాంక్ కట్టేసారేమో!" అని ట్రంకు పెట్టె తెరిచి పాస్ బుక్కు తీసుకుని మహారాణి పేట బ్రాంచికి పరుగులాంటి నడకతో బయల్దేరి పోయింది.

బ్యాంకు కెళ్ళేసరికి పన్నెండుం పావు కూడా అయిపోయింది. అద్దాల తలుపులు దగ్గరగా బిగించి లోపల్నుంచి వచ్చే వాళ్ళను మాత్రమే గమనిస్తూ ఇవతలి వేపున భయంకరంగా నిలబడి వున్నాడు. ఖాకీ దుస్తుల్లో ఉద్యోగి.

లోపల జనం చాలామంది వున్నారు. ఎలాగో సందు చేసుకుని దూరేస్తే ధైర్యమే.

"శేషమణమ్మగార్ని కలవాలి" అంది రాజేశ్వరి.

రాజేశ్వరి చేతిలో వున్న పాస్‌బుక్కు వేపు చూపిస్తూ, "బాంక్ టైం అయిపోయిందమ్మా !" అన్నాడు తలుపు దగ్గర మనిషి. అంతలోనే ఆడకూతురు గదాని మొహమాటానికిలాగ తలుపు కొద్దిగా తెరిచాడు. జవాబు, కనీసం థాంక్స్ చెప్పకుండా లోపలికెళ్ళింది రాజేశ్వరి.

శేషమణిగారు తనుండవలసిన సీట్లో లేదు.

పక్క సీట్లో వున్న ఉద్యోగి తనని గుర్తు పట్టినట్టు చిరునవ్వుతో "శేషమణి గారివాళ శలవు పెట్టారండి" అన్నాడు.

"అరె, అలాగాండి?...నాక్కొంచెం విత్‌డ్రాయల్ కావాలండి. హెల్ప్ చేసి పెట్టరా ?"

"సారీ అండీ! కొత్తగా వచ్చిన బి.ఎమ్. గారు అదుగో అక్కడ నుంచుని బ్యాంక్‌లో ఎవరెవరు ఏం చేస్తున్నదీ గమనిస్తున్నారు. ఆయనకి లాంటివి కిట్టవు. కిట్టవంటే కిట్టవని కాదనుకోండి. ఇలాంటి అబ్లిగేషన్లు పెట్టుకుని మేం ఎక్కడ ఓ.టీ. క్లెయిమ్ చేసేస్తామేమో అని భయమన్న మాటండి... అంచేత కావాలంటే మీరు ఆయనతో మాట్లాడండి"

నీరసం వొచ్చి రాజేశ్వరి విజిటర్స్ బెంచి వొకటి మరీ ఖాళీగావుంటే దాని మీద కూర్చుండి పోయింది.

పాస్ బుక్కు ఓ చేతిలోంచి ఇంకో చేతిలోకి మార్చుకోడంలో, అందులో వున్న ఉత్తరం కనిపించి తనింకా ఆ ఉత్తరం చదవలేదన్న సంగతి గుర్తొచ్చింది.

"ప్రియమైన రాజీకి! నీ నేస్తం రంగ వ్రాయునది. నేనిక్కడ కులాసాగా యున్నాను. నీకు ఉత్తరం రాసి మూడు



మానాలైంది. షార్ట్‌హాండు పరీక్షపాసయినందుకు చాలా సంతోషం. నేను ఈ మధ్యాహ్నం బయలుదేరి రాజమండ్రి వెడుతున్నాను. మా అమ్మ నన్ను చూడాలని వుందని కబురుచేసింది. నాకిప్పుడు మూడవ నెల ప్రెగ్నన్సీ. ఆరోగ్యంగా వున్నాను. నీకు తెలిస్తే సంతోషిస్తావని రాస్తున్నాను. వీలున్నచో శనివారం, ఆదివారం రాజమండ్రి రావలెను.

ఇట్లు... నీ, రంగ"

రాజేశ్వరికి సంతోషమే కలిగింది.

బ్యాగ్‌లో ఎనిమిది రూపాయలున్నాయని జాకెట్లోంచి తీసి లెక్కచూసుకుంది. మంగమ్మత్త దగ్గిర పదిరూపాయ లుండకపోవు. చిల్లరామల్లరా మరో రెండు మూడు రూపాయలు పోగవుతాయి. వెంటనే బస్సుంటే వెళ్ళిపోవచ్చు. రాత్రిఏడెనిమిది గంటలకి రాజమండ్రి చేరవచ్చు కూడానూ. అట్నుంచి ఛార్జీలకి, అక్కడేమైనా ఖర్చులకీ రంగ నడిగితే యిస్తుంది.

అంతలోనే తను ఈ ఇంటర్వ్యూ



సంగతి, పరీక్ష సంగతి బావగారితో చెప్పనేలేదని గుర్తుకొచ్చింది.

చుట్టూ చూడ్డంలో ఇందాక తనకి విత్‌డ్రాయల్ ఇవ్వడం విషయంలో సాయం చెయ్యలేనన్న అబ్బాయి తనవేపు ఇంకా అలాచూస్తూనే వుండడం కనబడింది. అతని దగ్గరగా వెళ్ళి "సార్ ఒకసారి ఫోన్ చెయ్యొచ్చాండీ ?" అంది.

"ఓ!" అన్నాడతను. చుట్టూరా తిరిగి రమ్మని సంజ్ఞచేసి హెడ్ అకౌంటెంట్ దగ్గిరకి ముందుగాచేరి, అతనికి చెప్పాడు తనెళ్ళేసరికి. "నెంబర్ తెలుసాండీ, డైరెక్టరీ కావాలా ?" అని అడిగాడు.

హెడ్ ఎకౌంటెంటు సొరుగులాగి టెలిఫోన్ డైరెక్టరీ బయట పడేశాడు, రాజేశ్వరి నమస్కారం అందుకుంటూ.

"హలో! నా పేరు రాజేశ్వరండి... అసిస్టెంట్ డైరెక్టర్ రాజారావు గారింటి నుంచండి. రాజారావుగారితో మాట్లాడొచ్చాండి?"

"ఒక్క నిమిషం!"

"హలో"

"హలో, రాజీ!...ఏమిటి ?"

"బావగారూ ! నాకు రాజమండ్రి రమ్మని టెల్రిగాం వొచ్చిందండీ. రేపు వుదయం ఎనిమిదింటికి షార్ట్‌హాండ్ టెస్టుట. మధ్యాహ్నం ఇంటర్‌వ్యూ అంట. సుధాకర్ గ్రూసిబుల్స్ వాళ్ళిచ్చారండి టెల్రిగాం"

"నువ్వెక్కణ్ణించి మాట్లాడుతున్నావు?"

"మహారాణిపేట బ్యాంక్‌నుంచండి"

"అయితే వెంటనే బయటికెళ్లు. మా ఆఫీస్ జీపు నెంబరు తెల్సుగా. అక్కడే వుంటుందింకానూ డ్రైవర్ పేరు మోహన్ రెడ్డి. వాళ్లు జీతాల బిల్లులు మార్చుకుందికి ఆ బ్యాంక్‌కే వచ్చారు. నేను చెప్పానని చెప్పి ఆ జీపులో ఎక్కి ఇక్కడికిరా. నాకిప్పుడు యింటికి రావడానికి కుదరదు. అర్జంటుగా విజయనగరం వెళ్లాలి. మా కమీషనర్ అక్కడ క్యాంపువేసి కబురు చేశారు"

"బతికించారు. మీతో చెప్పకుండా రాజమండ్రి వెళ్ళిపోవలసివచ్చేది. ఇప్పుడు నేను ఫోన్ చెయ్యకపోతేను"

"ఓకే. ఒకవేళ నువ్వు ఫోనొదిలి బయటికెళ్ళేసరికి జీపు బయలుదేరేసుంటే వెంటనే (బేరం ఆడుతూ కూచోక) ఏదో ఓ రిక్షా చేసుకొచ్చెయ్యి. నువ్వొచ్చేదాకా నేనిక్కడ వుండగలను అలాగైతేను... కాని సాధ్యమైనంతవరకు జీపు మిస్సవకుండా చూసుకో"

"థాంక్యూ బావగారూ!"

జీపు వుంది. మోహన్‌రెడ్డి సరేనన్నాడు. కాని పదినిమిషాలు పట్టొచ్చునన్నాడు బయల్దేరడానికి.

"అయితే యిక్కడే వుంటానుగా. ఓ టెల్రిగాం యిచ్చివస్తాను" అని పక్కనే వున్న పోస్టాఫీసువేపు చూపిస్తూ అంది రాజేశ్వరి. బావగారి దగ్గిర డబ్బు వుంటుంది. ఎంత కావాలన్నా తీసుకోవచ్చు !

"ఒకటిగాకపోతే మూడు టెల్రిగాములిచ్చుకోండమ్మా. ఇంకా యిప్పుడే కద. టోకెను పుచ్చుకున్నాడు మా కేషియర్ గారు"

"కంగ్రాచులేషన్స్ – కమింగ్ టుడే–గోదావరి–కమ్–రాజమండ్రి స్టేషన్–రాజీ" ఎక్స్‌ప్రెస్ టెల్రిగాం.

* * *

ఆఫీసు చేరుతూనే రాజారావు గదిలోకి వెళ్ళిపోబోయింది రాజేశ్వరి. "అయ్యగారు





అర్థంటు పనిమీదున్నారండి. ఇక్కడ కూర్చోండి" అని జవాను అడ్డు పెట్టాడు.

అక్కడ కూర్చుంటూ "నాదీ అర్జంటే నయ్యా బాబూ!" అంది రాజేశ్వరి చిరు నవ్వుతో. వారు రమ్మని ఫోన్‌చేస్తేనే వచ్చాను! పోనీ నువ్వు కాస్త లోపలికెళ్ళి మీ ఇంటికాణ్ణుంచి ఎవరో బంధువులొచ్చా రని చెప్పవూ?"

జవాను బుర్రగోక్కుని "తమరి పేరండి" అన్నాడు.

"రాజేశ్వరి"

స్వింగ్ డోర్స్ తెరుచుకుని లోపలి కెళ్ళాడు జవాను. మరుక్షణం పూచలా బయటికొచ్చేసి ఆ తలుపులు తనకడ్డం వచ్చి యింకా ఆలస్యం చేస్తాయేమోనని భయపడినట్టు బారుగా తెరిచిపట్టుకుని "దయచేయండమ్మగారూ" అన్నాడు.

రాజేశ్వరి లోపలికెళ్తూనే టెలిగ్రాం కాగితం రాజారావు కందించింది. అంత సేపూ అతని పక్కన కూర్చుని అప్పుడే లేచి చేతిలో షార్ట్‌హాండ్ నోట్‌బుక్‌తో గదిలో మూలకెళ్ళి టైపుమిషన్ దగ్గిర కూర్చున్న స్త్రీని చూసింది.

ఆమెని తను ఇదివరకెప్పుడూ చూడలేదు.

బావగారికి విడిగా స్టెనోగ్రాఫర్నిచ్చే రన్నమాట!

ఎంత అందంగా వుందావిడ!

ఇరవైమూడు, ఇరవైనాలుగేళ్ళ కన్నా వుండవనిపిస్తోంది.

ఎక్కడా పుట్టుమచ్చ అయినా లేని పచ్చటి శరీరచ్ఛాయ ఆవిడది.

సన్నగా వుందిగాని పుష్టిగానే వుంది షోకేసులో విగ్రహంలాగ.

చీరా, జాకెట్టూ ఆ విగ్రహానికి అంత షోగ్గానూ, అంత షోగానూ అతికినట్టు న్నాయి.

సోగకళ్ళు.

లేత పెదవులు.

బూరి బుగ్గలు.

బారెడుంటుంది జెడ.

మెళ్ళోనో సన్నటి బంగారం గొలుసు ఉందాలేదా అన్నట్టు.

చేతుల్లో వోదానికి మాత్రం సలు చదరపు వాచీ వుంది.

రెండోది చిన్న వుంగరమైనా లేనంత ఖాళీగా, బోసిగా వుంది.

అసలేదో బోసిగానే వున్నట్టుంది, అంత అందమైన విగ్రహానికీనీ.

బొట్టులేదు.

తాళిబొట్టులేదు!

కాళ్ళకి మట్టెలూ లేవు!

పరిశీలించి చూస్తే ఆ ఆపాద మస్తక సౌందర్యంలోనూ,

ఆ సోగకళ్ళలోనూ కూడా ...

ఆ లోటు సన్నగా, ఆ రెండోచేతిలో షార్ట్‌హాండ్ పెన్సిల్లా,

ఆ బాధ ముల్లులా ఆ పెన్సిల్ ముల్లులా...

కనిపిస్తూనే వుంది!

"ఓకే కంగ్రాచులేషన్స్! కూర్చో వేం?" అన్నాడు రాజారావు టెలిగ్రాం కాగితం రాజేశ్వరి కందిస్తూ.

రాజేశ్వరి చూపు అట్నుంచిటు తిప్పింది.

రాజారావు 'ఆమె'నీ, రాజేశ్వరినీ మార్చిమార్చి చూశాడు.

'ఆమె' ఇటు చూడనేలేదు. టైపు మిషన్లో కాగితం ఎక్కిస్తోంది. ఆ తరవాత ఆ మూల ప్రస్ఫుటంగా కన బడ్డానికి వీలుగా ఏర్పాటు చేసిన టేబిల్

లైట్ స్విచ్చివేసి ఎత్తుగా వున్న ఆ కుర్చీలో కూర్చుంది.

ఇక్కడ రాజేశ్వరీ కూర్చుంది.

కాని చూపు అటే వుండిపోయింది.

"కమలగారూ, పిల్చాడు రాజారావు.

ఆమె ఇటు చూసింది.

''మా మరదలు రాజేశ్వరి"

"నమస్కారం!"

"కమలగారు నా స్టెనో గ్రాఫరు. గుంటూర్నించి ట్రాన్స్ఫరై వచ్చారు. మూడు నెల్లయింది"

"నమస్కారమండి"

"సో-నువ్వు టాటా ఎక్స్ప్రెస్‌లో వెడతావా, గోదావరికి వెడతావా? ఈ రాత్రికి రాజమండ్రి చేరవలసిందే. రేపు ఉదయం ఎనిమిదింటికి టెస్టంటున్నారు గనక. రెండు ట్రైన్లూ ఇంచుమించు ఒకేసారి వెడతాయనుకుంటాను. లేక రెండు గంటలు ఆలస్యంగా బయల్దేరినా గోదావరెక్స్‌ప్రెస్సే ముందెళ్ళొచ్చును. నాకు విజయనగరంలో మా కమిషనర్‌తో పని లేకపోతే నీ కూడా వచ్చుండేవాణ్ని. అయినా ఫర్వాలేదు. నువ్వెళ్లు. ధైర్యంగా టెస్టూ, ఇంటర్వ్యూ పూర్తి చెయ్యి"

"అదికాదు బావగారూ, ఏంటంటే..."

"ఏమిటి చెప్పు!"

"నేను గోదావరెక్స్‌ప్రెస్కే వెడతానండి. ఎందుకంటే ఇప్పుడు టైం ఒంటి గంట అయిందండి. నేను మళ్ళా మెస్సు కెళ్ళాలికదా. రాత్రీ, రేపూ ఉండనని చెప్పాలికదా. ఈ మూడు పూట్లకీ సరుకులు స్టోర్ నించి డ్రాచేసి వంటాళ్లకి ఒప్పచెప్పాలికదా. స్టోర్ తాళాలు హేమవతిగారికో, వార్డెన్‌గారికో ఒప్పచెప్పాలి కూడా కదా. వంటాళ్ళు మూడున్నరకి గాని రారు. ఈ లోపల వార్డెన్‌గారికి కబురందజెయ్యాలి"

"ఆ సోదంతా నా కెందుకు రాజీ!" నవ్వాడు రాజారావు-"చెప్పానుగా నా కర్థంటు పస్తున్నాయని... నువ్వు గోదావరి కెడ్తానంటావంతేగా"

"అంతేండి, అంతేండి" ఆయన టైం పాడు చేస్తున్నందుకు ప్రశ్చాత్తాప పడిన ధోరణిలో భయంగా చెప్పింది రాజేశ్వరి.

"నువ్విక్కడికి జీపులో వచ్చావా, రిక్షాలోనా?"

"జీపులోనేనండి"

"ఓ.కే."

కాలింగ్ బెల్ స్విచ్ నొక్కాడు రా జా రా వు. అదెక్కడో అవతల మోగింది.

"యస్సార్" అంటూ ఇందాక రాజీని అడ్డిన జవాను.

"డ్రయివర్ మోహన్‌రెడ్డి" అని అటు చూడకండా పిల్చుకు రమ్మని ఆర్డరు వేశాడు రాజారావు.

"యస్సార్"

స్ప్రింగ్ డోర్సు మళ్ళా మూసుకున్నాయి.

"గోదావరి ఎక్స్‌ప్రెస్ రాజమండ్రి చేరేసరికి రాత్రి తొమ్మిదవుతుంది. అప్పుడు నువ్వు ఆ వూళ్ళో యెక్కడి కెడతావు?" టేబిల్‌మీద మునివేళ్ళతో డ్రమ్మింగ్ చేసేడు రాజారావు. ఒకవేలు పైకెత్తి "పోనీ-నీతో బాటు మా క్లర్క్ రోజీని పంపనా? ఆవిడదీ రాజమండ్రే. వారం రోజుల్నుంచీ సెలవు అడుగుతోంది. ఈ కమిషనర్ విజిట్ మూలాన్ని దాటేస్తున్నాను సెలవివ్వకండానూ. ఇప్పుడిహ పన్లన్నీ అయిపోయాయి కనక తను వెళ్ళిపోయినా

ఇబ్బందిలేదు. నేనే కబురు చేసి రాజమండ్రి వెళ్ళవమ్మా అంటే యెగిరి గంతేసి వస్తుంది!"

"రైల్లో నాకేం సాయం అక్కర్లేదు బావగారూ...మరేం..."

ఒక చెయ్యి పెట్టి ఆమెని ఆపాడు. రాజారావు ఫోన్ తీశాడు. "సారథిగారూ! బి సెక్షన్ క్లర్క్ బి-త్రి-రోజీని మాట్లాడ మనండి!" అని ఫోన్ పెట్టేశాడు.

"ఆవిడతో వెడితే రైల్లో సాయమే కాదు అక్కడ పూర్తిగా నీకు సాయం వుంటుంది తను. నువ్వసలు వాళ్ళింట్లోనే దిగొచ్చు. వాళ్ల ఫాదరున్నారక్కడ. ఆయన రాజీకే ఫాదర్ కాదు ఒక చర్చిలో కూడాను. నువ్వు ఈ టెస్టు, ఇంటర్వ్యూ అన్నీ సక్రమంగా చేసి వస్తే గిస్తే ఆ ఉద్యోగమే నీకొచ్చినా వాళ్ళింట్లోనే వుండిపోవచ్చు. అదంతా అలా వుంచి, రేపు తెల్లారేసరికి ఆ టెస్టు జరిగే చోటికీ, మధ్యాన్నం సుధాకర్ క్రూసిబుల్స్ ఆఫీసుకీ నిన్ను దగ్గిరుండి తీసికెళ్లగలదు రోజీ. శలవు పెట్టి వెళ్ళిపోదామనే వుబలాటమేతప్ప ఈవిడగారికి అక్కడ చేసే పనేం వుండదు మహా!"

కమల నోట్ బుక్ పట్టుకుని రాజారావు దగ్గిరగా వచ్చింది "సార్ ప్రిపోస్టరస్‌లీ కదండీ?"

"యస్. ప్రిపోస్టరస్‌లీ"

ఫోన్ తీశాడు రాజారావు మళ్ళీనీ.

"వాట్ సారథిగారూ! దట్ బి-త్రి మిస్ రోజీ-వాట్ హాపెండ్ టు హర్?"

"సార్? సీట్లోలేదంట సార్" సన్నటి గీతలా ఇవతలికి కూడా వినిపించింది.

"ఎక్స్‌క్యూజ్మీ సర్" అంది కమల

"యస్?"

"రోజీ మార్నింగే వెళిపోయింది సార్! మీరప్పటికింకా ఆఫీస్‌కి రాలేదు. డి. డి. గారున్నారు. ఆయనతో చెప్పింది. డి. డి. గారు ఆవిడ లీవప్లికేషన్ స్వయంగా తీసుకుని మీ రికమెండేషన్ కోసం పంపమన్నారు సర్. ఆవిడ శాలరీ కూడా మిసలేనియస్ క్యాష్‌లోంచి పేమెంట్ ఇచ్చేమన్నారు సర్. నేనీ స్టేట్ మెంట్స్ హడావిళ్ళో పడి చెప్పడం మరిచిపోయాను సార్''

రాజారావు నవ్వాడు, "ఓకే! నెవర్ మైండ్! దేరీజ్ నథింగ్ టు బాదర్! ఇది మీ కాన్సెంట్రేషన్‌కి మరో ఉదాహరణ, అంతే!" అని, ''గో ఎహెడ్! ఆ లెటర్ కావాలి నాకు! పదినిమిషాల్లో మీ డ్రాఫ్టు, నా కరెక్షను, డి. డి. గారి అప్రూవలు, ఫెయిర్ కాపీ అన్నీ అయిపోవాలి!"

"యస్సార్!" అని తనసీట్లో కెళ్ళిపోయింది కమల.

టేబిలుమీద, మునివేళ్ళతో మళ్ళీ తాళం వెయ్యడం ప్రారంభించాడు రాజారావు.

ఫోను గిజ్ అంది.

"యస్! రాజారావ్ హియర్-ఐసీ! తెలుసు తెలుసు. ఆఁ, ఇప్పుడే చెప్పారావిడ. థాంక్యూ...ఇట్స్ నథింగ్ నెవర్ మైండ్!" అని ఫోను పెట్టేశాడు రాజారావు. "గవర్నమెంటాఫీసంటే అంతా సిస్టమ్." పకపకనవ్వాడు. బి. సెక్షన్ సూపరింటెండెంటు అటెండెన్సు రిజిస్టరూ, కాజువల్లీవు రిజిస్టరూ అన్నీ కూలంకషంగా పరిశీలించి మరీ చెప్పేడు రోజీ లీవు పెట్టిందని, కానింకా గ్రాంట్ కాలేదనీ. అయితే డి.డి.గారు ముందుగా వొప్పుకున్నారనీ కాగితం ఇప్పుడో యిహనో నా సంతకానికి వొస్తుందనీనూ"

"ఫరవాలేదు బావగారూ"

"ఫరవాలేదేమిటి నీ మొహం! రాత్రి తొమ్మిదిగంటల వేళప్పుడు నువ్వొక్క దానివీ రాజమండ్రిలో దిగి ఎక్కడికెడ తావు రాజీ?...నువ్వలా కూర్చో, ఆలోచించి చెబుతాను!"

తలుపు మీద టకటక శబ్దం; "సార్'' అని అవతల్నుంచి పిలుపు. "కమిన్!"

డ్రయివర్ మోహన్‌రెడ్డి శెల్యూట్ చేస్తూవొచ్చాడు. కూడా, పిలవడాని కెళ్ళిన జవాను; చూసేరా; మీరు పిల్లవ మన్నారో లేదో; వెంట బెట్టుకు వచ్చాను !'' అన్న దర్పంతో; దాన్ని వినయంగా చూపిస్తూనూ.

"బండి చెకప్ చేయించావా, రెడ్డీ?"

"యస్సార్."

"మనం ఇంకో పావుగంటలో బయ ల్దేరి విజయనగరం వెళ్తున్నాం; తెలుసు కదా. పెట్రోలుందా?"

"ఉందిగానండి;, విజయనగరానికైతే చాల్దు సార్."

"మరి అలాంటప్పుడు-ఇప్పుడే వెళ్ళి ఫిల్ చేసుకురాకూడదు? నాకు ప్రయాణం పెట్టుకున్నా'క మధ్యదార్లో పెట్రోలు కయినా సరే ఆగడం చిరాకు!"

"అలాగే సార్" జేబులోంచి సన్నటి పొడుగుపాటి పుస్తకం తీశాడు రెడ్డి. "విజయనగరానికి రానూ పోనూ పది లీటర్లు చాలు సార్. కాని అక్కడ మళ్ళా లోకల్తుంటాయి కదండి సార్. బండిలో నాలుగుంటాది సార్......" అని పుస్తకం తెరిచి బల్ల మీద పెట్టాడు.

"పది పేను రాస్తున్నాను; సరేనా?" అని, రాస్తూ, "అప్పన్నా అర్జంటుగా రెండు కాఫీలు పట్రా!" అన్నాడు.

"అయి'' అని వెళ్ళాడు,... అప్పన్న.

"బంకు దగ్గిరికి నీ కూడా ఎవరొ స్తున్నారు?...రాంమోహన్రావ్‌ని తీసు కెళ్ళు. నేచెప్పానని చెప్పు" అనీ పుస్తకం ముందుకి తోసి పెన్ మూడిచాడు రాజారావు. డ్రైవర్ "సరేసార్." అని వెళ్ళాడు

టైపుచెయ్యడం పూర్తయిన కాగితం పట్టుకొని రాజారావుకు దగ్గిరగా వచ్చింది కమల. "సార్" అని విన యంగా రెండు చేతుల్తోనూ పట్టుకుని అందించింది.

"కమలగారూ ?''

"సార్...?"

"నేనిది చూస్తూవుంటాను. మీరు టెలిఫోన్ బోర్డ్ దగ్గిరికెళ్ళి, రాజమండ్రి ఈ నెంబరుకి యస్. టి. డి. మీద రింగ్ చేసి; ఆనందరావు ఉంటే నాకు వెంటనే కనెక్షన్ యిమ్మని..సారథిగారితో చెప్పండి!'' అని, టేబిల్‌కి వేళ్ళాడు తున్నా చిన్న కాగితం ముక్కల్లో వొకటి తీసి, దాని మీదనాలుగంకెలు వేసి, ఆమె కిచ్చాడు.

"అలాగే సార్" అని ఆమె బయల్దే రింది. "ఆనందరావుగారు కదండి?" అని రూమ్ దాటింది.

రాజారావు రాజేశ్వరి కళ్ళలోకి దయగా చూసేడు. "ఏం లేదు. అతనికి కారుందిగా. స్టేషనుకి కారు పంపమందా మని! కారు నెంబరు కనుక్కోడం; అది నేన్నీకు చెప్పడం, నువ్వు రాజమండ్రిలో దిగ్గానే గేట్లో టిక్కెట్టిచ్చేసి ఆ నెంబరు గల కారు వెతుక్కొని వెళ్ళడం-అంతే! సింపుల్!......ఆనందరావు నిన్ను రోజీ ఇంటి దగ్గిర దింపేస్తాడు. రోజీకి

నీ గురించీ, కార్యక్రమం గురించీ చెప్తాడు......"

"అదికాదు బావగారూ! నేచెప్పేది అస్సలు వినడం లేదు మీరు. మా మెస్‌లో లోగడ రంగనాయకి అని ఇక్కడ ఎగ్రికల్చర్ డి. డి. ఆఫీస్‌లో స్టెనోగా వుండేది. ఆ అమ్మాయి పెళ్ళి చేసుకుని వుద్యోగానికి రిజైన్ పెట్టేసి వెళ్ళిపోయింది. తను అసలుండడం నిడదవోలు దగ్గర కాల్దరిలో. కాని మొన్నటికే రాజమండ్రి చేరుంటుంది వాళ్ళమ్మగారింటికి. ఇదుగో తను నాకు రాసిన ఉత్తరం; ఇందాక టెలిగ్రాంతో బాటే వొచ్చింది! నేను బ్యాంక్ నించి మీతో మాట్లాడేక తనని రాజమండ్రి స్టేషన్‌కి గోదావరి ఎక్స్‌ప్రెస్ వేళకి రమ్మని ఎక్స్‌ప్రెస్ టెలిగ్రాం యిచ్చేను! తను రాకపోయినా వాళ్ళిల్లు కొద్దిగా శ్రమపడితే కనుక్కోగలన్నేను. ఈ రాత్రికి, రేవు కూడా అక్కడే వుండొచ్చు, నేను! అంచేత.."

"చెప్పవేం మరీ?" అని ఫోన్ అందుకున్నాడు రాజారావు.

"నాకు బోలెడు ఆందోళన తగ్గించేవు.......అప్పుడెప్పుడో ఆ అమ్మాయికి పెళ్ళి చూపులన్చెప్పి నువ్వు సాయంవెళ్ళావు.. ఆవిడేనా?"

"మరే, బావగారూ.. తనే"

"మరి ఆమాట ముందే చెప్పవూ?"

"నన్ను మీరు చెప్పనిస్తే కద?" అని నవ్వింది రాజీ. వచ్చిన దగ్గిర్నుంచీ మీరు అడావిడి పడిపోతున్నారు; అందర్నీ అదలగొట్టి తరుముతున్నారు!"

"అఁ–ఎస్.. ఎస్! సారథిగారూ? అదే–రాజమండ్రి ఎస్. టి. డి. కాల్ అక్కర్లేదు. థాంక్యూ" అని ఫోన్ పెట్టేసి రాజారావు నవ్వాడు. "అలా తరమడానికే నాకు జీతం యిస్తారు గవర్నమెంటు. మరి జీతం పుచ్చుకుంటున్నందుకు ఆ మాత్రం పని చెయ్యాలి కద!"

"నా ప్రాబ్లెం ఏమిటంటే.." అంది రాజీ.

"సరే. నీ దగ్గిర రానూ పోనూ ఛార్జీలకి వాటికి డబ్బుందా? లేదు! అంతేగా?"

"అదే" అన్నట్టు తల ఆడించింది రాజీ.

"అదేం ప్రాబ్లెం కాదు!" అని మళ్ళా ఫోన్ తీశాడు రాజారావు. "అకౌంట్స్ సూపరింటెండెంటు రంగనాథాచార్ని మాట్లాడమనండి. లైన్లో ఉంటాను!''

పది సెకండ్లలో అవతల్నుంచి "హలో'' అని వినిపించింది. "నేను సార్, రంగనాథాచార్ని."

"ఎస్, యెస్! కేష్‌క్లర్కు సుబ్బారావున్నాడా?"

"ఉన్నాడు సార్."

"నా బిల్లూ, ఎమౌంటూ వెంటనే యిక్కడికి తెచ్చి యిమ్మనండి. అర్జంట్!"

"యస్సార్!''

కాఫీల ట్రేతో జవాను, అతని కోసం స్వింగ్ డోర్స్ పట్టుకున్న కమల

"నేననుకుంటూనే వున్నాను రెండంటే సరిగ్గా రెండే తెస్తావని! ఇడియట్!!" అన్నాడు రాజారావు "దాన్ని మూడు చెయ్."

"నాకక్కర్లేదు సార్! ఇందాకేగా తీసుకున్నాను?" అంది కమల.

"నాకు గుర్తుంది కమలగారూ!" అని

నవ్వాడు రాజారావు "రాజీ, మీరూ తొలిసారి కలుసుకున్నారు. ఇవ్వాల్నుంచీ మీరిద్దరూ ఫ్రెండ్స్! ఫ్రెండ్‌షిప్ సమ్‌టైమ్స్ బిగిన్స్ విత్ కాఫీ. కడుపు నింపుకోడం కోసంకాదు కంపెనీ కోసం!'' అని మొహమాటం పెట్టాడామెని రాజారావు.

ముగ్గురూ కాఫీ పుచ్చుకుంటూ వుండగా రాజారావు రాజేశ్వరితో అన్నాడు. "కమలగారు చాలా అరుదైన రకం వ్యక్తి రాజీ! స్టెర్న్ డ్యూటీ, డీప్ కాన్సెంట్రేషన్. అంతే" అన్నాడు.

స్వింగ్ డోర్స్‌మీద టకటక, "మే ఐ కమిన్ సార్?" అని సన్నటి అరుపు.

"వాణ్ణి ఆపు!" అని రాజారావు సంజ్ఞ చేశాడు అప్పన్నకి. దాంతో కేష్ క్లర్కు సుబ్బారావుకి 'అర్జంటు' అన్న రాజారావు ఆర్డర్ ఆర్డినరీ అయిపోయింది.

రావడమే 'ఫలానా దగ్గిర తమ సంతకం సార్' అన్నట్టుగా, బిల్లుమీద వేలు పెట్టాడు సుబ్బారావు. రాజారావు సంతకం పొడిచేలోగా రెండో చేత్తో పట్టుకున్న నోట్ల బొత్తి ఒక వంద విడి రూపాయల సరికొత్త కట్ట, మిగిలినవి వందలుగా పదులుగా వదులుగా...

"థాంక్యూ" అని తన సొరుగులో వున్న చిన్న హాండ్ బాగ్ లాగి, నోట్లన్నీ దాని నోట్లో పోశాడు రాజారావు.

"సార్! లెక్కపెట్టుకోలేదుసార్" అని వినయంగా చెప్పి అందులో తన తప్పే ఏదో వున్నట్టుగా నిలబడి వుండిపోయాడు సుబ్బారావు.

రాజారావు నవ్వాడు "ఔనౌను! లెక్కపెట్టుకోలేదు!... పేమెంట్ చేసింది రంగనాధాచారిగారైతే లెక్కపెట్టడమే కాదు కాగితం కాగితమూ లైటుకి ఎక్స్‌పోజు చేసి వాటర్ మార్కు వుందో లేదో చూసుకుని మరీ తీసుకోవాలి. బట్ ఇట్స్ డిఫరెంట్ విత్యూ" అని సుబ్బారావుకి ఓ షేక్హాండు కూడా ఇచ్చి "థాంక్యూ" అన్నాడు మరోమాటు.

సుబ్బారావు ఉబ్బితబ్బిబ్బై డబ్బు ఇచ్చిన వాడిలా కాకుండా డబ్బు పుచ్చుకున్న వాడిలా సంతోషపడి వెళ్ళాడు.

"నువ్విక్కడే కూర్చో రాజీ. ఈ కాగితం మా డి. డి.గారి చేత ఎప్రూవ్ చేయించుకొని వస్తాను. నిన్ను ఇంటిదగ్గిర డ్రాప్‌చేసి నేను విజయనగరం ప్రయా



ణానికి సిద్ధమౌతాను.కమలగారూ! ఓసారి జెనరల్ టైపింగ్ సెక్షన్‌కెళ్లి ఆ స్టేట్మెంట్లు రెడీ అయ్యాయేమో చూడండి. కంపేర్ చేసేరోలేదో కనుక్కోండి. కంపేర్ చేసినట్టు సంతకాలు మాత్రం చెయ్యొద్దని చెప్పేను. స్టేట్‌మెంట్స్ మీద సైడ్ ఇనిషియల్స్ చూస్తే కమిషనర్ మన ఆఫీసుకి నిప్పెట్టేస్తాడు. అంచేత ఒకవేళ వాళ్ళు అలవాటుగా సంతకాలు గాని పెట్టేస్తే అవి ఇక్కడికి తెచ్చి జాగర్తగా మీరే ఇరేజ్ చెయ్యండి.''

కమల వెంటనే తలవూపి వెళ్లింది.

"చాలా ఎఫిషెంట్ హాండ్ రాజీ. నాలాంటి బిజీ ఆఫీసర్‌కి ఇంట్లో ఇల్లాలు లేకపోయినా నీలాంటి మరదళ్ళెవరో ఓ కాపు కాసేస్తారుగాని ఆఫీసులో శుభ్రమైన స్టెనోగ్రాఫర్ లేకపోతే ఉద్యోగం, దాంతో బాటు జీవితం పెంట పెంట అయిపోతుంది!" అన్నాడు రాజారావు ఫోన్ తీస్తూ.

రాజేశ్వరి అతని సుఖానికి సంతోషిస్తూ ఆ మాటలు నిజమే నన్నట్టుగా తల వూపింది.

"సారథిగారూ! డి.డి.గారు ఖాళీగా వున్నారేమో ట్రేస్ చెయ్యండి. నేనాయన్ని అర్జంటుగా చూడాలి."

"స్టేట్‌మెంట్లూ, లెటరూ అయిపోతే పట్టుకుని మిమ్మల్నే రమ్మని చెప్పారు సార్. మీకు చెబుదామనుకుంటూ వుంటే మీరే రింగ్ చేశారు."

"ఓకే'' అని లేచాడు రాజారావు. "కూర్చో రాజీ! ఇప్పుడే వొచ్చేస్తాను!" అని సొరుగు మూసి, తాళంపెట్టి, తాళం జేబులో పెట్టుకుని కాలింగ్ బెల్ స్విచ్ నొక్కాడు. "కమలగానీ ఇక్కడికొస్తే మా డి. డి.గారి రూంలో కొచ్చేమను.''

రాజీ తల వూపింది.

బెల్ చప్పుడుకి జవాబుగా ''యస్సార్" అని కేక, స్వింగ్‌డోర్స్ తెరిచిన చప్పుడు, రాజారావు ఆ ఖాళీ గుండా వెళ్ళేక అవి మూతబడిన చప్పుడు.

రాజీ అక్కడికి లోగడ రెండు మూడు సార్లు వచ్చింది. "ఈయన రోజు రోజుకీ స్మార్ట్ అయిపోతున్నారు!'' అనుకుంది. "కాని ఇవాళ ఈయన ప్రదర్శించిన స్మార్ట్‌నెస్‌కి, యిదివరకటి కార్యదీక్షా ప్రమోషనాశా కారణాలు కావు" అని కూడా అనుకుంది.

దానికి జవాబులా, స్వింగ్‌డోర్స్ తెరుచుకుని కమల లోపలికొచ్చింది.

గది నిండా రంగూ రుచీ వాసనా నిండాయి.

"ఎ. డి. గారు డి. డి. గారి దగ్గిరి కెళ్ళారాండీ?'' అని అడిగింది కమల. చిరునవ్వు కూడా లేదా మొహంలో.

'బావగారు చెప్పినట్టు స్టెర్న్ డ్యూటీ, డీప్ కాన్సెంట్రేషను అనుకుంటూ "ఔనండి. మిమ్మల్నక్కడి కొచ్చే మన్నారు!'' అంది రాజేశ్వరి.

''థాంక్యు'' అని మెరుపులా వెళ్ళి పోయిందామె.

మెరుపే.

మెరుగే.

రంగూ, రుచీ, వాసనా—అన్నీ రైటే.

కాని తన ఎదటి నుంచి ఆవిడ వెళ్ళి పోతేనే బావున్నట్టుంది. ఎందుకో అర్థం కాలేదు రాజేశ్వరికి.

* * *

ఏ కంపార్ట్‌మెంట్‌లోనూ స్థలంలేదు, సరికదా చూరదానికైనా సందులేదు.




అలా వుంది, ఆ గోదావరి ఎక్స్ప్రెస్ వా ల్తేరు ప్లాట్ ఫారంమీద.

అసలే శనివారం.

అందులో ఫస్టు తారీకు.

జీతాలు పుచ్చుకున్నవాళ్లు ఎక్కువ మందేవున్నా జేబులు కొట్టేవాళ్ళు కూడా ఎక్కువ మందే వున్నట్టు ఏ మొహం కూడా ప్రసన్నంగాలేదు.

టైము చూస్తే బండి బయల్దేరడాని కింకా ముప్పయ్యయిదు నిమిషాలుంది.

ఆశ్చర్యపడి, భయపడి అంతలోనే టైమ్ చూసుకుని అందులోనే ధైర్యం తెచ్చుకుంటూ ప్లాట్ఫారం ఈ కొసనించి ఆ కొసకీ,ఆ కొసనించి ఈ కొసకి వెర్రెత్తి నట్టు మూడు సార్లు తిరిగింది రాజేశ్వరి.

చివరికి లేడీస్ కంపార్టుమెంట్లో కొద్దిగా దూరడానికి అవకాశం వున్నట్టు తేల్చుకుని అటు నడుస్తూవుండగా.—

"అమ్మలూ!" అని ఎవరో తననే పిల్చినట్టయింది.

అటువేపు తల తిప్పి చూసింది రాజేశ్వరి.

పొడవుగా, దృఢంగా వున్నాడాయన.

నలభైఅయిదు యాభై మధ్య వుంటుంది వయసు.

తెల్ల పాంటూ, గళ్ళ షర్టూ.

బాగా పరిచయంవున్న మొహంలాగే వుంది. కానెవరో తెలీలేదు.

అతను రాజేశ్వరిని చూస్తూ ఉదారంగా నవ్వి "నన్ను గుర్తు పట్టలేదామ్మా? నేను మధుసూదన్‌రావుని! మీ ఫ్రెండు రంగనాయకి అంకుల్ని!"

పోలీస్ ఇన్స్పెక్టర్ మధుసూదనరావు గారన్న మాట!

ఆయన్ని లోగడ నాలుగైదు సార్లు రంగనాయకిని వెంటేసుకు తిరుగుతూండగా పెద్ద మోటార్‌సైకిల్ మీద చూసింది రాజేశ్వరి. దాదాపు రెండేళ్ళ కిందట సింహాచలం వెళ్ళిననాడు రంగనాయకిని రక్షించే ప్రయత్నంలో ఆయన డ్యూటీ మీద వున్న స్టేషన్‌కెళ్ళి కుర్చీలో కూర్చుండగా చూసింది. అయితే అన్నిసార్లూ ఆయన ఫుల్ యూనిఫాంలో, ఆ మాటకొస్తే నెత్తిని టోపీతో, చేతిని లాఠీతోనే కనిపించేరు.

ఇప్పుడు మఫ్టీలో అదే 'సివిల్' డ్రెస్‌లో అంతకంటే మంచివాళ్లా, నిజమైన అంకుల్లా.

"నమస్కారమండీ" అని తడబడింది రాజీ.

"ఊఁ నమస్కారం! ఎక్కడికైనా ప్రయాణమా?"

"మరేండి. రాజమండ్రండి"

ఆయన నవ్వాడు. "ఇందాకట్నుంచీ చూస్తున్నాను. ప్లాట్‌ఫారం అంతా ఇటూ అటూ షటిల్లా తిరిగేవు. ఎవరికో సెండాఫ్ ఇవ్వడానికొచ్చేవేమో,వాళ్ళెవరో కనబడక ఈ రద్దీగా వున్న కంపార్టుమెంట్లలో వాళ్ళని కనుక్కోలేక తికమక పడుతున్నా వనుకున్నాను. చేతిలో బేగుంది. చూపుల్లో ఆందోళన వుంది. అంచేత ప్రయాణమే అనుకుని పలకరించేను"

'పోలీసువారు. తమకి తెలియనివి వుంటాయా? తమరు కనుక్కోలేనివీ ఉంటాయా' అనుకుంది రాజేశ్వరి. "అవునండి" అంది ప్రయాణం చెయ్యడమే మహాపాపం అనుకున్నంత సిగ్గుతో "ఈ పక్కన లేడీస్ కంపార్ట్‌మెంట్ కొంచెం నయమనిపిస్తే అందులో ఎడ్జస్ట్ అయిపోదామని వెళ్తున్నానండి".

మధుసూదనరావుగారు పక్కనున్నాయన

వైపు తిరిగి నవ్వాడు. "మన ఇండియన్ రైల్వేస్‌లో లేడీస్ కంపార్ట్‌మెంట్లు మూడు రకాలు వెయ్యాలనుకుంటానయ్యా రంగారావ్! లేడీస్‌కి, స్త్రీలకి, ఆడాళ్ళకి. ఏమంటావు ?"

పక్కనున్నాయన పకపక నవ్వాడు. పగలబడి నవ్వాడు. అదేపనిగా నవ్వాడు. ఆ నవ్వు చూసి మధుసూదనరావూ నవ్వాడు. రాజేశ్వరికి పిల్లీ ఎలకా సామ్యం గుర్తొచ్చింది.

"అయ్‌బాబోయ్ సంపీసేరండి. ఏటన్నారేటన్నారూ?" అని రంగారావు (సిగరెట్ కాలుస్తున్నది కాక రెండో) అరచెయ్యి విప్పి, ఒక్కొక్క వేలూ ముడుస్తూ-"లేడీసు, స్త్రీలు, ఆడోళ్లన్నా? ఇదంతా అన్యాయం సార్. క్లాస్ ట్రగుల్ అనగా వర్గపోరాటమును పురిగొల్పు చున్నారు సార్. రైల్వేవోళ్ళు ఎప్పుడో లెంపలోయించుకుని, బుద్ధి తెచ్చుకుని గాంధీ క్లాసూ, ఇందిరాగాంధీ క్లాసూ అని రెండే రెండు క్లాసు లెట్టేసేరు సార్. మరి ఇల్లీ అర్బన్ డెవలప్‌మెంటోళ్ళు సూసేరూ. అందల గూడా మీలాటోళ్లున్నట్టున్నారు. మనుసుల్ని హెచ్చైజీ వన్ను, ఎమ్మయిజీ టూ, యల్లయ్‌జీ, ఇయన్నీ సాలక ఇడబ్లు యస్సు-ఇలాగ అయిదు తరగతులుగా విభజించి వర్గవిభేదములను ప్రోత్సహించు చున్నారు సార్. ఇలాగైతే చచ్చిపోతాం సార్. అంచేత మరి లేడీస్ కంపార్ట్‌మెంట్లల్ల ఇన్ని విధములైన తేడా లెట్టకండి. అమ్మలెలిపోయి అందల ఎడ్జస్ట్ అయిపోతానంటంది కద. ఎల్నండి."

రాజేశ్వరి "వస్తానండి" అని నమస్కారం చేసింది మధుసూదనరావుకి.

"నో నో నో! ఆగు. అందులో ఏమవస్తపడతావు?" అని చేత్తో కూడా ఆపి "రంగారావ్ ! నేను పిలుస్తున్నా న్ని టి. టి. ఐ. మదన్ రాజుని సారిలా పిలు" అన్నాడు మధుసూదనరావు.

"ఎందుకు సార్ ఆడిప్పుడిక్కడికి ? ఏటి బొంబాయెల్లాలా, ఢిల్లీ యెల్లాలా ? ఇంతా జేసి రాయిమండ్రి, అంతేగదా! అమ్మలు ఇందులో కూర్చుంటాది. రాయిమండ్రి రాగానే మూటా ముల్లీ పట్టుకుని దిగిపోతాది. ఎలాగూ బండి బయలుదేరే ఏళకి మదన్‌రాజుగోడు కండక్టరు డ్యూటీమీద ఈ బోగీకే రావాలగదా. అప్పుడే సెప్పొచ్చు. ఇదుగో గురూ మనోళ్లు ఇలా గిలాగని. దాంతో ప్రాబ్లెము సాల్వు అయిపోద్ది. అంతేగాని ఆణ్నిప్పుడిక్కడికి పిల్దము, ఆడు మన కెవుళికి తెలీనట్టు రూల్సు మాట్లాడమూ ఏటిసార్, మీ శాదస్త్రం? రూల్సు మాట్లాడితే అడుంటాడా, ఆడి బాబుంటాడా వుద్యోగాలల్ల. చూదేకులోడి తివ్వాకి పత్తి గింజ లెగిరిపోయినట్టు సైడుకెలిపోరూ యూళ్ళందరూనూ?"

రాజేశ్వరి ఎదురుగా వున్న బోగీ చూసింది. ఫస్ట్‌క్లాసు.

"మీరు హైదరాబాదు వెడుతున్నారాండి?" అనిఅడిగింది మధుసూదనరావును ఆ రెండో అతను ఏం వ్యాఖ్యానాలు చేస్తాడో అని భయపడుతూనే.

"లోపలికెళ్లి కూర్చోమ్మా! 'ఎఫ్' అని రాసుంటుంది తలుపుమీద. అందులో కింద బెర్తులో నా సామానుంటుంది. అక్కడికి పోయి కూర్చో. కండక్టర్‌కి నేను చెప్తానులే".

"అదికాదండి సార్! నాది సెకండ్ క్లాస్ టిక్కెట్టుకదా"




గొల్లున నవ్వేడు రంగారావు "నయిమే నండోయ్! మనకంటే నయిమే అమ్మలు. ఏటి సదువుతున్నావమ్మా?" అని జవాబు కోసం కుతూహలం చూపించకుండా అయిపోతున్న సిగరెట్టును నోట్లో బంధించి చేతులు రెండిట్నీ కొత్త సిగరెట్టును పాకెట్‌లోంచి తీయడానికి ఉపయోగించి కొద్దిగా వంగి ఆ సిగరెట్టుతోనే దీన్ని అంటించాడు. "ఇంతోటి పెళ్ళికి రెండు కళ్ళక్కాటికెట్టుకో మంటావా అన్నదట యెనకటికెవతోను అలాగా రాయమండ్రెల్డానికొక్కడా టిక్కెట్టు కొనీసేవు. అదలాగుంచు. మరి అంకుల్‌గారిదేక్లాసనుకుంటున్నావు?"

"ఆయన్ది ఫస్టక్లాస్ టిక్కెట్టేమోనని"

"అది గక్కడే పప్పులో అడుగేస్సేవమ్మలూ! నువ్వెవరో నాకు తెల్దుకానమ్మలూ! నేనుమాత్రం సెప్పేస్తన్నాను. యెనకటికి మనోళ్ళు రంగూనెల్లే టప్పుడనేవోళ్ళు-కేవు కట్టనోడు అందరి కంటా ముందెల్లి ష్టీమర్లో కూకున్నాడటని. అద్దిగలాగ అంకుల్‌గారింకా అసలు టిక్కెట్టే కొనలేదు! అక్కడాడు బుకింగాఫీసులో రాయిమండ్రికి పస్టుక్లాసు టిక్కెట్లు స్టాకు లేవన్చెప్పి సౌత్ సెంట్రల్ రైల్వే జోనలాఫీస్ సికింద్రాబాద్‌తో ఫోన్లో మాట్లాడిగాని అంకుల్‌గారి టిక్కెట్సంగతి తేల్చనంటన్నాడు. ఫోర్ నాట్రిత్రి అన్చెప్పి ఒకాడా యవ్వారం సూస్తన్నాడులే. బండి కదిలేలోపుని ఆడు టిక్కెట్టో, ఓచరో తెసే తెచ్చినట్టు లేకపోతే మరంతే సంగతులు. అంకుల్‌గారు ఆన్ ఐ.జీ.యస్ అని ష్టాంపు గొట్టిన కవర్లాగ బండెక్కి కూకోడమే. మరంచేత అంకుల్‌గారికి లేని బయ్యెం నీకెందుకమ్మలూ? యెల్లి దర్జాగా కూర్చో. ఎక్కెక్కు!"

పెద్దవారు, రంగనాయకికి బాగా చనువున్నవారు అని ఆయన మొహం చూసి ఇవాళ వచ్చిన ఉత్తరంతోనూ, ఈయనతోనూ రంగనాయకే కనబడి నట్టయి అక్కణ్ణుంచి పారిపోవాలనిపించినా పారిపోలేకండా నిలబడుండక్కడి రాజేశ్వరి. ఈ రంగారావెవరో కాని పరమ సత్యాలనిపించే విషయాలు ప్రాణాలు తోడేసే భాషలో చెబుతున్నాడు. వేషం చూస్తే నేమో ఇస్త్రీ బట్టలూ, గాగుల్సు, అయిపోతున్న సిగరెట్టుతో విధిగా అంటించే తరవాతి సిగరెట్టూను.

చెయ్యవలసిన ప్రయాణం మరీ పెద్ద దూరం కాకపోయినా మరీ చిన్నదీ కాదు. రేపటి పరీక్షకి కావలసిన బలం అంతట్నీ రద్దీగా వున్న ఈ రైల్లో స్థలం సంపాదించే ప్రయత్నం హరించెయ్యకుండా, ఈ సెంకండ్ క్లాస్‌టిక్కెట్టుతో ఫస్టు క్లాసులో ప్రయాణం ఓవిధంగా మనసును ప్రలోభపెడుతోంది-సుఖంగా, ఖాళీగా కూర్చుని వెళ్ళొచ్చునని. చెయ్యబోయేది మహా ప్రయోజకుడైన పోలీస్ ఆఫీసర్‌తో ప్రయాణం. పట్టుకుంటారని భయంలేదు. 'అతగాడి' భాషలో చెప్పాలంటే "ఆళ్లు ఈన్ని పట్టుకునేదేటి, ఈనే ఆళ్ళని పిలకట్టుకుంటాడు. నా కొడకల్లారా, బెర్తు రిజర్వేషనుకి గవర్మెంటోళ్ళు పెట్టిన రుసుము ఐదు రూపాయలైతే మీకు ఎగస్త్రా పదిరూపాయలంట్రా అని!"

కాని, ఈ రంగారావు కూడా మధుసూదనరావుగారితో ప్రయాణం చేస్తే మాత్రం రాజమండ్రి దాకా అతనిమాటలు వింటూ కూర్చోవడం మానవసాధ్యం కాదు. అంతకంటే ఆ 'లేడీస్' కంపార్ట్‌మెంట్లో స్త్రీలూ ఆడవాళ్ళూ దారి పొడుగుతా

వాకర్నోకరు గిల్లుకునే మాటలు భరించ డమే సుఖవు.

"సార్, తమరేమీ అనుకోకపోతే ఆ టి.టి.ఐ. మదన కామరాజుగార్ని నేను పిల్చుకొస్తానుగానండీ ఎక్కడైనా సెకండ్‌క్లాస్ స్లీపర్ బోగీలో రాజమండ్రి దాకా నాకు కూర్చోడానికింత జాగా యిప్పించే ఏర్పాటు చేద్దురూ ?" అంది మధుసూదనరావుతో రాజేశ్వరి.

"ఏచేటి ? బలేగన్నా వమ్మలూ! మదన-కామ-రాజు" విరగబడి నవ్వాడు రంగారావు "అవును గురూగారూ! మదన్ రాజుగాడసలు పేరు అదే అయ్యుంటాది. అందుకే ఆడి లేపిల్ బిళ్ళమీద డి.కె.ఎం. రాజు అని రాయించుకున్నాడు. అసలు పేరు ప్రకారము డి.ఎం.కె. రాజు అని గాని రాయించుకుంటె ఈడెవడో మనోడ్రా అని తమిళ్నాడోళ్ళు లాక్కెళ్ళి పోతారని గావాల"

మధుసూదనరావు రంగారావు భుజం మీద చెయ్యేసి "పద. టీ తీసుకొని వద్దాం" అని లాక్కెళ్లాడు. కొద్దిదూరం వెళ్ళి వెనక్కి తిరిగి చూసి, "నువ్వు కూర్చోమ్మా. 'ఎఫ్'లో గుర్తుందిగా !" అని సాగిపోయాడు.

వాళ్ళుకొంచెం జనమరుగయ్యేదాకా అలాగే నిలబడి ఆ తరువాత బోగీలోకి ఎక్కింది రాజేశ్వరి. 'ఎఫ్' అనే కుపేలో నాలుగు బెర్తులూ ఖాళీగానే వున్నాయి. కింద బెర్తుల్లో ఇంజిన్ వైపున్న దానిమీద ఒక బ్రీఫ్ కేసు, ఒక జత పోలీసు (ఇనస్పెక్టర్)యూనిఫారం,టోపీ, లాఠీ ఉన్నాయి. బ్రీఫ్‌కేసు మీద గిల్టు అక్షరాలతో మధుసూదనరావు పేరూ, హోదా రాసి వున్నాయి. రంగారావనే అతను కేవలం సెండాఫ్ యివ్వడానికే వొచ్చినట్టున్నాడు గాని కూడా ప్రయాణం చేసేలా లేదు. కంపార్టుమెంటులో అతనిదంటూ ఒక్క వస్తువూ లేదు. పోనీ చేతిలో అంటే సిగరెట్టు పెట్టె తప్ప మరో సామాను (కనీసం అగ్గిపెట్టె) లేదు.

ఆ మాత్రం పరిశోధన చేసి తన సంచిని ఖాళీగా వున్న కింది బెర్త్‌మీద వుంచి మళ్లా ప్లాట్‌ఫారం మీదికి దిగి పోయింది రాజేశ్వరి.

"దయచేసి వినండి. వాల్తేరు నుండి హైదరాబాద్ పోవు గోదావరి ఎక్స్‌ప్రెస్ ఒకటవ నెంబరు ప్లాట్‌ఫారం నుండి రెండు నిముషములలో బయలుదేరును" అని ఆ సొట్టగొంతు అమ్మాయి లౌడ్‌గా చెప్పేసింది.

వాళ్ళిద్దరూ రాలేదు.

బండి బయల్దేరడానికి పచ్చ లైటు వెలిగించేరు. కండక్టర్ బోగీలో కెక్కిపోయాడు. గార్డు విజిల్ కూడా వేసేశాడు.

వాళ్ళిద్దరూ రానేలేదు.

రాజేశ్వరికి కంగారుతో ఒళ్లు వణక సాగింది.

నల్లకోటు, దానిమీద డి. కె. ఎం. రాజు అనే పేరుగల లేపిల్ బిళ్ళ తగిలించుకున్న కండక్టర్ కంపార్ట్‌మెంట్ గుమ్మం దగ్గిర నిలబడి, "ఎవరమ్మా రాజేశ్వరి అంటే ?" అని రాజేశ్వరినే అడిగాడు.

"నె...న్నే...నేనేనండి"

"పోలీస్ ఇనస్పెక్టర్ మధుసూదన్ రావుగారి తాలూకు మీరేనా? మిమ్మల్నిందులో కూర్చోపెట్టమని ఆయన చెప్పేరు. ఎక్కండి బండి కదిలిపోతోంది".

"వాళ్ళిద్దరూ ఏరండీ ?"

"రంగారావుగాడు రాడంలేదు. వాడు




ఇంటి కెళ్ళిపోయాడు. మధుసూదన్ రావుగారు 'ఎ' కుపేలో వున్నారు ఎవరితోనో మాట్లాడుతూ'' వినేమనిషి దగిరగానే వున్నా ఆందోళన కలగడానికి చేసేంతలా గట్టిగా మాట్లాడాడు.

"అమ్మయ్య!" అనుకుని ఎక్కింది రాజేశ్వరి. అప్పటికి బండి కదిలే పోయింది.

కండక్టర్ ఆమెని 'ఎఫ్' కుపేలోకి తీసికెళ్లి కూర్చోపెట్టాడు. టిక్కెట్టు గురించి మాట్లాడనే లేదు.

"తలుపేసుకుని లోపల బోల్టేసుకోండమ్మా. ఆయన రాజమండ్రిదాకా కూడా ఇక్కడికి రాకపోవచ్చు. మీరు సుఖంగా కూర్చున్నారని తెలిసేదాకా నన్ను బతకనియ్యడు"

అతనలా వెళ్లనిచ్చి తలుపు దగ్గిరిగా మూసి రెండో బెర్తు మీద కూర్చుంది రాజేశ్వరి. లైటు వేసుకుంది. కిటికీ అద్దం ఎత్తి, బైటికి చూసింది. రామ్మూర్తి పంతులు పేట గేటు దాటుతోందప్పుడే రైలు.

షార్ట్‌షాండ్ టెక్స్టు బుక్ తీసింది. బ్యాగ్‌లోంచి ఎందుకో. కొన్ని సౌండ్సు ఎప్పటికీ అనుమానంగానే వున్నట్టుంటాయి. రేపు వాళ్ళు ఎలాంటి పాసేజి డిక్టేట్ చేస్తారో, ఎంత స్పీడ్‌లో చెబుతారో? తనకి షార్ట్‌హాండ్ చెప్పిన మేడమ్ చక్కని ఉచ్చారణతో తగుమాత్రం స్పీడుతో ముద్దుగా చెప్పేది. లోయర్ పరీక్ష జరిపిన తిరుపతి యూనివర్శిటీ రిజిస్ట్రార్ పి. ఏ నిజానికి ఆవిడ తమ్ముడే అయినా, సరిగ్గా ఆవిడ సోదరుడిలాగే మిక్కిలి దయగా మెత్తగా జరిపేడు పరీక్ష. ఆరోజువరకు తను ఆ పరీక్ష పాసవుతాననే అనుకోలేదు.

పాసేజి ఎంచడంలో, డిక్టేట్ చెయ్యడంలో ప్రయివేటు కంపెనీల్లో మడు కెక్కువ, క్షమాపణ తక్కువ అని విన్నది తను.

ఈ ఉద్యోగానికి అప్లికేషను బావగారే పెట్టించారు కదా. ఆ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ ఆనందరావుగారు తనకి బాగా తెలుసునన్నారు కదా. ఇంటర్‌వ్యూకి రమ్మని కాగితం రానీ మిగతాది నేను చూసుకుంటా నన్నారు కదా. అదే ధైర్యం. కాని సరిగ్గా సమయానికి ఆయన తనతో రాజమండ్రి రావడానికి వీల్లేకండా కమిషనర్‌గారి క్యాంపు తగిలింది. అందులోనూ ఉన్నవూళ్ళో అయితే వాళ్ల డిప్యూటీ డైరెక్టర్‌గారు అన్నీ చూసుకునే వారు. విజయనగరంలో క్యాంపు వేసి అక్కడికి రమ్మని చెప్పేరుట.

బావగారు విజయనగరం క్యాంపువెళ్లి రాత్రి ఎనిమిది గంటలలోగా వచ్చేస్తానన్నారు. ఒక వేళ కమిషనర్‌గారితో పని ఇంకా వుండిపోతే రేపు ఉదయం మళ్లీ వెళ్తారటగాని అక్కడ రాత్రి వుండిపోయే ప్రసక్తిలేదని అన్నారు. ఇంట్లో తను లేక, ఆయన లేక పిల్లల్నీ, మంగమ్మత్తయ్యనీ వదిలేసి వెళ్లడం భద్రంకాదని ఆ నిర్ణయం తీసుకున్నారు.

రావడం రావడం విజయనగరం నించి ఆఫీసుకి వస్తానన్నారు బావగారు. ఆఫీసులో అయితే ఫోనుంటుంది. రాగానే ఆనందరావుగారికి ట్రంకాలో, ఎస్. టి. డి.నో చేసితను టెస్టుకిఇంటర్వ్యూకిహాజరవుతున్న విషయం చెబుతానన్నారు. ఒకవేళ తప్పనిసరి పరిస్థితుల్లో విజయనగరంలో రాత్రి ఆగిపోవలసే వస్తే అక్కణ్ణించే ఆనందరావుగారికి ట్రంకాల్ చేస్తానని ఖచ్చితంగా చెప్పారు. ఏమీ అధైర్యపడకండా టెస్టూ,

ఇంటర్వ్యూ కానివ్వమనీ, వెనకాల తను ఉన్నాననీ నమ్మకంగా చెప్పేరు.

తనని ఆఫీసునించి ఇంటికి తీసుకు రావడానికి స్కూటర్ తీసేరు బావగారు. విజయనగరం క్యాంపు ఉండడం, రాత్రి రావడం మరీ అంత ఖాయం కాకపోవడం ఈ కారణాల వల్ల స్కూటర్ ఆఫీసులో షెడ్లో వదిలెయ్యడం భద్రం కాదని అన్నారు. బావగారూ, తనూ ఆఫీసునించి బయల్దేరే వేళకి డ్రయివర్ జీపులో పెట్రోలు పోయించుకుని రావడం అవలేదు. కేష్‌క్లర్కు సుబ్బారావు వొచ్చి చెప్పాడు డ్రైవర్ మోహన్ రెడ్డి తన జీతం తీసుకున్నాడట. ఆ సొమ్ము తన ఇంట్లో ఇచ్చేకనే క్యాంపు రావడమని మోహన్‌రెడ్డి అన్నాడట. అలా కొంత సేపు తనవల్ల ఆలస్యం కావచ్చునని అందుకు డిప్యూటీ డైరెక్టర్‌గారి పర్మిషన్ కూడా తీసుకున్నాడట.

"నాతోనే చెప్పకూడదా? ఇలాగే చేస్తారు వీళ్లు! పొద్దుట రోజీ సెలవు కాగితం ఆయనకి సరాసరి పట్టుకెళ్లి ఇవ్వడం, ఇప్పుడు మోహన్‌రెడ్డి ఉత్త పర్మిషన్ కోసం ఆయన్ని అడగడం అక్కడికి నేనేదో యమధర్మరాజు నన్నట్టూ, ఆయనగారే కరుణామయుడైనట్టూనూ!'' అని విసుక్కున్నారు. "సర్లే ఇదీ ఒకందుకు మంచిదే. విజయనగరం ఎ. డి. కృష్ణమూర్తి గతసారి ఇక్కడికి వొచ్చినప్పుడు మర్చిపోయిన స్వెట్టరూ, మఫ్లరూ ఇక్కడుండిపోయాయి. అవి నేనింటి దగ్గిర జాగర్తపెట్టేను. మనం ఈ లోపుగా ఇల్లుచేరి ఆ రెండూ పికప్ చెయ్యొచ్చు"

ఆఫీసురూం లోంచి ఇవతలికొచ్చేటప్ప టికి ఒంటిగంటా ఇరవై నిమిషాలైంది-

"రూమ్‌కి తాళం వేసెయ్యమంటారా సార్?" అని అడిగాడు ప్యూన్ అప్పన్న.

"ఎందుకు? కమలగారు కూర్చుంటారు కదా" అన్నారు బావగారు.

"సార్...నేను!" అని కమల నవ్వకుండా ఏదో అభ్యర్థన చేసింది.

"ఎస్ ఎస్! నేను మర్చేపోయాను. ఓకే వెళ్లండి వెళ్లండి!" అని హ్యాండ్ బ్యాగ్ తెరిచి "కొంచెం కూడా ముందుగా తెలియలేదు. అంచేత వస్తురూపంగా యివ్వలేకపోతున్నాను. బాబుకి ఏదైనా కొనిపెట్టండి!" అని ఇరవై రూపాయల నోటు ఆమెకి ఇవ్వజూపారు బావగారు,



"ఐ విష్ హిమ్ ఎ హండ్రెడ్ హాపీ రిటన్స్ అఫ్ ది డే!"

కమల మొహం ఎర్రగా కంది పోయింది "సారీసార్! ఇవాళ వాడి పుట్టిన రోజని చెప్పడం ఆఫీసునించి కొంచెం త్వరగా యింటికి వెళ్లడం గురించే చెప్పానుగాని కానుక ఆశించి కాదు" అంది మర్యాదగా అయినా తీవ్రంగానే.

ఆ యిరవై రూపాయల నోటును ఆయన అలా చెయ్యి జాపి పట్టుకునే వున్నారు. ఎక్కడ తీసుకోవలసి వస్తుందో అన్నట్టు ఆమె పక్కకి తిరిగిపోయింది.

బావగారు తన వేపు ఒక అడుగువేసి "చూడు రాజీ!ఆవిడ ఎంత ఆత్మాభిమానం చూపిస్తున్నారో! కాని ఇందులో తప్పేం వుంది?" అని ఆ నోటును తన చేతి కిచ్చాడు. 'నువ్వియ్యి' అని సంజ్ఞ చేశాడు.

తను అందుకుంది నోటూ ,మాటానూ. "కమలగారూ! బావగారు నిండు మనసుతో పిల్లాడికోసం యిస్తున్నారు. ఫరవాలేదు తీసుకోండి. మీరు మా యింటి కెప్పుడేనా రాకపోరు. ఆ మాత్రం కానుక యివ్వ లేకాపోరు. ఎందుకు? ఈ నెల పదిహేడో తారీఖుని బావగారి పాప పుట్టినరోజు! ఆవేళ మీరొచ్చి పాపని ఆశీర్వదిస్తే బావ గారు మాత్రం సంతోషించరూ?" అని భుజంమీద చెయ్యివేసి వాలెట్ తెరిచి అందులో తురిమిందా నోటును.

కమల కళ్ళమ్మట రెండు బొట్లు కన్నీళ్లు రాలేయి.

"పిల్లాడి వూసురాగానే మొగుడు జ్ఞాపకం వచ్చుంటాడు. పాపం" అన్నారు బావగారు తనతో స్కూటర్ షెడ్లోంచి తీస్తూ.

బావగారు అప్పట్నుంచీ ఆమె గురించే ఆలోచిస్తున్నారని గ్రహించి తను చాలా ఆశ్చర్యపడింది.

"అవును బావగారూ! పాపం విరగ పూసిన సంపెంగ మొక్కలాగ పసిమితో ఘుమఘుమతో వుంది. ఇంత చిన్న వయ సులో ఆవిడికి ఖర్మేమిటో?"

"ఎంత అందంగా వుందో చూసే వుగా! అంతకంటె ఎఫిషెంట్ వర్కరు. ఎంత ఎఫిషెంటో అంతకన్నా ఆత్మా భిమానం వున్న మనిషి . అంతకి మించిన మితభాషి. పబ్లిక్ ఆఫీసుల్లో పనిచేసే అందమైన ఆడవాళ్ళని అన్ని రకాల మగాళ్లు కొరుక్కుతినేటట్టు చూస్తారు. మూడు నెలల్నుంచి చూస్తున్నాను! ఒక్క రితో కూడా మాట్లాడలేదావిడ..." అలా చెప్పుకుపోయారు బావగారు.

'ఆఫీసుకి రావడమే బావగారి రూంలో కొచ్చేస్తుంది కాబోలు. ఆయనదగ్గిరే వేసే రుగా! ఇంకెవరితో అయినా మాట్లాడ్డానికి అవకాశం వుండదు, అవసరం వుండదు! ఆయన స్వంత స్టెనోగ్రాఫరాయె' అను కుంది తను. "నయమేలెండి. జనరల్ టైపింగ్ సెక్షన్లో పారేసుంటే చచ్చుం డేది" అంది.

"నాకెందుకోగాని రాజీ! ఆ అమ్మాయిని చూస్తే మనసంతా జాలితో నిండిపోతుంది" అని స్కూటర్ స్టార్ట్ చేసేరు బావగారు.

తలుపు మీద వేళ్ళ టకటక.

"ఎక్స్‌క్యూజ్‌మీ" అంటూ లోపలికి వొచ్చేడు మధుసూదన్ రావు. రాజేశ్వరి లేచి నిలబడింది. "కూర్చో అమ్మలూ, కూర్చో!" అని ఆమెకి చేత్తోకూడా చెప్పి ఆయన తన సీట్లో కూచ్చున్నాడు. రాజేశ్వరి వైపు చూడకుండా. బ్రీఫ్‌కేసు తెరిచాడు. "ఈ కుపే అంతా అంటే నాలుగు బెర్తులూ అన్నమాట. వాల్తేరు నుంచి హైదరాబాదుకి రిజర్వ్ చేసుకున్నా





రెవరో. కాని వాళ్ళకి ఈ ఉదయం రాజమండ్రిలో ఏదో అర్జంటు పని తగిలి వెళ్ళిపోయారు. అంచేత వాళ్ళు రాజమండ్రిలోనే యెక్కుతారు. అంతవరకూ ఎవ్వరూ యిందులో ఎక్కరు. తెల్సిందా! అంచేత నువ్వు కావాలంటే హాయిగా విశ్రాంతి తీసుకోవచ్చు. నేను మళ్ళా అటు వెళ్ళిపోతాను. అక్కడ 'బి' లేదా 'ఎ' కుపేలో కొందరు ఫ్రెండ్సున్నారు. పేకలు తెచ్చేరు వాళ్లు. రమ్మీ ఆడుతున్నాం. అప్పుడే పై జేబులో వున్నదంతా పోగొట్టుకున్నాను. అది మళ్ళా తెచ్చేసుకోవాలి" అని చిరునవ్వు నవ్వుతూ, బ్రీఫ్ కేసులోంచి పర్స్ తీసుకున్నాడు.

అలా చూస్తూ, వింటూ నిలబడే వుండిపోయింది రాజేశ్వరి.

"ఓకే! పస్తాను. తలుపు లోపల గడియ పెట్టేసుకో... కండక్టర్ మదన్ రాజుతో చెప్పాను. నువ్వు రాజమండ్రిలో దిగిపోతావని. నిన్నేం టిక్కెట్టూగట్రా చూపించమని అడగలేదుకదా!"

"లేదండీ!" అంది రాజేశ్వరి తడబాటుతో- అతనెంతో మంచివాడన్నట్టూ, అతనిమీద ఏ విధమైన కంప్లెయింటూ లేదన్నట్టూ ధ్వనించేలాగ.

"సామర్లకోటలో భోజనం వొస్తుంది. బహుశా నేనప్పటికి వొస్తాను. రాకపోయినా నీ భోజనం పూర్తిచేసెయ్యి. అక్కడ పది నిమిషాలకి పైగా ఆగుతుంది రైలు".

"నా...నాకేం వద్దండీ" అంది రాజేశ్వరి గాభరాగా చెయ్యి ఆడించి.

"ఊరుకో, ఊరుకో!" అని లేచి వెళ్ళిపోయాడతను.

హటాత్తుగా ఓ సంగతి స్ఫురించి రాజేశ్వరికి నీరసం వొచ్చి బెర్తుమీద చతికిల్లా పడిపోయింది...

అతను మాట్లాడినంతసేపూ తన బ్రీఫ్‌కేసులోకో, తలుపువైపో 'ఎఫ్' కుపేకీ, 'ఇ' కుపేకీ మధ్యనున్న గోడవైపో చూస్తూ మాట్లాడేడు. అంతేకాని, సరాసరి తన వైపు తిరిగీ, తన మొహం చూస్తూనూ ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

కాని, అతను కూర్చున్న బెర్తు ఇంజిన్ వేపు వుండడం చేత, గాలి ఇటేవస్తూ ఏదో ఓ వింత వాసన మోసుకొచ్చినట్టయింది. రాజేశ్వరి అంతసేపూ కిటికీ దగ్గిర బావగారి గురించీ, కమలని గురించీ ఆలోచిస్తున్నదల్లా అతను లోపలికొచ్చేసరికి లేచి నిలబడ్డంలో, స్వల్పంగావున్న ఆ వాసన పల్చగా అయినాసరే కుపే అంతా వ్యాపించింది.

అది ఏదో తాగుడు వాసన అన్న సంగతి అతను మళ్ళా 'కుపే'లోంచి వెళ్ళిపోయేదాకా తట్టలేదు రాజేశ్వరికి.

తట్టగానే కొన్ని క్షణాలేమీ తోచలేదు. ఒళ్ళంతా వణుకు ప్రారంభమైంది.

ఈయనగారు మొదటే పోలీసాఫీసరు. అందులో విలాస పురుషుడు ఆపైన ప్రస్తుతం గుర్రం ఎక్కి వున్నాడు. అదిగాక రాజమండ్రి వరకూ 'కుపే' అంతా అతనిదే. దానికి తోడు అతనేం చేసినా చిత్తం సార్ అని చెప్పగలిగే కండక్టర్... ఏదో సామెత జ్ఞాపకం వచ్చింది. 'కుపే'లో వుండడానికి మనస్కరించలేదు.

లేచి వెళ్ళి కారిడార్‌లో చూసింది.

ఏ 'కుపే'లో వాళ్లు ఆ 'కుపే'లో చక్కగా తలుపులు బిగించుకుని ఉన్నారు. మెలకువగా ఉన్నారో, నిద్దర్లు పోతున్నారో తెలీదు. ఎవరి కార్యా

క్రమా ల్లో వాళ్ళున్నారు గాబోలు... అంతా నిశ్శబ్దం నిర్మానుష్యం.

సీట్లన్నీ నిండిపోయినా ఈ కంపార్టు మెంటులో పాతిక మంది కన్నా ఎక్కువ మంది ఉండేటట్టులేదు.

అక్కడేమో ప్రతి బెంచి మీద ఎనిమిదేసి మంది, రెండు బెంచిల మధ్య పదేసి మంది, సామాన్లు పెట్టుకునే చోట్ల అయిదేసి మంది, కారిడార్‌లో పందమంది, నాలుగు తలుపుల దగ్గిరా నలభై మంది, మెట్ల మీద గజాలు పట్టుకు వేళ్ళాడుతూ కొందరూనా! ఇక్కడేమో యిలాగా!

కారిడార్‌లోంచి వొదిగి వొదిగి నడుచుకుంటూ టాయిలెట్‌లోకి వెళ్ళింది రాజేశ్వరి.

'ఎ' "కుపేలోంచి కొంచెం బిగ్గరగానే వినిపిస్తున్నాయి. మాటలు. తలుపు మరీ పూర్తిగా మూసి లేదు. అయినా అటు చూడాలని ధైర్యం చాల్లేదు. కాని ఇట్నుంచి అటు వెళ్ళినపుడు తలుపుచివర ఆ సన్నటి సందు దగ్గిర ఆగిందా లేదా అన్నంత తక్కువ సేపు ఆగి, లోపలికి చూసింది. ముత్తం అయిదుగురున్నారు. అంతా మొగాళ్ళే. ఈ బెర్త్‌కీ, ఆ బెర్త్‌కీ మధ్య పెట్టెలు ఎత్తుగా పేర్చి దాని మీద దుప్పటి పరిచి పేకాడుతున్నారు. సరిగ్గా ఆ సమయానికి ఒకాయన గ్లాసెత్తి తాగుతున్నాడు. ఎదురుగా కిటికీల దగ్గిర అమర్చిన బల్ల మీద గ్లాసులూ, సీసా......

రాజేశ్వరికి మరోసారి గుండె గతుక్కుమంది.

'ఎఫ్' బెర్తు వరకు చక చకా నడిచొచ్చింది.

లోపలి కెళ్ళబోయిందల్లా టక్కున ఆగింది. గుండె మరింత జోరుగా కొట్టుకుంది.

లోపల కండక్టర్ మదన్ రాజున్నాడు!.

రాజేశ్వరిని చూడగానే అతను-"సారీ! మీరెక్కడి కెళ్ళేరు? గాలికి కాబోలు, ఇవిగో కాయితాలు ఎగిరొచ్చి కారిడార్లో పడితే ఏరి ఇదుగో ఇక్కడ పెట్టేను" అన్నాడు

"షార్ట్‌హాండ్ పుస్తకంలో పెట్టుకున్న కాగితాలవి. కాని ఎగిరి పోడానికి సావకాశం లేదే!" అనుకుంది రాజేశ్వరి. లోపలికి అడుగువెయ్యకుండా కారిడార్లోనే నిలబడిపోయింది.

"లోపలికెళ్ళి తలుపేసుకోండి" అంటూ అతను యివతలికొచ్చేడు. "ఇదుగో, తునిస్టేషన్ వచ్చేస్తోంది. మీకు కాఫీ కావాలా, కూల్ డ్రింకా?"

రాజేశ్వరి లోపలికెళ్ళిపోతూ, "థాంక్సండీ, నాకేం అక్కర్లేదు" అంది. వంతెన మీదికి కంపార్ట్‌మెంటు అప్పుడే రావడంవల్ల ఆ మాట అతనికి వినపడే వుండదు... రాజేశ్వరి తలుపు దగ్గిరి సావేసి, బోల్టు బిగించింది.

ఒక్క క్షణం అలా నిలబడి అంతలోనే నీర్సవొచ్చి, తనింత సేపటివరకూ కూర్చున్న బెర్తు మీద చతికిలబడింది.

'వీళ్ళెవరూ నన్నేమీ చెయ్యరుకద, భగవంతుడా!... వెతికి వెతికి ఇందులో కొచ్చిపడ్డానేమిటి నేను? ప్రయాణం సుఖంగా సాగుతుందన్న ప్రలోభంచేత యెంత తెలివితక్కువ పని చేసేను!' అని విచారిస్తూవుండగా రైలాగింది.

తలుపు బిగించేసుకదా అన్న ధైర్యం వున్నా ఏమో, నా కర్మం ఎలాకాలుందో అని భయపడుతూ గుండెలరచేతపట్టుకున్న రాజేశ్వరి తలుపుమీద టక టక




శబ్దంతో అదిరిపడింది.

"అమ్మాయిగారూ!"

కండక్టర్ మదన్‌రాజు కంఠం అది.

పయిట వొంటినిండా కప్పుకుని "ఎందుకండీ!" అంది తలుపు దగ్గిరగా వచ్చి.

"కాఫీ తెచ్చేను, తలుపుతియ్యండి"

ఏదో మొండిధైర్యం వొచ్చింది, అంతలోనే బండి ఆగివుంది. మరీ అంత రాత్రయిపోలేదు. తలుపు తీసింది బారుగా.

అతను చూడలేదు. తిన్నగా లోపలి కొచ్చి ఒక చేత్తో కప్పూసాసరూ ఒక చేత్తో బిస్కెట్ పాకెట్ కిటికీల దగ్గిర అమర్చివున్న బల్లమీద పెట్టాడు. వెంటనే యివతలికి వచ్చేశాడు.

"రైలిక్కడెంతోసేపాగదమ్మా. కప్పు ఖాళీచేసిచ్చెయ్యండి"

"నాకేం వద్దండీ" చిరునవ్వు నవ్వబోయింది. కాని కుదిరినట్టులేదు.

"మీరు కాఫీ అయినా పుచ్చుకోకపోతే మస్సూన్రావుగారు నన్ను బతకనియ్యరు" అన్నాడతను- కుడిచేత్తో నెత్తి కొట్టుకొని.

"అయితే డబ్బులు తీసుకోండి" అని వొంగి బెర్త్‌మీద వున్న బ్యాగ్ తెరవబోయింది.

"అమ్మబాబోయ్, అది మరింత అఫెన్సు!" అని అతను కంగారు పడిపోయి తలుపు దగ్గిరగా లాగేసి వెళ్ళిపోయాడు.

కాఫీతాగాలనేవుంది ఇందాకట్నుంచీనూ కడుపులో ఒకటే అలజడి తలనెప్పీనీ.

మళ్ళీ మొండిధైర్యం తెచ్చుకుని, బ్యాగ్‌లో వున్న టాబ్లెట్ మింగి, కాఫీ తాగేసింది రాజేశ్వరి.

ఏ సందులోంచో చూస్తున్నవాడిలాగ మదన్‌రాజు, కప్పు బల్లమీద పెట్టి పెట్టడంతో తలుపు తెరుచుకొని లోపలికొచ్చేడు. రాజేశ్వరి గబుక్కున లేచినిలబడింది. అతను "థాంక్స్!" అని ఆమె వైపు చూడనైనా చూడకుండా ఖాళీ కప్పు సాసరుతో సహా అందుకుని వెళ్ళిపోయాడు. కారిడార్లో అడుగు పెట్టగానే యిటు తిరిగి రెండో చేత్తో తలుపు మూస్తూ "లోపల బోల్టుపెట్టుకోండమ్మాయిగారూ!" అని వెళ్ళిపోయాడు.

"లాభంలేదు, ఇక్కడుంటే నాకేదో ప్రమాదం జరక్కతప్పదు. ఈ కండక్టర్ మదన్‌రాజుగాడు తనంతటతనై నాకేమీ ప్రమాదం తెచ్చిపెట్టకపోయినా ఆ నిప్పుతొక్కి కల్లు తాగిన కోతిని అడుపెట్టే శక్తి మాత్రం వీడికి లేదు!" అనుకుంది రాజేశ్వరి.

బట్టలూ సర్టిఫికేట్లూ పెట్టుకున్న సంచిలో షార్ట్‌హాండ్ పుస్తకం పెట్టేసింది. పైకి తొంగిచూస్తున్న కాగితాలు సర్దనైనా సర్దకుండాను హాండ్‌బ్యాగ్‌కూడా అందులోనే కూరేసింది.

వాడు కప్పూ,సాసరూ పట్టుకుని అటు వేపు వెళ్ళేడు. తను ఇటు వేపు నించి దిగిపోతేనో?

అవును, అలాగే చెయ్యాలి. అంతకన్నా దార్లేదు.

కుపేలో లైటార్పేసింది, తలుపు తెరిచింది. సంచితోసహా కారిడార్లో ఇటు వేపు గేటు దాకా పిల్లిలా అడుగులు వేస్తూ వొచ్చేసింది.

హాండిల్ పట్టుకుని నొక్కి తలుపు తెరుద్దామని ప్రయత్నించింది. తలుపు తెరపబడలేదు. "కిందో మీదో బోల్టులు

ఏడుస్తాయి గావున" అనుకుంటూ చూసింది.

దూరంగాఅయినా కఠోరంగా ఈల...

మీది బోల్టు వూడదీసింది. కిందిబోల్టు వూడదీద్దామని వంగింది...

రైలు బయల్దేరిన కుదుపుకి, ఇటు వేపున్న లేవటరీ గోడకి తగిలింది వొళ్ళు. దాంతోనే తన వొంటికి కేవలం చెక్క గోడ కాక మనిషి శరీరం యేదో తగిలి నట్టు కూడా అయింది.

అటు తిరిగింది రాజేశ్వరి.

మధుసూదనరావు !

"ఇదేంటి ? దిగిపోదామనా ? రాజమండ్రి వెలుతున్నానన్నావు కదా !" అన్నాడాయన.

"ప-ప-ప్పక్క పెట్లో కొంచెం ఖాళీ అయ్యుంటుందని.." అని గొణిగింది రాజేశ్వరి.

మధుసూదన్‌రావు చిరునవ్వునవ్వాడు.

"పద. బండి బయలుదేరింది. ఇక్కడెలాగూ నువ్వు దిగలేవు. నడు !" అని ఆమెను తప్పించుకునితలుపుచేరి పద్ధతిగా మీది బోల్టూ, కింది బోల్టూ మళ్ళా బిగించేడాయన.

వేలు చూపించి "పద కూర్చుందువుగాని !" అన్నాడు.

చేసేదిలేక రాజేశ్వరి కుపేలోకి నడిచింది. వెనకాలే వొచ్చి లైటు వెలిగించేడాయన.

'కుపే' తలుపు మూసి బోల్టుకూడా బిగించాడు.

రాజేశ్వరి కుప్పకూలిపోయింది. అతని కాళ్ళమీద సంచి జారిపోయి బెర్తు కిందికి పాకింది. హేండ్‌బ్యాగ్ ఇంకో పక్కకెళ్ళింది. "నన్ను...నేను..." అంది అంతే. ఆ తరవాత మాటరాలేదు, ఏడుపే వొచ్చింది.

"ఛీ,యేంటది? పిచ్చిపిల్లా, ఊరుకో!" అని అతను ఆమెని రెండు బుజాలూ పట్టుకుని లేవదీసి, ఇంతసేపూ ఆమె కూర్చున్న బెర్తుమీద కూర్చోబెట్టాడు.

"వాడేమైనా అన్నాడామ్మా ?" అని అడిగాడు, చిన్న పాపాయితో అన్నట్టు బుజగింపుగా.

ధారగా కన్నీళ్ళు

గొంతులో గురగుర

గుండెలో దిగులు-

రెండు చేతులూ జోడించింది రాజేశ్వరి. "బాబుగారూ ! ...రక్షిం...చండి ...తల్లీ ...తండ్రీ ...తోడూ ...నీడా ...యెవరూ...లేందాన్ని... నా బ్రతుకేదో...నాకు చాతనైనట్టు బతుకుతున్నాను...నన్ను చంపీకండి"

మధుసూదనరావు మాట్లాడలేదు. కళ్ళప్పగించి అలాచూస్తూ తన బెర్తుమీద కూర్చున్నాడు వెనక్కి ఛారబడి.

అలా అరనిమిషంపాటు ఊరుకొని హఠాత్తుగా ముందుకి వంగాడతను. కుడి చేతి వేలు గాల్లో ఆడిస్తూ అన్నాడు- "చెప్పు! వాడి తోలు వొలిచేస్తాను లంజాకొడుకు ! నిన్నేమయినా అన్నాడంటే మరి బతకడు వాడు! ఒరే వెధవా- నేనిక్కడ పేకాటలోచిక్కుపడిపోయున్నాను, ఆ పిల్ల వొక్కతే కూచునుంది. తుని స్టేషన్‌రాగానే యింత కాఫీ తెచ్చివ్వరా అన్నాను. నాకేటో తోచదని ఆ వెధవని పంపిస్తే ఒక్కదానివీ ఉన్నావుకదా అని నిన్నేటో అనేవుంటాడా గాడిద!...ఎన్ని గుండెలు వాడికి నీ ఒంటిమీద చెయ్యి వెయ్యడానికి? జైల్లో వుండవలసిన కుక్కవాణ్ణి ఆ కేసులోంచి బైటకిలాగి బతుకిచ్చి





ఉద్యోగంకూడా నిలబెట్టినందుకు ఆఖరికి నీ మీదనా వాడి జులుము? ఉండు. వాణ్ణి ఇప్పుడే ఈడ్చుకొచ్చి నీ కాళ్ళమీద పడేస్తాను!'' అని కోపంతో లేచాడతను.

తలుపుమీద చెయ్యిపెట్టి బోల్టు తెరవ బోతూవుండగా రాజేశ్వరి చటుక్కునలేచి అతని చెయ్యి పట్టుకొనిఆపింది. "ఒద్దు సార్, వొద్దు! అతను నన్నేం అనలేదు! అతను నన్నేం చేయలేదు!... పాపం నేనెంతో మొహమాటపడి వొద్దన్నా కూడా మీరు దెబ్బలాడతారని భయంతో కాఫీ తెచ్చిచ్చేరు. బిస్కెట్లు కూడా..."

మధుసూదన్‌రావు అలానిలబడివుండే "మరి నువ్వెందుకలా భయపడి దిగిపో బోయావు?" అని గట్టిగా అడిగాడు.

"నాకే ఏదో భయం వేసిందండీ. కంపార్టుమెంటులో అందరూ ఎవరి గొడవలో వాళ్ళున్నారు. అన్ని గదులూ తలుపులు వేసున్నాయి. ఒక్కదాన్నీ కూచోడానికి ఏదో భయంలాగ వేసిందండీ అంతే''

"అంతేనా!" అని కూర్చున్నాడు మధుసూదన్‌రావు. "ఏం భయంలేదమ్మా నేనున్నానుగా!... సరేనువ్వు నిశ్చింతగా కూర్చో. అవతల వాళ్ళందరూ నాకోసం చూస్తూవుంటారు! ... ఇంకో గేమ్‌కి ముక్కలు పంచిపెట్టేసి వుంటారుకూడాను విన్నింగ్‌లో ఉన్నాను, ఇప్పుడిక్కడ వుండిపోతే ఏడుస్తారు. కాసేపటిలో అన్న వరం, ఆ తర్వాత పిఠాపురం, సామర్లకోటాను. ఆ లోపల వాడిటు రాకుండా ఓ పెగ్గు మందుపోస్తో, రెండు ముతక జోకులువేస్తో వాణ్ని అక్కడ ఎరస్టు చేస్తాను. నువ్వు తలుపు లోపల బిగించు కొని కూర్చో, సామర్లకోటలో భోజనం చేద్దువుగాని. అప్పుడు నేనూ ఒచ్చేసి రాజమండ్రిదాకా ఇక్కడ కూర్చుంటాను. సరేనా?" అని జవాబుకోసం చూ... లేచి తలుపుతీసి బయటి కెళ్ళాడు మ... సూదన్‌రావు. "తలుపు వేసుకోమరి!" అన్నాడు అవతల్నించి.

రాజేశ్వరి లేచి తలుపుమూసి బోల్టు పెట్టింది.

బూట్ల శబ్దం అటు వెళ్ళింది.

* * * * *

సామర్లకోటలో భోజనాలొచ్చాయి.

రాజేశ్వరికిభయం పూర్తిగాపోయింది.

తన భోజనం కానిచ్చి, అనుభవం ఆసక్తి వున్న గృహిణిలా ప్లేట్లు రెండూ కలిపి ఓ మూలకి చేర్చి బల్ల, బెర్తులూ శుభ్రంచేసింది- అక్కడున్న న్యూస్ పేపరులో ఓ కాగితంతీసి.

భోజనాలు తెచ్చిన కుర్రాడు పళ్ళాలు, నీళ్ళసీసాలూ, డబ్బులు పట్టుకువెళ్ళాడు. వాడు పళ్ళేలతో వెళ్ళడానికి వీలుగా పూరిగా తెరచిన తలుపు అలా తెరిచేవుంది. మధుసూదన్‌రావు బ్రీఫ్ కేసుకి చారబడి అలా నిద్రలోకి జారు కున్నాడు.

బండి కడియం స్టేషన్‌దాటి కొంత సేపయ్యాక లేచాడు మధుసూదన్‌రావు. "నువ్వలా ఒక్కసారి కారిడార్‌లోకో, టాయిలెట్‌లోకో వెళ్ళమ్మా''అన్నాడు.

మూడు నిమిషాల్లో తలుపు తెరిచాడు.

పూర్తి యూనిఫాంలో వున్నాడతను ఇప్పుడు. ఇందాకటివరకూ వుండిన సివిల్ డ్రెస్సు బ్రీఫ్‌కేసులో పెట్టేసి నట్టున్నాడు.

"కూర్చోమ్మా" అని లాఠీతో ఎదటి బెర్తు చూపించాడు "ఏంటలా చూస్తు న్నావు?" అన్నాడు చిరునవ్వుతో.

''అదికాదండీ! వాల్తేరు స్టేషన్‌లో మీరు మామూలు బట్టల్లోవుంటే పోల్చనేలేక పోయానండి. ఇప్పుడు. " చిరునవ్వుతో ''యూనిఫాంలోనే నాకు బాగా గుర్తొస్తున్నారండీ''

అతను నవ్వాడు

ఈ ప్రయాణం ఇలా ప్రమాద రహితంగా కడతేరిపోతున్నందుకు మనసారా సంతోషించింది.

"ఊఁ ఏం పనిమీద వెడుతున్నావు రాజమండ్రి!"

చెప్పింది.

"గుడ్! నీకా ఉద్యోగంరావాలని నేను కోరుతున్నాను!" అన్నాడు మధుసూదన్ రావు చెయ్యి గాల్లోపెట్టిఆశీర్వదిస్తున్నట్టు.

"అయితే; నీకావుద్యోగం వస్తే యిప్పుడు వైజాగ్‌లో చేస్తున్న మెస్ పని మానేస్తావా?"

"మరేంది"

"ఊఁ మంచిదే ... రంగనాయకి నీగురించి అంతా చెప్పింది. నీ మంచితనం, ఆత్మగౌరవం, విశ్వాసం అవీనూ, మీ బావ గారెవరో మంచి పొజిషన్‌లో వున్నా ఆయనకీ, ఆయన భార్యకీ నీ మీద చాలా ఆపేక్ష కూడా వున్నా నువ్వు వాళ్ళ మీద ఆధార పడకుండా స్వతంత్రంగా బతుకుదామని ప్రయత్నించడం అవన్నీ చెప్పింది....... నీలాంటి పిల్లలంటే నాకెంతో సరదా... జీవితాన్నీ, అది తెచ్చి పెట్టే ప్రాబ్లంస్‌నీ ధైర్యంగా యెదుర్కో టం—ఈ దేశంలో ప్రతీ ఆడపిల్లా సాధించగలగాలి; అప్పుడే దేశం బాగుపడాలి... కానీ ఎంత మంది ప్రయత్నిస్తున్నారంటావు, అందుకు?...నో? నూటి కొక్కరు కూడా వుండరు!"

రాజేశ్వరికి ఆయన మాటలు విన్నాక మరింత ఆనందం కలిగింది.

"అంతా మా బావగారి చలవండి!" అంది మొహం నిండా సంతోషం కనబరుస్తూ రాజేశ్వరి, "ఆయన నన్ను చాలా అభిమానంతో, దయతో చూస్తారండి.



ఇప్పుడీ వుద్యోగానికి అప్లికేషను పెట్టిం చడమేకాదు నేనిన్నాళ్ళు చేస్తున్న మెస్ క్లార్క్ వుద్యోగం కూడా ఆయనే చూసి పెట్టేరండీ. అంతకు ముందు లేడీస్‌క్లబ్ ఎటెండెంటు పని కూడా ఆయన వేయిం చిందేనండి... పదోక్లాసు మధ్యలో ఆగి పోయిన నా చదువు కూడా అలా అలా కొనసాగించి నన్ను బి.ఏ. అనిపించే రండి. టైపు, షార్ట్‌హాండూ అన్నీ నేర్చు కునేదాకా వూరుకోలేదండాయన".

లెన్ల చీలిక వల్ల కలిగిన వింత ధ్వని వల్ల స్టేషన్ వచ్చేస్తోందని తెలిసింది రాజే శ్వరికి. 'రంగనాయకి స్టేషన్ కొచ్చుం టుంది. కనబడాలి; తనకి, నేనెక్కడు న్నదీనూ' అనుకొని; సంచి బెర్త్ మీదే వదిలి లేచి దగ్గర్లో వున్న గేటు చేరింది. బోల్టులు రెండూ వూడదీసి, తలుపు తెరచి గుమ్మానికడ్డంగా నిలబడింది. బండి ప్లాట్‌ఫారం చేరిన దగ్గర్నుంచీ తీక్షణంగా చూస్తూ, సరిగ్గా మధ్యని రంగనాయకి నిలబడి ఇటు చూస్తూ వుండడాన్ని గమ నించింది. "రంగా!" అని చిన్న కేక లాంటిది వేసి చెయ్యి వూపింది రాజీ

"చూశాన్లే'' అన్నట్లు తనూ చెయ్యి వూపి, ఆగిపోతున్న రైలులో తనకి అతి దగ్గరగానే ఆగిన ఆ ఫస్ట్‌క్లాస్ కంపార్టు మెంటు దగ్గరకి రాసాగింది రంగనాయకి.

మళ్ళీ 'కుపే'లోకెళ్ళి తన సంచి చేత బుచ్చుకొని "వస్తానండీ సార్! మీకు ఎన్నోయెన్నో థాంక్స్! నమస్కా రం!'' అంది రాజేశ్వరి. అతను చిరు నవ్వుతో టాటా చెప్పేడు. అంతలో రాజేశ్వరి, "అన్నట్టు నాకోసం రంగనా యకి స్టేషను కొచ్చిందండి. ఓసారి పలక రించరు? మీరెక్కడ దిగుతారండీ?'' అంది.

మధుసూదన్‌రావు చిరునవ్వుతో, తన బ్రీఫ్‌కేసు తీసుకొని లేచి నిలబడ్డాడు. లాఠీతో 'పద' అన్నట్టు సూచించాడు.

ముందు రాజేశ్వరి, వెనక మధుసూ దన్‌రావు కారిడార్లో రెండడుగులు వెయ్యి గానే "నమస్తే సార్!మరి నేనుంటానండి'' అని వెనక నించి వినిపించింది.

రాజేశ్వరి తల తిప్పి "థాంక్స్‌సార్, మీక్కూడా'' అంది.

ముందు రాజేశ్వరి, ఆమె వెనకే మధుసూదన్‌రావు... ఇద్దరిలోనూ ఫస్ట్ క్లాస్ బోగిలోంచి దిగుతూ వుంటే రంగ నాయకి తెల్లబోయి చూసింది. అంతలో చిరునవ్వుతో "ఇంతోటి ప్రయాణానికి పోలీస్ ఎస్కార్టు కావాలసొచ్చిందా మా తల్లీ?" అంది రాజీని కౌగలించుకుంటూ.

"వాట్ బేబీ బావున్నావా?" అని రంగనాయకిని శృంగారం, రాజకీయం మిళాయించిన నవ్వులతో పలకరించేడు మధుసూదన్‌రావు . రాజేశ్వరితో; "ఏమ్మా నీ కోసం రంగ స్టేషన్ కొస్తుం దని చెప్పేవే కాదు?" అన్నాడు.

"మీరు మాత్రం చెప్పారా,మీరూ రాజ మండ్రిలోనే దిగుతున్నట్లు?"అంది రాజీ, కళ్ళుచక్రాల్లా తిప్పుతూ, బోలెడు అంగికం చేస్తూనూ.

"మీ ఫ్రెండుని తునిస్టేషన్లో చూసి వుండవల్సింది, ఎంత హుషారుగా వుందో !'' అని లాఠీ రాజేశ్వరి వేపు చూపిస్తూ, రంగనాయకితో అన్నాడు మధుసూదన్‌రావు.

అతని నోటి మీదుగా వస్తున్న వాసనను గుప్తు పట్టింది రంగ. నవ్వకుండా అంది "మీరున్నారుగా, ఎంతలాంటి వాళ్ళు కూడా హుషారు తెచ్చుకొంటారు! నాకా




సంగతి ముందే తెలుసు!" అని రాజే శ్వరిని జెబ్బపట్టుకొని లాగి, "పోదాం పద రాజీ, అమ్మ చూస్తోంది. నాకూ ఆకలి దంచేస్తోంది!" అంది.

రంగనాయకి తన కోసం భోజనం సిద్ధం చేస్తుందని అప్పుడు స్ఫురించింది రాజేశ్వరికి. సామర్లకోటలో భోజనం చెయ్యకుండా వుండవలసింది అని నొచ్చుకుంది.

"ఇవాల్టికి సువాక్క దానిపీ భోంచెయ్యవలసిందే, ఆవిడ భోజనం అదీ అయింది?" అని దర్పంగా కళ్ళతో నవ్వుతూ అన్నాడు మధుసూదన్‌రావు.

"భోజనం-అదీనా?" అనుకుంది రంగ నాయకి; ఒక సారి తీవ్రంగా అతన్ని చూసి, మళ్ళీ యిటు తిరిగి ఛీత్కారం చేసి.

టకటక బూట్లుచప్పుడు చేసుకుంటూ ఇద్దరు పోలీసుజవాన్లు వచ్చి, అటెన్ షన్‌లో నిలబడి శెల్యూట్ చేసేరు మధు సూదన్‌రావుకి. "నమస్కారం సార్'' అన్నారు యుగళంగా.

లాఠీ చూపించేడు మధుసూదన్‌రావు 'పదండి' అన్నట్టు. అతని చేతిలో వున్న బ్రీఫ్ కేసుని టకాలున అందుకున్నాడో జవాను.

''ఊఁ కులాసాగా ఉన్నావా రంగ నాయకమ్మా? పల్లెటూరి గాలి బాగా వంట పట్టినట్టుంది. పాలూ, పెరుగు, వెన్న, నెయ్యి దిట్టంగా తగుల్తున్నట్టుంది. కొంచెం దుక్కతన్నేవు.''

''అంతేనా మీకు కనపడింది? మొహం చూడండెలా మెరిసిపోతోందోనూ?" అంది రాజీ మాట కలుపుతూ.

టిక్కట్లిచ్చేసే చోట తెల్లటి యూని ఫారం, నల్లటి ఛాఫర్ క్యాపూ ధరించిన ఒక వ్యక్తి కనపడ్డ ప్రతీ ఆడపిల్లనీ అడుగుతున్నాడు. రంగనాయకిని చూసి కూడా "రాజేశ్రీగారు తమరేనా అమ్మా?" అని అడిగాడు.

''నేను నేను!" అంది రాజీ తనటిక్కె ట్టిచ్చేసి ఇవతలపడి.

"వైజాగ్‌నించే కదండమ్మా?''

"ఔను!''

"నమస్కారం అమ్మా. నేను ఆనంద రావుగారి డ్రయివర్నండి. నాపేరు చెంద్రావండి. తమరొస్తారని వైజాగ్‌నించండి రాజారావుగారు మా అయ్యగారికి ఫోన్ చేసేరండి. కారొట్టుకొచ్చేనండి స్టేశను కండి."

రంగనాయకి, రాజేశ్వర్ని ఎదురుగా తిప్పుకుని గుండెబాదుకుని "అమ్మా! అమ్మా! ఎంత గడుగ్గాయవయ్యావోయ్!" అంది.

"అచ్చా! ఒక ప్రాబ్లెం సాల్వ్ ఐంది. నే వెళ్ళొస్తానైతే అమ్మలూ! విష్ యు ఆల్ ద బెస్ట్!" అని మధుసూదన్‌రావు తన బలగం వేపు కదిలాడు.

రాజీ రెండుచేతులతోనూ ఆయనకి నమస్కారం చేసింది.

చంద్రావు ముందు నడుస్తున్నాడు. రంగనాయకి రాజీ బుజంమీద చెయ్యేసి దగ్గిరగా నొక్కుకుని నడుస్తూ, చెవిలో నోరుపెట్టి "ఊఁ. చివరికి గురువుగారికి పడ్డావన్నమాట? ఎన్నాళ్ళయిందోయ్!" అంది.

రాజీకి ఒళ్ళంతా జలదరించింది. హటా త్తుగా ఆగిపోయి రంగనాయకి పట్టు వది లించుకుంటూ "ఛీ! అదేంకాదు!" అని పెద్ద కేకవేసింది. చుట్టూ జనం తలలు ఇటు తిప్పి చూడడంతో సిగ్గుపడి గొంతు తగ్గించి "వాల్తేర్ స్టేషన్‌లో నేనసలు ఆయన్ని గుర్తే పట్టలేదు! బండి చెడ్డ

రద్దీగావుంటే కండక్టర్‌తో చెప్పి ఆబోగీలో యెక్కించారు. ఆయన వేరేచోట పేకాటా అదీనూ..." అని మొదలెట్టి చెప్పుకుపో సాగింది, కారు దగ్గిరకి చేరేవరకూనూ.

రంగనాయకి అల్లరిగా నవ్వి "పోనీ లెద్దు అవన్నీనాకెందుకు? నువ్వు ఎలాగో ఓలాగ సుఖపడడమే నాకు కావలసింది!" అంది.

రాజీ కోప్పడబోయింది. అది మురి పెంగా మారాంగా గునుపుగా ఒచ్చిందే తప్ప కావలసిన ధోరణిరాలేదు. కారు చేరా రిద్దరూనూ. డ్రైవర్ కారువెనక తలుపు తెరిచిపట్టుకొని, "ఎక్కడికమ్మగారూ ఎళ్ళాలి?" అన్నాడు.

ముందు రంగనాయకి, ఆ తరవాత రాజీ ఎక్కారు. "ప్రకాశ్‌నగర్ పోనీ, పోలీస్‌స్టేషన్ దగ్గరికి!" అంది రంగ నాయకి.

రంగనాయకి బుజంమీద కొట్టింది రాజీ "పోలీస్‌స్టేషన్ కెందుకోయ్?"

''అబ్బ! నిన్నిపుడేమీ అరెస్టు చేయిం చనులేవోయ్. అసలు నువ్వు నీగొడవలో పడిపోయి అన్నీ మర్చిపోయినట్లున్నావు. మాయిల్లు పోలీస్‌స్టేషన్ దగ్గరేకదమ్మా తల్లీ!"



సాయంకాలం ఐదుగంటలు కావస్తుంది.

తన ఆఫీసుగదిలో కర్ర క్యాబిన్‌లో చిన్న అలికిడికావడంవల్ల అటు ఒకసారి చూశాడు రాజారావు. "వెళ్ళిపోతోంది" అనుకున్నాడు. చదువుతున్న ఫైలు మూసేసి, తాడుబిగించి టేబిలుమీద ఓ మూల పెట్టాడు.

కమల రాకముందు ఆ క్యాబిన్‌లేదు వెడల్పుగాఉన్న ఆగదిలో తను రీసెస్‌లో రెస్టుతీసుకోవడానికి ఒకపార్టిషన్‌మాత్రం వుండేది. మగస్టెనో అయితే పార్టిషనే కొనసాగేది. కాని కమలకనక కాబిన్ తప్పనిసరి అయింది.

"సార్..?" పర్మిషన్ అడిగేటంత నెమ్మదిగా కమల,

"ఎస్. మీరు వెళ్ళవచ్చు"

"అదికాదు సార్"

"చెప్పండి-"

"నా ఫైలు సార్.." అని టేబుల్‌మీద మూలకి చూపించి అడిగింది.

"సారీ! ఆలస్యం అవుతోంది ఏమను కోకండి. ఇవాళా రేపూ చూసి పంపి స్తాను."

''థాంక్స్ సార్! గుంటూరులో నాకు అన్యాయం జరిగిపోయింది సార్. మీరే ఏదో విధంగా నాకు సాయంచేయాలి సార్."

"అలాగే, అలాగే. కాని నాకు మరికొన్ని వివరాలుకావాలి. మీరు వ్యక్తిగతవివరాలు అనవచ్చు. కాని అవి చెప్పడంవల్ల నేను రాసే విధానం మారొచ్చేమోనని అనిపి స్తోంది. మీకు చెప్పాలనిపిస్తేనే చెప్పండి. లేకపోతే మీకు న్యాయం జరగడనికాదు చెప్పడమే న్యాయమని నా కనిపిస్తోంది. ఎందుకంటే ఇలాంటి దారుణమైన అన్యా యాలు, ఎవరో డిపార్టుమెంటుకి సంబం ధించిన వ్యక్తులే కావాలని కత్తిగట్టి పూనుకొని చేశారని నాకు తెలుసు.

అలాంటి వ్యక్తులన్నిచోట్లా ఉంటారు. కనుక మీ అధికారిగా కాకుండా, సాటి మానవుడుగా అడుగుతున్నాను.''

''థాంక్యు సార్'' అని చిరునవ్వు తెచ్చుకొని, అరచేత్తో వీడ్కోలు చెప్పి వెళ్ళిపోయింది కమల.

ఆ చిరునవ్వులో, ఆ థాంక్యు' లో "తప్పకుండా చెబుతాను అన్న వాగ్దానం లేదు, ''అవి వ్యక్తిగత వివరాలు. మీ కనవసరం" అన్న పెడసరం కూడాలేదు అని వ్యాఖ్యానించుకున్నాడు రాజారావు.

కమల యిక్కడ చేరిన కొత్తలోనే ఆమె గురించి వ్యక్తిగత వివరాలు తెలుసుకోవాలని కుతూహలం కలిగింది రాజారావుకి. కంటికి కనబడే వివరాలు మాత్రం సర్వీసు బుక్కులో వుంటాయి:—

జననం 1952 స్వస్థలం విశాఖపట్నం. ఉద్యోగంలో తొలిసారి చేరడం1971లో, ఈ డిపార్ట్‌మెంట్‌లోనే. కాకినాడ డి. డి. ఆఫీసులో టెంపరరీ ఖాళీలో క్లర్క్ కం టైపిస్టుగా. స్టెనోగా మార్పు 1972. అదే సంవత్సరం జూన్‌లోగుంటూరికి ట్రాన్స్‌ఫరు. నవంబర్ నుంచి మెటర్నిటీ లీవు. 1973 ఫిబ్రవరిలో డ్యూటీలో చేరి మళ్ళీ శెలవు. అలా 1974 ఏప్రిల్ వరకు. 1974 చివరలో ప్రొబేషను, డిక్లరేషను. 1972లో నాకు వివాహమైంది కనక ఇంటి పేరు మార్చమని అభ్యర్థన. 1973లో ఆ మార్పు. 1979 మే వరకు గుంటూరు. అక్కడ్నించి యిక్కడే. ఇవి కాక ఇతర డిక్లరేషన్లు. భర్త ప్రభుత్వోద్యోగి కాదు. ఒక్క కుమారుడు. చిదానంద్. అతని పేర ప్రావిడెంటుఫండు.

అందువల్ల ఏం తెలిసినట్టు?

కాకినాడ నుంచి గుంటూరు ట్రాన్స్‌ఫరు; గుంటూర్నించి విశాఖపట్నం ట్రాన్స్‌ఫరు-ఇవి ఈ డిపార్టుమెంట్‌లో ఈ స్థాయి ఉద్యోగులకు సాధారణంగా జరగనివి. పెళ్ళి, భర్తకి అక్కడ వుద్యోగంలాంటి ఎంతో బలమైన కారణాలున్నా, అంతకంటె పెద్ద రెకమెండేషనో మరోరకం వొత్తిడో వుంటే తప్ప జరగనివి. ఒక మండలం నుంచి ఇంకో మండలానికి ట్రాన్స్‌ఫరైతే ఉద్యోగం వూడదుగాని అంతకుముందున్న సీనియారిటీ పోతుంది- ఎన్నిసార్లు మండలేతరానికి వెడితే అన్నిసార్లునూ.

ఇప్పుడు కమల అడుగుతున్నవి న్యాయమైన కోర్కెలు అనడానికి మనిషిగా యెవరికీ అభ్యంతరం వుండకూడదు:- "నేను మొదట చేరింది క్లర్క్ కమ్ టైపిస్టుగా. నన్ను స్టెనోగా మార్చినప్పుడు నా అంతటనేను దరకాస్తు పెట్టకుండానే నా సామర్థ్యం డిపార్టుమెంటుకు అవసరమై అలామార్చారు కనక. క్లర్క్ కం టైపిస్టుగా నాకు రూల్స్ ప్రకారంఉండే మౌలికమైన హక్కులు పోకూడదు, పైన చెప్పిన ప్రకారం; మరియు నేను యల్.డి.సి.నుంచి యు.డి.సి ప్రమోషన్‌కి కావలసిన అర్హతలు 1974 నాటికే పొంది వున్నాను కనక. యు.డి.సి. ప్రమోషన్‌కి మండలాల మధ్య విభేదాలు లేవు గనుక 1974 డిశంబర్‌నుంచి నాకు యు.డి.సిగా ప్రమోషను అమలు పరచి సీనియారిటీ ఇప్పించవలసిందిగా కోరుతున్నాను."

ఈ అర్జీ ఇవాళ కొత్తగా పెట్టింది కాదు. గుంటూరులో రెండేళ్ళకిందట దాఖలు చేసినదీ, రెండేసి నెలలకోసారి హైదరాబాదుకు జ్ఞాపకానికి తెస్తున్నదీనీ.

దీని మీద, అసలు ఈ కాగితం గుంటూరు ఆఫీసు వాళ్ళే రాయాలని

క్లర్కు రాసేడు. ఈమె ప్రొబేషన్ తీర్మానంలోనే తప్పువుంది కనక కేసు సమగ్ర పరిశీలనకి చేపట్టాలని సూపరింటెండెంటూ రాసి రాజారావుకు పంపారు.

ఇవన్నీ అలావుండగా:—

"నాకు 1972లో ఒక నిరుద్యోగితో వివాహమైంది. ఆయన 1973 లో పోయారు. మా తండ్రిగారు అంతకుముందే పోయారు. నేను విధవను., అనాధను. తల్లిని, విధిచేతుల్లో మోసపోయాను. కనక అర్హతలు ప్రాతిపదికగా పెట్టుకున్న పై న్యాయమైన కోర్కెకై అర్జీని సానుభూతితో పరిశీలించి, నేను సుఖంగా, బలంగా జీవించడానికీ, నాకీ ప్రపంచంలో మిగిలిన ఒకే ఒక బంధమైన నా కుమారుణ్ణి సక్రమమైన విధానంలో పెంచుకోడానికీ, అన్యాయం జరిగిందన్న వేదన నా సామర్థ్యాన్ని దెబ్బతీయకుండా వుండడానికీ వీలుగా; పై చెప్పిన విధంగా నాకు యు.డి.సి.గా ప్రమోషన్ యిప్పించగోరుతున్నాను" అని ఆమేరాసిన పేర్గాగాపు మానవత్వంవున్న ఎవరికైనా న్యాయమని తోస్తుంది.

విధవ—

అనాధ—

తల్లి—

అవన్నీ అలా వుండగా వయసు, అందం, ఇంటా బయటా అనుభవం యిచ్చిన సామర్థ్యం అన్నీ సముద్రంలో వానజల్లుల్లా, అడవిలో వెన్నెల్లా వృధా కాకుండా చూసే నైతిక బాధ్యత డిపార్టుమెంటుకి—అంటే దాని ప్రతినిధులుగా, ఆ నియమాల పాలకులుగా వున్న వ్యక్తులకి ఉండాలికదా.

కొడిగట్టి ఆరిపోతున్న ఈ దీపం వొత్తిని కొంచెం సరిచేసి మళ్ళీ వెలుగులు చిమ్మేటట్టుగా చేసే పూచీ ఎవరికీ లేదా? వయసులో వుందనీ, అందంగావుందనీ, విధవ అనీ ఆమె శరీరాన్ని కోరి, ఆ కోరిక తీరే మార్గం లేకనో, ఆ కోరిక తీరిస్తేగాని నీ పన్లు జరగవని బెదిరిస్తూనో యిలాంటి అన్యాయాలకు తలపడ్తారు, ఆఫీసుల్లో పనిచేసే కొందరు దానవులు.

ఎంతగా— ఎవరికివారే యమునాతీరే అన్న సూత్రం మీద నడిచిపోతున్నా, ఎవరిమట్టుకువారే వృద్ధిలోకి రావడానికి పరుగులు పెడుతున్నా, అందరం ఒక సమాజంలో, కొందరం ఒక శాఖలో సహజీవనం చెయ్యడం లేదా ?

ఇందులో అధికారిగా తన ధర్మం ఎంత?

వ్యక్తిగా తన బాధ్యత ఎంత ?

భర్తను పోగొట్టుకొన్న స్త్రీ, అయిన ఆమె పట్ల భార్యను పోగొట్టుకొన్న పురుషుడిగా,

ఒక కొడుకును సక్రమమైన విధానంలో పెంచవలసిన తల్లి అయిన ఆమె పట్ల ఇద్దరు బిడ్డలను సక్రమమైన విధానంలో వృద్ధి లోకి తీసుకురావలసిన తండ్రిగా —

సానుభూతి

సహానుభూతి

నాకుండాలేమో ?

నాకే ఉండాలేమో ?— అనుకున్నాడు రాజారావు.

* * *

ఆ ఫైలు, ఫండమెంటల్ రూల్స్, సబ్సిడరీ రూల్స్ అనే పుస్తకాలు వాటి అనుబంధాలుగా వచ్చిన గవర్నమెంటు ఆర్డర్ల స్టాక్ ఫైలు తీసుకుని ఇంటికి బయల్దేరాడు రాజారావు.

కె. జి. హాస్పిటల్ అప్ ఎక్కి, మళ్ళీ సమతలంగా వున్న రోడ్డు గడిచి బస్‌స్టాప్ దగ్గిర కొచ్చేసరికి రోడ్డుకు అవతలివైపున కొడుకు నెత్తుకుని తన కభిముఖ దిశలో వస్తున్న కమల కనపడింది.

రాజారావుకి ఆ జంక్షనులో కిళ్లీలు కట్టించుకోడం అలవాటు. అందుకని స్కూటర్ ఆపాడు. కమల స్కూటర్ తన గురించి ఆపారేమో నన్నట్టు తను ఎక్కడున్నది అక్కడ ఆగిపోయింది. ఆమె నిలబడ్డం చూడ్డం చూసి, తనకేదో చెప్పాలని ఆమె నిలబడిందని రాజారావు అనుకున్నాడు. రోడ్డు క్రాస్‌చేసి ఆమెకు దగ్గరగా వెళ్ళాడు.

"మీ అబ్బాయా?''

"యస్సార్"

రాజారావు నవ్వాడు "యస్సార్ ఏమిటండీ బాబూ, ఏదో ఆఫీసులో అన్నట్టు? అవునండీ అంటే సరిపోను.''

"ఫోర్స్ ఆఫ్ హాబిట్ సార్''

"రండి కొంచెం కాఫీ తీసుకుందాం'' అని రోడ్డు దాటాడు. కాదనకండా వెనకాలే వచ్చింది కమల.

వెనక్కి తిరిగి దృష్టి కుర్రాడి మీదికి మార్చాడు రాజారావు. యూనిఫాం చూసి "శారదా బాల విహారా?'' అని వాణ్ణే అడిగాడు.

వాడు తల నిలువుగా ఆడించాడు.

"వాట్ క్లాస్?''

"సెకండ్" అని ముద్దుగా చెప్పేడు. కాని కళ్లు పెద్దవి చేసి తీక్షణంగా చూసి చెప్పాడు. ''ఎవడ్రా నువ్వు నన్నిది వన్నీ అడగడానికి'' అన్న ధోరణిలో.

"గుడీవినింగ్ చెప్పకుండా మాట్లాడొచ్చా చిదా?'' అని అతి స్వల్పమైన మందలింపుతో అడిగింది వాణ్ణి కమల.

"వీడికి నేను గుడీవినింగ్ చెప్పను!" అన్నట్టుగానో, "నిజమే గుడీవినింగ్ చెప్పకండా మాట్లాడకూడదు'' అనో తెలియకండా తల అడ్డంగా ఆడించాడు చిదానంద్.

"నెవర్ మైండ్. సో సెకండ్‌లో 'రత్న' తెలుసా? జి. రత్న!'' రాజారావు అడిగాడు.

"నో-" అని తెలుసునన్నట్టు తల వూపాడు

"అలాంటప్పుడు నో అనకూడదు. ఐ నో అనాలి తెల్సిందా?''

''నో-'' అన్నాడు వాడు, ఈ మాటు కూడా తెలుసన్నట్టే తలవూపి.

"ఐనో అన్నదానికి వాడు నో అనే అంటాడు సార్" అంది కమల ''ప్రారంభంలో ఐ అనలేడు వెధవ''

"ఐనో-దినకర్రావని మన డిపార్ట్‌మెంట్‌లోనే రాజమండ్రిలో అసిస్టెంటు డైరెక్టర్ ఉండేవాడు అతనూ అలాగే అనేవాడు." అని నిండుగా నవ్వేడు రాజారావు "నా చేతుల్లోకి రా!" అన్నట్టుగా చేతులు రెండూ వాడిమీదికి జాపాడు. కుడిభుజం మీద ఉన్న పుస్తకాల సంచి కమల కిచ్చేసి వాడు రాజారావు చేతికి వచ్చేశాడు.

"గుడ్‌బాయ్'' అని రాజారావు వాడితో సహా పక్కనున్న హోటల్ మెట్లెక్కాడు.

కమల ఎక్కడి మనిషి అక్కడే వుండిపోయింది.

"రండి!" అని మీది మెట్టుమీంచి మళ్ళా పిల్చాడు రాజారావు కుర్రాణ్ణి అక్కడ దింపి. వేలు అందించి నడిపిస్తూ లోపలికి, ఇంకా లోపలికి ఫ్యామిలీ రూంకి దారితీశాడు. నాలుగు కుర్చీలూ ఖాళీగా వున్న ఓ టేబిల్ దగ్గిర చేరాడు. కుర్రాణ్ణి

తన పక్కన కూర్చోబెట్టాడు. వాడు అక్కడ అన్నట్టు టేబిల్ మీదికి చూపించాడు. "నో ఇట్స్ దర్టీ దేర్" అన్నాడు రాజారావు. వాడు వినిపించుకోకుండా బూట్లతో ఉన్న కాళ్ళు రాజారావు వైపు వేళ్ళాడేసి టేబిల్ ఎక్కి కూర్చున్నాడు.

"తప్పు!" అని వాణ్ణి కోపంతో కొట్టింది కమల.

వాడు ఏడవలేదు. "మమ్మీ వైఆర్యూ క్రయింగ్?" అన్నాడు.

కమల అంత వరకు ఏడిచిందో లేదో చూడలేదు రాజారావు. కాని వాడా మాట అనగానే అరచేతుల్లో మొహం పెట్టుకొని వెక్కి వెక్కి ఏడవ సాగింది.

రాజారావు నిర్ఘాంతపడి చూశాడటు.

కుర్రాడు ఇటు కాళ్ళు అటుమార్చి, ఆ సందట్లో రాజారావు బుజాన్ని తన్నేసి "మమ్మీ లెట్స్ గో. హి ఈజ్ బ్యాడ్. ఈజంట్ హి బ్యాడ్?" అంటూ కమల చేతుల్ని ఆమె మొహం మీది నుంచి తప్పించే ప్రయత్నం సాగించాడు.

రాజారావు కేమీ అర్థం కాలేదు.

* * *

అయిదు నిమిషాల్లో తేరుకుంది కమల.

"నేను పోతాను. క్షమించండి" అని చటుక్కున లేచింది. కుర్రాడి కోసం చేతులు చాపింది.



రాజారావు కూడా లేచాడు. "నే చెప్పేది వినండి. కొద్దిగా కాఫీ తాగండి. మీ క్కాం ం చె ం ర్రిఫ్రెష్ మెంటు అవసరం" అని చనువు తెచ్చుకుని ఆమె భుజం మీద చెయ్యివేసి కూర్చోపెట్టే ప్రయత్నం చేసేడు. ప్రతిఘటించడంకన్నా భరించడమే సుఖం అని తెలిసిందాన్లా కూర్చుంది కమల. కుర్చీమీద నిలబడ్డ చిదానంద్ కూడా అమ్మ కూర్చుంది కదా అని తనూకూర్చున్నాడు వాడికి నచ్చిన పద్ధతిలో అంటే టేబిల్ మీద బూట్లున్న కాళ్ళు కిందికి వేళ్ళాడేసి.

"ఐయామ్ సారీ! కాని మిమ్మల్ని నేనేం అప్‌సెట్ చెయ్యలేదని అనుకుంటున్నాను. ఒకవేళ నావల్ల ఏదయినా పొరపాటు జరిగుంటే దయుంచి క్షమించమని కోరుతున్నాను." అని జవాబుకోసం చూతకండా లేచి సరాసరి కాఫీ మాస్టర్ దగ్గిరకెళ్ళి అక్కడ పెట్టిన కాఫీల్లో రెండు



స్వయంగా తీసుకుని టేబిల్ దగ్గిరి కొచ్చేడు. వెనకాలే పరుగెత్తుకొస్తున్న సప్లయర్ని ఆపి "అర్జంటుగా వొక స్వీటు పట్రా ఏదీ. గులాబ్‌జాం లాంటిది కాదు. లడ్డు, జాంగ్రి, మైసూర్‌పాక్ అలాంటి దన్నమాట! తెల్సిందా?'' అని వాణ్ణి తరిమాడు.

వాడూ తెలిసిన వాడే.

మూలనున్న వాష్‌బేసిను చూపించాడు రాజారావు కమలకి "కొంచెం మొహం కడుక్కుంటారా ?"

* * *

"దగ్గరేసార్. మేం నడిచి పోతాం'' అంటున్నా వినిపించుకోకుండా రాజారావు వాళ్ళని స్కూటర్ ఎక్కమన్నాడు. "ఈ స్థితిలో మీరు కుర్రాణ్నెత్తుకుని నడవలేరు. పోనీ వాణ్ణి చంక దిగమనడానికి నాకూ ప్రాణం ఒప్పడం లేదు. అంచేత మిమ్మల్ని మీ ఇంటి దగ్గర దింపి మరి నేను మా ఇంటికి వెళతాను.''

కొత్తసాలిపేట రద్దీలో ఒక చిన్న యింటి ముందు స్కూటర్ ఆపమంది కమల. ఆమె దిగేలోపుగా రాజారావు 'చిదా'ని ఎత్తుకున్నాడు. కమల తాళం తీసి తలుపు తెరిచింది. రాజారావు ఆమె వెనక కుర్రాణ్ణి ఎత్తుకుని లోపలికెళ్ళాడు.

కమల చెప్పులు విడిచి, బ్యాగ్ మంచం మీదకి విసిరేసి, గది వెనకవున్న తలుపు తెరచి, యింకా లోపలికి వెళ్ళింది. "బాత్‌రూమ్ కెళ్ళుంటుంది" అనుకొని కుర్రాణ్ణి దింపి అక్కడ నిలబడ్డాడు రాజారావు.

గదంతా కలయ చూశాడు రాజారావు.



అక్కడ టేబిల్ మీద, ఒక పెద్ద జంట ఫొటో ఫ్రేమ్‌లో కనబడ్డ రెండు ఫోటోలు; అందులో మగ ఫొటో కింద జల్లిన పువ్వులు చూసేడు రాజారావు.

ఆ పువ్వుల మీదగా వున్న మొగ మొహాన్ని మరోసారిచూశాడు రాజారావు.

అప్పుడర్థమైంది అతనికి; ఇందాక కమల అలా బర్స్ట్ అయిపోడానికి కారణ మేమిటో.

ఆ ఫొటోలో వున్నవ్యక్తి దినకర్రావు!

* * *

''మీరు కూడా వెళ్ళలేదా సార్, పిక్నిక్‌కి ?"

రాజారావు ఉలిక్కి పడ్డాడు.

కమల !

సూపర్ బజారు ఎదురుగా స్వీట్ స్టాల్ ఒకటుంది. అక్కడ పాలకోవా బావుంటుందని కొందరి నమ్మకం, కాగితంలోనో, పాలిథిన్ కవర్‌లోనో తీసి కెళ్ళడానికి వీలుండదు. టిఫిన్ బాక్సులు, హార్లిక్స్‌సీసాలు, గిన్నెలు తెచ్చి ఇళ్ళకి పట్టుకెళతారు. జావజావగా ఆ కోవా వేరే కోవకు చెందినట్టుంటుంది. అది ఇష్టమైన వాళ్ళలో రాజారావు పిల్లలున్నారు. వాళ్ళ కోసం కోవా 'పోయించుకొని' రోడ్డు మీది కొస్తూంటే పలకరించింది.

"లేదండి. మీరెళ్ళలేదేం''

"నేను వెళ్ళవలసిందేనండి. కాని మా బాబాయి గారొకరు ఢిల్లీనుంచి నిన్న ఫ్లయిట్‌లో వచ్చేరని; బి.హెచ్.పి.వి. గెస్ట్‌హౌస్‌లో ఉన్నారని; ఇవాళ ఫ్లయిట్‌లో వెళ్ళిపోతారని, నాకోసం, మా చిదా కోసం బట్టలు తెచ్చేరనీ కబురు తెలిసిందండి నిన్న రాత్రి. వీలుంటే ఓసారి రమ్మని, వీల్లేకపోతే ఎవర్నయినా లెటర్ ఇచ్చి పంపమని కబురు పెట్టా

రండి."

దూరంగా రెండో నెంబరు సిటీబస్సు కనబడింది.

''వస్తానండి. అదుగో ఆ బస్సు బి. హెచ్. పి.వి.కి వెడుతుంది.''

రాజారావు టిఫిన్ బాక్సు స్కూటర్ బ్యాగ్‌లో పెట్టాడు.

బస్సునిండా వేళ్ళాడుతూ జనం.

బస్సు ముందు గేట్‌లో మొగాళ్ళను తోసుకుంటూ వెళ్ళబోతోంది కమల. ఆమె అలా నలిగిపోతూనైనా వెళ్ళడానికి సిద్ధ పడ్డం చూసి రాజారావుకి కష్టం కలిగింది.

''కమలగారూ! ఆగండి!'' అని పెద్దగా కేక పెట్టాడు.

కమల బస్సెక్కే ప్రయత్నాన్ని విర మించుకొంది.

ఎవరో బస్సు బాడీమీద దబదబా రెండు సార్లు బలంగా వాయించారు. బస్సు బయల్దేరింది.

"మీకేం మతిపోలేదు కదా. ఆ బస్సులో అంతరద్దీలో ఒళ్ళు నలగ్గొట్టు కుని వెళ్తే ఎందుకైనా పనికొస్తారా?... చాల్చాలుగానీ మీ బాబాయిగారికి చీటి రాసివ్వండి. ఆ గుడ్డలేవో నేను తెచ్చి పెడతాను'' అన్నాడు.

''మరి నేను మా బాబాయిని చూడాలి కదా. బాగుండదు".

''అయితే కూర్చోండి. నేను తీసుకె డతాను. అంతేగాని మిమ్మల్ని మార్నింగ్ షోలు విడిచి పెట్టే ఈ టైమ్‌లో సిటి బస్సుమాత్రం యెక్కనివ్వను!"

కమల కొంచెం ఆలోచించింది. కొంచెం వాదించింది. చివరకి స్కూటర్ ఎక్కింది.

* * *

బి. హెచ్. పి. వి. గెస్టుహౌసు దగ్గిర కమలని దింపి ''క్వార్టర్స్‌లో నా ఫ్రెండొ కాయన వున్నాడు. ఓసారి పలకరించి వస్తాను. మీరు మీ పని అయిపోగానే ఇవతలికొచ్చి నిలబడండి'' అని చెప్పి వెళ్ళాడు. అతని ఫ్రెండు టౌనులోకి వెళ్ళిపోవడం వల్ల రెండు నిమిషాల్లోనే తిరిగి గెస్టుహౌసుకి వచ్చేశాడు. కాని కమల అంతకు ముందే వొచ్చి వరండాలో నించుంది.

''అదేం? ఆయనా లేరా?'' అని అడిగాడు రాజారావు.

కమల తల అడ్డంగా వూపింది. ''ఆయనొక మీటింగ్‌లో వున్నారు. ఇలా బైటికొచ్చి బావున్నావా అని అడిగి వెళ్ళి పోయారు?''

''మరి గుడ్డలన్నారు?''

''ఇదుగోనమ్మా!'' అని ఖాకీ యూని ఫారంలో వున్న ఒక వ్యక్తి ఒక ప్యాకెట్ ఇచ్చేశాడు కమలకి.

* * *

తిరిగి వచ్చేటప్పుడు గాజువాక ద్వారా కాక, ట్రంక్‌రోడ్డు డైవర్షన్ ద్వారా తీసుకొస్తూ మేఘాద్రిగెడ్డ వంతెన దాటగానే ఆపాడు రాజారావు. ''ఇక్కడ కాసేపు కూర్చుని వెడదాం'' అన్నాడు.

"ఇప్పుడెందుకండీ సార్? బాబుని పొరుగింట్లో వొప్పచెప్పాను ... తొంద రగా వెళ్ళిపోదాం" అంది కమల.

"తొందరగానే వెళ్ళిపోదాం. ఎక్కువ సేపు వుండొద్దు మనం ఒకర్నొకరుతెలుసు కుందాం. అంతే. మీరు బస్సులో వచ్చి బస్సుకోసం నిలబడి మళ్ళీ బస్సులో వెళ్ళి పోయేటంత టైమ్‌లో వెళ్ళిపోదాం"

రోడ్డు పక్కనే సరుగుడుతోట. అంత కంటె మరోనీడ లేదు. దాన్ని చేరాలంటే

ఎత్తుగా వున్న రోడ్డు నుంచి వాగులోకి వేసిన మట్టి రోడ్డు గుండా దిగాలి.

"పదండి" అని దారి చూపించి, స్కూటర్ బ్యాగ్‌లోంచి గుడ్డల పాకెట్టు, టిఫిన్‌బాక్సు తీసుకుని దిగాడు రాజారావు.

తోటలో రెండు వరసల చెట్లు దాటగానే ఆగాడు రాజారావు. బట్టల ప్యాకెట్టుమీద ఆమెని కూర్చోబెట్టి లేత కొమ్మలు కొన్ని విరిచి ఈనెలతో కుచ్చు చేసి దాని పైన కూర్చున్నాడు.

ఒక్క నిమిషం అలా కూర్చుని రాజారావు అన్నాడు "నేను మిమ్మల్ని నిన్ననే అడిగాను మీ గురించి కొన్ని వ్యక్తిగత వివరాలు చెప్పమని. అది వేరే విషయం. ఇప్పుడు నాకు మనం వొకర్నొకరం తెలుసుకోడం అవసరమని నాకనిపించింది. నా గురించి మీకు పూర్తిగా చెబుతాను, మీ గురించి నాకు పూర్తిగా చెప్పండి"

కమల నవ్వింది "ఎందుకు సార్?"

"ఎందుకో మీకు కూడా తెలుసనుకుంటున్నాను. మీరు వివాహం విషయంలో జీవితంలో పోనీ విధివశాత్తు దెబ్బ తిన్నారు. నేనూ అంతే. అలాగే మీకూ పెంచవలసిన బిడ్డ వున్నాడు. నాకూ ఉన్నారు. ఇలాగ మన పరిస్థితులు మనల్ని ఒకర్నొకరు సరి పోల్చుకునే అవకాశాన్ని కల్పిస్తున్నాయి. మీ స్థానంలో నా స్టెనోగా ఒక అవివాహిత లేదా గృహిణి వచ్చుంటే నేను ఆవిడ సంగతే పట్టించుకోకపోదును. అలాగే, నాస్థానంలో నా వంటి విధురుడు కాక మరొకరుంటే మీ గురించి ఆలోచించే విధానమే వేరుగా ఉంటుందికదా. ఈ కారణాలవల్ల మీరు మా ఆఫీసులో చేరడం అందులో సరాసరి నా దగ్గరే స్టెనోగా చేరడం, నేను కలకాలం గుర్తు పెట్టుకోదగినవీ, ప్రతి దినం గుర్తు చేసుకోదగినవీనీ"

కమల తల వంచుకునే వింటోంది. మధ్యలో ఒకసారి మాత్రం అతన్ని చూసింది. అతని మొహాన చిరునవ్వయినా లేదు."

"నిన్న సాయంత్రం మీరు హటాత్తుగా బ్రేక్‌డౌన్ అయిపోయారు. నా నాకేం తోచలేదు. చాలా బాధపడ్డాను. నేను మిమ్మల్ని ఏమీ గాయపరచలేదే అనుకున్నాను. కాని మీ ఇంటికొచ్చేక తెలిసింది, నేనే దినకర్రావు పేరెత్తి మిమ్మల్ని గాయపర్చానని. ఐమ్‌సారీ"

కమల దోసిల్లో మొహం దాచుకుంది.

"మీరు దుఃఖపడొద్దు ప్లీజ్. నాకు దినకర్రావు బాగా తెలుసు. మీరతని దృష్టిలో పడడమే పొరపాటు. మిగిలిందంతా అది ఏ స్త్రీకయినా సామాన్యంగా జరిగే కథే కనక పొరపాటు లేదు అయితే, మీరు డిపార్టుమెంటుకి పెట్టుకున్న అపీల్ విషయంలో మీకు జరిగిన ఆ అన్యాయాలన్నిటికీ అతను మూల కారణంగనుక వాటికి ఇక్కడో, హైదరాబాదులోనో తగిన మంత్రంవేసి నివారణం చేయాలని నేను నిశ్చయించుకున్నాను."

రాజారావు ఆగాడు.

ఏ జ్ఞాపకాలు ఆమెను బాధించాయో, ఏ ఓదార్పులు ఆమెకి బలాన్నిచ్చాయో తెలీదు. కాని రెండు నిమిషాలలోనే ఆమె తన మొహంమీదనుంచి చేతులుతీసేసింది. దినకరరావుని దూషించకుండానేచెప్పింది కథఅంతాను. రాజమండ్రి ఎ.డి. గావుండి కాకినాడ ఎ. డి. ఇన్‌ఛార్జి చెయ్యటమూ, ఆ రోజుల్లో అతనికి పెళ్ళే కాలేదని చెప్పటమూ, తను నమ్మడమూ, అతని ప్రతి

రూపాన్ని తను కడుపులో పెంచడమూ. అది నలుగురికీ తెలిస్తే గొడవ అవుతుం దని గుంటూరుకి ట్రాన్స్‌ఫర్‌కి హైదరా బాదువెళ్ళి ప్రయత్నం చేయడము, అతను జీప్ ఏక్సిడెంట్‌లో మరణించిన తరువాత గాని అతనికి వివాహం అయిన విషయం తన దృష్టికి రాకపోవడమూ అవన్నీనూ.

రాజారావు తన కథ పూర్తిగా చెప్పా డామెకి. ఇద్దరు పిల్లల తరువాత తను వెసెక్టమీ చేయించుకున్నాడు. తనకి రెండో భార్య అక్కర్లేదనుకునేటంత వయసుకాదు.కాని ఆ వచ్చే ఆమెకి తననుంచి పిల్లలు అక్కర్లేకపోతేనే తనకి వీలు.అలాంటి వీలు కమలకుందని అతను స్పష్టంగా సూచించాడు.

''మీరు ఇంటికెళ్ళి సావధానంగా ఆలోచించుకోండి. మీరు ఖచ్చితంగా ఒప్పుకోవలసిందేనని నేనుకోరను.కానిమన ఇద్దరికీ ఇది మంచి పరిష్కారం కాగలదని నేను అనుకొంటున్నాను. నా ఆలస్యం ఏమీ ఉండదు. మీ నిర్ణయం అయిన వెంటనే రిజిస్ట్రార్‌కి దరఖాస్తుపడెయ్యడం, స్టాట్యుటరీ టైమ్ గడవగానే రిజిస్ట్రేషన్, అంతే" అని చెప్పాడు.

* * *

టిఫిన్ బాక్స్ తెరిచి, జావలావున్న కోవాలో సగం టిఫిన్‌బాక్స్‌మూతలోపోసి అది తను తీసుకుని గిన్నెలాంటిది ఆమె కిచ్చాడు.

"పిల్లలకోసం తీసుకున్నది మనం తినేశాం'' అంది కమల.

"పిల్లల క్షేమంకోసం కాబోలు" అన్నాడు రాజారావు చేతులుకడుక్కో డానికి మేఘాద్రిగడ్డ వాగువైపు నడుస్తూ.

ఆ మర్నాడు...

ఆ తరవాత రోజు...

ఆ మరుసటిరోజు...

ఆఫీసు అయిపోగానే కమలని శారదా బాలవిహార్‌దాకా తీసుకురావటం, అక్క ణ్ణించి ముగ్గురూ ఆ కాఫీహోటల్‌కే వెళ్ళడం; రెండు కాఫీ, స్వీటు. అక్కడి నుంచి ఇంటికి. కమల యింటి దగ్గిర రాజారావు మంచంమీద కూర్చోడం.

కమల ఆ మంచం పక్కన చాప వేసుకుని కూర్చోడం.

'చిదా'గాడు మమ్మీదగ్గిర కూర్చుని ఆ రోజు పాఠాల్లో విశేషాలు ఏకరువు పెట్టడం.

ఆ కారణం మీదనో, మరో కారణం, మీదనో కమలా, రాజారావూ నవ్వుకోడం.

అలా నవ్వుకున్నప్పుడల్లా 'చిదా' గాడు గుడ్లు పెద్దవి చేసి యిద్దర్నీ మార్చి మార్చి చూడడం ...

వాళ్ళు అతన్ని ఏమార్చి నవ్వుకోడం యిలా సాగింది.

ఆ గురువారంనాడు

శారదా బాలవిహార్ దగ్గిర కమల స్కూటర్ దిగగానే, "ఇగో వాకింగ్ మమ్మీ" అన్నాడు 'చిదా'గాడు నవ్వుతూ.

"మీరు వెళ్ళిపోండి" అంది కమల.

రాజారావు స్కూటర్ స్టార్ట్ చేసి వెనక్కి వెనక్కి చూసుకుంటూ వెళ్ళాడు.

కమల 'చిదా'గాణ్ణి ఎత్తుకో బోయింది.

వాడు 'నడుస్తా'నన్నట్టుగా ఆమెని విదిలించుకున్నాడు.

రాజారావు అలా ముందుకెళ్ళి వెన క్కొక రౌండు కొట్టుకొచ్చాడు. అతని కేమీ తోచలేదు.

'స్వీటు యివ్వడం అలవాటయిన వాడిలా కాకండా, స్వీటు పుచ్చుకోడం అలవాటయిన వాడిలా గిలగిల్లాడిపోయాడు రాజారావు.

అలా హోటలుకెళ్ళి "మూడు స్వీట్లు కట్టవోయ్ పార్శెలు" అంటే "ఏం సార్, అమ్మాయిగారివాళ రాలేదు ?" అన్నా డొక సప్లయర్.

'వాళ్ళింకా యింటికి రారు...' అనుకుని కాసేపు తాత్సారంచేసి మరీ వెళ్ళాడా యింటికి.

కమల మంచంమీద వెల్లకిలా పడుకుంది.

'చిదా'గాడు ఆమె కడుపుమీద కూర్చున్నాడు – రెండు కాళ్ళూ అటూ యిటూ సదుపాయంగా వేసుకుని. వాడి చేతిలో ఒక మైసూర్‌పాక్ వుంది. తను కొంత కొరికి, వాళ్ళమ్మ నోట్లో పెట్టి కొంత కొరకమన్నాడు. మైసూర్ పాక్ అడ్డంగా వున్న నోటితోనూ, ఖాళీగా వున్న చేత్తోనూ ఆ చెప్పడం.

కమల చటుక్కున వాణ్ణి దింపి, "రండి సార్" అని మంచం మీద లేచి కూర్చుంది.

'చిదా'గాడు తన చేతిలో తనూ, కమలా యెంగిలి చేయగా మిగిలిన మైసూర్‌పాక్ ముక్కని రాజారావుమీదికి విసిరేసి, మంచం మీదినుంచి ఒక్కదూకు దూకి వెనకింట్లోకి పారిపోయాడు.

ముక్కుకి సూటిగా తగిలింది రాజారావుకి ఆ ముక్క.

"క్షమించండి సార్. చిన్నపిల్లాడు... తెలియక..." అని కమల రాజారావుకి టవల్ అందించింది.

"ఫర్వాలేదు, ఫర్వాలేదు" అని రాజారావు ముక్కు తుడుచుకున్నాడు.

"ఏం అనుకోకండి సార్. నేను వాణ్ణి మందలిస్తానులెండి. కోతి వెధవ"

"ఛా అదేమిటి? నన్ను వోదారుస్తున్నారా! ముందు వాడి సంగతి చూడండి" అని తను తెచ్చిన పొట్లాం ఆమె చేతికిచ్చాడు.

"మళ్ళా యెప్పుడు రాను"

"నే చెప్తానుగా సార్!"

రాజారావు సంతోషంగానే వొచ్చాడిపతలికి.




రాత్రి పది గంటలు కాలేదింకానూ, అయినా ఎంతో రాత్రి అయిపోయినట్టు ఊరంతా మాటుమణిగి పోయింది.

ఉదయం 'కాల్డిరి' వెళ్ళిన గంగమ్మ గారు పొద్దు మునిగేసరికి వొచ్చేస్తానంటూ వెళ్ళింది. "ఇంకరాదు" అనుకుని లైట్లు రెండూ ఆర్పేసి మంచం మీద వాలింది రాజేశ్వరి.

అయిదు నిమిషాలైందో లేదో, తలుపు మీద టకటక శబ్దం.

"అమ్మయ్య! వొచ్చింది!" అనుకుని లేచింది రాజేశ్వరి.

తలుపుగెడ ఈ చేత్తో తెరుస్తూ, ఆ చేత్తో పక్కనే వున్న లైటు స్విచ్చి వేసింది.

"నమస్కారం అత్తయ్యగారూ !"

అంటూ తలుపు తోసుకుని లోపల ప్రవేశించాడు నారాయణ. "తింటానికేమైనా వుందా రాజెమ్మా" అన్నాడు తనకి కనపడిన వ్యక్తి 'అత్తయ్యగారు' కాదని తెలిసిన మరుక్షణం.

ఉందన్నట్టు తల మెల్లగా వూపింది రాజేశ్వరి. ఆమెకి వొళ్ళంతా వణికేంత భయం వేసింది. గంగమ్మగారు ఆ వూరు చేరాక, నేనొక్కదాన్నీ యిక్కడున్నానని ఒచ్చాడా ఏమిటి ? అత్తయ్యగారూ అని పిల్చేడే మరి. లేదు తలుపు కొట్టేటప్పుడు చప్పుడే చేసేడు. తలుపు తెరిచేకనే అత్తగారూ అన్నాడు. పరమ దుర్మార్గుడు వీడు. జీవితంలో రెండోసారి వీడికి ఒంటరిగా చిక్కేను. ఏం అల్లరి పెడతాడో?

మరు నిమిషంలో ఆమెకి రంగ నాయకి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. "ఈ మధ్య బాగా యింటి పట్టున వుంటున్నారు. పొలం పనీ, బాకీల వసూళ్లు అవీ చూసుకుంటూ కోర్టు వాయిదాలుంటే నిడదవోలు వెడుతున్నారు. కాని సాయంకాలానికి విధిగా వచ్చేస్తున్నారు. నేను చెప్పలేదూ! మారతారు- ఇటు మొగాళ్లు, అటు ఆడాళ్ళూ కూడాను. పెళ్ళనేది అందుకే జీవితంలోటర్నింగ్ పాయింటు"

మారేవుంటాడని ధైర్యం తెచ్చుకుంది.

ఆ రోజు రైల్లోనూ నేనలాగే భయపడిపోయాను.... మొగవాళ్లు మాత్రం మనుషులుకారూ ?

"రా, నారాయణ బావా, వడ్డిస్తున్నాను" అని కేకేసింది వంటింట్లోంచి.

"ఇక్కడికే తీసుకురా"

"చా, అక్కడేంటి" అని తొంగి చూసింది. నారాయణ మంచం మీద బాసింపట్టుతో కూర్చున్నాడు. చిన్న టేబిలు ఒకటుంది. దాన్ని మంచం దగ్గరగా సిద్ధంగా పెట్టాడు. "నువ్వీ ఇంటికి అల్లుడివే గాని, ఇక్కడ తింటానికి వీల్లేదు. లే" అని దగ్గరగా వచ్చి చెప్పింది. "అంతేనంటావు" అని నడిచాడు నారాయణ నవ్వుతూ.

"ఆ మూల కాళ్ళూ, చేతులూ కడుక్కో" అని నిండా బకెట్ నీళ్ళూ, చెంబు చూపించింది. అతను కాళ్ళూ చేతులూ కడిగా ననేందుకు వీలుగా కడిగాడు.

"ఆవకాయవుంది, పులుసుంది, బంగాళాదుంప కూర వుంది. ఇవి చాల వంటే గుడ్లు చేస్తాను" అంది.

"ఉన్నదేదో తొరగా వడ్డించు. పొద్దుట్నించీ యేంతిన్లా" అని పీట ఎక్కాడు నారాయణ.

కూరంతా వట్టి ముక్కలే తినేశాడు. ఆవకాయతో కొద్దిగా అన్నం కలిపి ''రాజెమ్మా'' అని ప్రేమతో లాగా పిల్చాడు. ''మంచం మీద సంచిలో సీసావుంది. తెచ్చి పెట్టవా?"

రాజేశ్వరి నిశ్చాంత పోయింది.

"వద్దులే బావా! యిప్పటికే ఛాలా తాగినట్టున్నావు. గుప్పుమంటోంది ఇల్లంతా వాసనతో"

"అత్తమ్మా!" అని బిగ్గరగా కేకేశాడు నారాయణ.

"ఉష్...అరవక. నువ్వు కాల్దరిలో యెప్పుడు బయల్దేరావు బావా? రంగ బాగుందా?"

"తెల్లారి బయల్దేరా. రంగకేం బానేవుంది"

"తెల్లారి బయలుదేరినవాడివి ఇంత వరకూ ఏం తినలేదంటున్నావు. యామైంది?"

''కొద్దిగా'' అని చూపుడువేలు కణుపులు రెండు బొటనవేలితో చూపించాడు. ''నీ చేత్తో నువ్వే పోసి తీసుకురా'' అని గ్లాసందించబోయి అందులో నీళ్ళుంటే ఇందాక కాళ్ళు కడుక్కున్న తూము దగ్గర విసిరేశాడు.

''వద్దుబావా యివాల్టికి చాలించు!'' అంటూ ఒణుకుతున్న చేతుల్తో గ్లాసందుకుంది.

సంచి తెరిచి చేతిలోవున్న గ్లాసు పక్కగాపెట్టి, సీసా బయటికి తీసింది. దానిమీద మూడు ఎక్స్‌లు వున్నాయి. సీసా తీసిన చెయ్యి దాంట్లోది గ్లాసులోకి వంపబోతూవుంటే వణకసాగింది. లోపలి ద్రవం పరిమాణాన్నిబట్టి ఎక్కువ తాగ లేదని తెలిసింది రాజీకి. రేపెప్పుడయినా రంగ కనబడి "నీ చేతుల్తో నువ్వే పోసిచ్చావటగా" అంటుందేమో.

"ఏంటి రాజెమ్మా! రావేం?"

కంగారుగా గ్లాసులోకి వంచింది. సగానికిపైగానూ, తొణకనంత నిండానూ పడింది. అతను చూపించింది ఒక అంగుళమే అని మళ్ళా సీసాలో వంచబోయింది. కుదరలేదు. మంచం మీద వలికిపోతోంది. ఎలాగూ మరోసారి పంపుతాడు తెమ్మని. ఇంత సీసా యిక్కడుంచుకుని అంగుళాలూ, సెంటీ మీటర్లూ తాగుతాదేమిటి?

"ఇక్కడికొచ్చేముందు ఇలాంటి వెన్ని తాగావు?"

"అబ్బే! సీసాలేదూ! మీదిని ఖాళీవుంది చూసేవుగా. ఆ కాస్త" అని గ్లాసు అందుకుని ''వారివ్వా! పత్రికలోళ్ళు దీపావళి సంచిక వేసినట్టే సేవు. ఎట్లాగైనా రాజెమ్మ చెయ్యి రాజా చెయ్యి!"

"సీసా కొనుక్కున్నోడివి కాస వెలుతురుండగా రాకపోయినావా, లేకపోతే ఎక్కడన్నా తినిరాకపోయినావా? ఈ తిండి సరిపోతదో లేదో"

"తినే వద్దును కాని మందుకసక అలవాటుగా అరువిచ్చాడు. భోజనం ఎవడూ అరువు పెట్టడు"

"ఏం భోజనం అలవాటులేదా ఏంటి"

పులుసూ, అన్నం రెండు జర్రులు జర్రి తేచ్చి నీళ్ళు తీసుకుని చెయ్యి కడిగేశాడు కంచంలోనే.

"అదేం పొద్దుట్నించీ ఏం తినలేదన్నావుగదా"

ఉదయం బయలుదేరాడట. సీసా అరువు తెచ్చుకున్నాడట. భోజనం ఎవడూ అరువు పద్ధతిని పెట్టరు కసక చెయ్య



లేదట. డబ్బు లేకుండా బయలేరుంటాడా? మరి ఈ అరువు దేనికి? అంటే పగలంతా తాగుతూనే వున్నాడా?

గ్లాసు మీద చెయ్యి బోర్లించి దాన్ని వూతగా పట్టుకుని లేచాడు నారాయణ. లేస్తూ ఆ గ్లాసు పుచ్చుకున్నాడు.

"మళ్ళీ అదెందుకు బావా?" అందుకోబోయింది ముందుకెళ్ళి.

"ఉండు!" అని రాజీని పక్కకితోసేసి గదిలోకొచ్చాడు నారాయణ. "ఎదవలంజా కొడుకులు. ఒళ్ళంతా పచ్చడి చేసేరు. మరి కాస్త ఏస్తే గాని నిద్రపట్టదు."

ఎవరు ? ఎందుకు ? ఎప్పుడు ?... దెబ్బలేం కనపడవే ? అంతా కల్పనే కాబోలు దేవుడా !

"అత్తమ్మగారేరి?"

"కాల్దరెళ్ళిందిగా."

"ఎప్పుడు?"

"తెల్లారే. వచ్చేస్తానందిలే సాయం కాలానికి, ఇంకా పాపింజెరుందిగా"

నారాయణ నవ్వాడు. "పోన్లే ఆవిడ కోసం గావాల వండేవు. లేకపోతే ఆకల్తో సచ్చిందును" తిన్నగా మంచం దగ్గిరికెళ్ళాడు. అంతకి ముందే వున్న టేబిల్ మీద గ్లాసు పెట్టి, తీసబాటుగా సీసా తెరవసాగాడు.

"నీ వాటం జూస్తే యిక్కడ ఒక తాగుడు దుకాణం పెట్టేట్టున్నావు" అని ఆ గ్లాసుతో టేబిల్ దాని యధా స్థానానికి నడిపేసి, అతను గమనించేలోగా సీసా కూడా లాక్కుని మూతేసి, గోడ బీరువాలో దాన్ని దాచేయడానికి తాళం చేత పుచ్చుకుంది రాజేశ్వరి. "తాగింది ఇవాల్టికి చాలు, అక్కడలా పడుకో నేను లోపలి గదిలోకెడతాను."

"అరెరె!" అని మంచం దిగి వచ్చేసేడు నారాయణ. "పదన్నా కాలేదు, ఇప్పట్నుంచే నిద్దేంటి! ఇటియ్యది !" అని, ముందు తాళం వెయ్యకుండా ఆ చెయ్యి లాగాడు. తాళం లాక్కుని సీసా కోసం ఆమె ఎడం చెయ్యి లాగాడు. రాజేశ్వరి తెలివిగా సీసాను కుడిచేతిలోకి మార్చేసుకుంది "ఇయ్యను. వెళ్ళి బుద్ధిగా పడుకో. పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యబోకు" అంది.

అంతే. నారాయణకి కోపం వచ్చేసింది. చేత్తో పట్టుకున్న స్టీలు గ్లాసు విసిరేసాడు. "ఇయ్యవూ? ఎలాగియ్యవో నేను చూస్తాను" అని ఆమె మీదికి దూకాడు. రాజేశ్వరి అతను పట్టుకున్న ఎడం చేతిని విడిపించుకుని వంట యింట్లోకి పారిపోబోయింది. నారాయణ అడ్డం వెళ్ళి తలుపులు మూసి గడియ బిగించాడు– తన చేతిలో ఆమె చెయ్యి వదలకుండా పట్టుకునే. రాజేశ్వరి అతన్ని వీధి తలుపు వైపు ఈడ్చెయ్యబోయింది. రెండు చేతుల్తో పట్టుకున్నాడు అతడు ఆమెను.

ఎరువు తెచ్చుకున్న ధైర్య సంపద అంతా ఆ క్షణంలో కరిగిపోయింది రాజేశ్వరికి. అతనామెని బరబరా యీడ్చుకెళ్ళి మంచం మీదికి తోసేశాడు. ఆ తోపుడికి సీసా పగిలిపోతుందేమోనన్నట్టుగా దాన్ని గట్టిగా పట్టుకొని, మంచానికి అడ్డంగా, మధ్యగా వెల్లకిలా పడిపోయిందామె.

ఆ భంగిమలో ఆమెని చూసిన మరుక్షణం అతనిలో "పురుషుడు" పశుబలం విజృంభించాడు. అతను సీసా సంగతి తాత్కాలికంగా వాయిదా వేశాడు. అస్తవ్యస్తమైన భంగిమలో వున్న ఆమె మీద రెండు చేతులూ వేశాడు. ఆమె భయం

లోంచే ధైర్యం తెచ్చుకుని, మంచం కిందికి వేళ్ళాడుతున్న రెండు కాళ్ళనూ పైకెత్తి అతన్ని తన్నబోయింది. నారాయణ తన రెండు మోకాళ్లు ముందుకి వంచి ఆమె కాళ్ళకి అడ్డం పెట్టి అవి లేవకుండా చేసేడు. చేతులు అతనికి రెండు. ఆమెకి వొక్కటే. అదీనీ ఎడం చెయ్యి... చాల్లేదు. సీసా వదిలేస్తే తప్ప మరి కొంత ప్రతిఘటన సాధ్యం కాదు.

కాని, అతను రెండు చేతుల్నీ ఆమె గుండె మీద బలంగా అదిమి వాటికి పన్లు చెప్పాడు.

వదిలేసిన సీసా మళ్ళా తీసి, దాంతో అతని నెత్తి మీద ఒక్కటి కొట్టింది రాజేశ్వరి. కంగారులో కాసుకోడానికి అతను లేచాడు. సందు చూసుకుని రాజేశ్వరి అతని పక్కనించి దూసుకు వెళ్ళిపోయింది లేచి. సీసా దాచేస్తే మంచిదని మళ్ళీ అలమారు దగ్గిర కెళ్ళబోతూ అతనిటు రావడం చూసింది. ఇహ నిర్లక్ష్యం చెయ్యడం తన పీకల మీదకి తెచ్చుకోడమేనని, సీసా రెండు చేతులా పట్టి పైకెత్తి "చావు, దున్నపోతు! శని విరగడైపోవాలి యివాల్టితో నాకూ, రంగకీ, మీ వూరికీ కూడాను!" అని–

సగందాకా 'రమ్ము' వున్న ఆ సీసాతో...

ఒకటి –

రెండు! అంతే. సీసా అడ్డంగా కొబ్బరికాయలా పగిలిపోయింది. పెంకులు కొన్ని నేల మీద, కొన్ని మంచం మీద.. ద్రావకం అంతా అతని తల మీద, మొహం మీదా..

కనుబొమల మీది నుంచి తలంటప్పుడు కుంకుడు కాయ పులుసులా కొంత అతని కళ్ళలో పడ్డట్టుంది. "ఓసి నీయమ్మో. సంపేసేవే" అంటూ కళ్ళు మూసుకుని అలాగే వెనక్కి జరిగి సరిగ్గా యిందాక రాజేశ్వరి పడిపోయినట్టే వెల్లకిలా, అస్తవ్యస్తంగా పడిపోయాడతను. అప్పటిదాకా కొట్టడానికి, కాసుకోడానికి, కనీసం అనుకోడానికి రాబందు రెక్కల్లాగ బలంగా, విశాలంగా ఆడుతున్న ఆ రెండు చేతులూ మంచం మీద వాలిపోయాయి.

మంచం మీద మధ్యగా, రమ్ము సీసా 'మట్టు' విరిగి పడివుంది. విరగడంలో యేర్పడ్డ ఆ కోరల మీద పడ్డ కుడి చెయ్యి ఎక్కడ తెగిందో, మంచం మీద ఆ ప్రాంతంలో రక్తం. తలవెనుక భాగం మంచం మీద ఆనుకున్న చోట కొద్దిగా. ఆ రక్తం కళ్ళ పడగానే రాజేశ్వరికి ఆ మనిషి మీద యింతకు ముందున్న అన్ని భావాలూ యెగిరిపోయాయి, ధైర్యమూ యిగిరి పోయింది.

"అమ్మో! సచ్చిపోయాడో!!" అని అరిచేసింది. కుడి చేతిలోని సీసాపైభాగం దానంతటదే జారిపోయింది. రెండు చేతులూ ఆ నిర్జీవ మూర్తికి నమస్కారంలా కలిసిపోయి, వెంటనే చేతుల వేళ్ళన్నీ ముడుచుకు పోయాయి. ఏడుపు వచ్చింది.

అప్పుడు తలుపు చప్పుడైంది.

క్షణంపాటు రాజేశ్వరికి ఏం తోచలేదు. తలుపు తెరవకుండా యిటు పారిపోదామని ఆలోచన. దాని వ్యతిరేక ఆలోచన–

మరుక్షణం తెలిసింది...

ఇది దాగదు.

తను చచ్చేదాకా ఆగదు...

తలుపు తెరిచింది. రెండు తలుపులూ

తోసుకుని వొచ్చిన మనిషి-

రంగనాయకి తల్లి కాదు.

అరుపువిని పచ్చిన యిరుగు పొరుగు కాదు.

చెయ్యెత్తు మనిషి, పూర్తి యూని ఫారంలో, చేతిలో లాఠీతో అతను పోలీసు ఇనస్పెక్టర్ మధుసూదనరావు!

"ఏంటమ్మా? ఏం జరిగింది? అరె నువ్వా అమ్మలు?'' అని అడుగుతూ గదంతా చూసేడతను.

"బాబుగారూ! నన్ను జైలుకి తీసుకు పొండి, నాకు ఉరిశిక్ష వేయించండి" అని ముందు మోచేతులు క్రాస్ చేసి, తరవాత విప్పేసి, అతని గుండె మీద వాలిపోయింది రాజేశ్వరి.

మధుసూదనరావు చేతిలోలాఠీ కింద పడేసి ఆమెని రెండు జెబ్బలూ పట్టుకుని పడిపోకుండా ఆపాడు. వంటింటి గోడ పక్కనున్న ఈజీ చేర్ దాకా ఈడ్చుకు వెళ్ళి, అందులో కూలవేశాడు.

మంచం దాకా వెళ్ళి నారాయణ ముక్కుమీద వేళ్ళు పెట్టి, వెంటనే తనజేబు లోంచి రుమాలు తీసి అతని కనుకొల కులూ, ముక్కు రంధ్రాలూ క్లీన్‌చేశాడు. కుడిచేతిని సీసా మట్టు మీదనుంచి తొల గించి ఆ రుమాలుతోనే కట్టు కట్టాడు. వంటింటి తలుపుతీసి అక్కడ ఎదురుగా కనపడ్డ చెంబు చూసి ఆ మిగిలిన నీళ్ళు తెచ్చి రాజేశ్వరి మొహంమీద చిలకరిం చాడు. "అమ్మలూ" అని చెవిలో గట్టి కేక పెట్టాడు. క్షణంలో స్పృహ వచ్చింది రాజేశ్వరికి.

కుడి అరచెయ్యి అభయ ముద్రలో పెట్టి "కంగారుపడకు. వాడు చావలేదు!" అన్నాడు మధుసూదన్‌రావు. విభ్రాంతితో చూసింది రాజీ. "ఇప్పుడు చెప్పు. వేగం చెప్పు. నువ్విక్కడెందుకున్నావు? వీడి క్కడికెలా వచ్చాడు? నువ్వు వీణ్ణి ఎందు కొట్టావు?" ఆ ప్రశ్నల్లో పోలీసాఫీస రెవరూ కనపడలేదు రాజీకి. తనంత వయసు కలిగిన ఆడపిల్లని అమ్మలూ అని పిలవగలిగిన తండ్రి వున్నాడు.

అయినా రాజేశ్వరి ఏడుస్తూనే చెప్పింది "మీతో అప్పుడొచ్చేను కదండీ ఈ వూరు! ఆ వుద్యోగం నాకొచ్చిందండి. ఈ యిల్లు రంగనాయకిదండి. ఇక్కడ రంగా, వాళ్ళమ్మగారు, నేను ఉంటున్నామండి. ఇవాళ ఉదయం ఆవిడ రంగని చూసొ స్తానని కాల్దరి వెళ్ళిందండి. ఇతను రంగ మొగుడండి. నాకేమో మేనమామ కొడుకే నండి. అసలుకి వీడు చిన్నతనంనుంచీ పచ్చి తాగుబోతూ, ఒట్టి ముండల మొటా కోరూనండి. నా పధ్నాలుగోఏట మా మామయ్య సచ్చిపోయేదాకా నేను వీళ్ళిం ట్లోనే వున్నానండి. మామయ్య పోయిన తర్వాత బంధువులంతా వెళ్ళిపోయిన రాత్రి నన్ను బలాత్కారం చెయ్యబోతే అప్పుడు యిలాగే తన్నికొట్టి, పడదోసి బయట గడియబెట్టేసి వైజాగ్ పారిపోయా నండి. మళ్ళీ ఇవాళ వీడికి ఒంటరిగా దొరికానండిక్కడ. ఇవాళ ఇందాకిందాకే పచ్చాడండి. ఆకలిగా వుంది అన్నం పెట్ట మంటే పెట్టానండి. ఆ తరవాత మళ్ళీ నా మీద పడ్డాడండి. సీసా చేతికి తీసుకుని కొట్టేశానండి. సచ్చిపోయాడండి".

మధుసూదన్‌రావు ఆమె భుజం మీద తట్టాడు. "నో వాడు సచ్చిపోలేదు. నేనెళ్ళి డాక్టర్ని తీసుకొస్తాను. రంగ మొగుడని నాకు యిందాకే తెల్సింది. యివాళ ఉదయం వీడు చకోర్ లాడ్జిలో దిగాడు. అక్కడ యిద్దరు లంజలతో సర

సొలూ, ఏక తాగుడునూ, పగలంతా అదే పని. సాయంకాలం ఆ ఏరియా అంతా రెయిడింగ్ చేసి పట్టుకున్నవాళ్ళలో వీడొకడు. జేబులు ఖాళీ చేయిస్తూవుంటే ఇది నా కంట పడింది" అని పర్స్‌లో జంట ఫొటోల ఫోల్డర్ తీసి విప్పాడు. "ఈ అమ్మాయి మన రంగనాయకేకదా! నీకే మొతుందని అడిగాను. నా పెళ్ళామేనండి అన్నాడు. ఎక్కడుందన్నాను. ఇక్కడే వుంటోందన్నాడు.

సరే, మన రంగ మొగుడే కదా అని విడిచి పెట్టేశాను. ఇంటికెళ్ళేదారే కదా రంగతో చెప్పి పర్సు ఇద్దామనుకొన్నాను. రాగానే కేకెలు విని తలుపు కొట్టాను. ఇదన్నమాట, వీడు చేసిన పని!"

మధుసూదన్‌రావు ఆగాడు, "నాకు కొంచెం తాగడానికి మంచినీళ్ళియ్యి అమ్మలూ!"

కొండంత బలం, మబ్బంత వుషారు వచ్చింది రాజేశ్వరికి. "ఓ!" అని పక్క గదిలో కెళ్ళి గాజుగ్లాసు శుభ్రంగా కడిగి మంచి నీళ్లు తెచ్చిచ్చింది. అతనీలోగా నారాయణ స్పృహలేకండా పడివున్న మంచాన్ని పరిశీలిస్తున్నాడు-వీధి తలుపు దగ్గిరగా మూసి.

"ఇంకో మంచం వుందా ?"

మడతమంచం చూపించింది రాజీ. అది ఆయనే వాల్చి, నారాయణను ఎత్తుకుని మోసుకొచ్చి అందుమీద పడుకో బెట్టాను. చీపురు తెచ్చి గడంతా శుభ్రం చేయించి, గాజు పెంకులు నేల మీదవీ, దుప్పటి మీదవీ పోగుచేయించి డస్ట్‌బిన్‌లో వెయ్యమని వీధిలోకి పంపేడు రాజేశ్వరిని. దుప్పటి మార్పించాడు. "సర్లే! వీడి సంగతి నేను చూసుకుంటాను గానీ, నీ సంగతేంటి ? నువ్వు మా యింటికెళ్ళి పడుకుంటావా మా పిల్లలతో బాటు?"

రాజేశ్వరి చేతులు జోడించింది. "తమరు పర్మిషనిస్తే వైజాగ్ వెళ్ళిపోతానండి. ఆరు వారాలకి ఈ ఒక్క ఆది వారం ఖాళీ వచ్చింది. ఇవాళ మధ్యాన్నమే వెళ్ళిపోయే పని. కాని గంగమ్మ గారు రాక...పిల్లల్ని చూడాలని మనసు కొట్టుకుపోతోందండి"

"పిల్లలా ?"

"అవునండి. మా బావగారి పిల్లలండి. అక్క పోయింది కదండి. వాళ్లు అంతకు ముందు కూడా నా పిల్లల్లాగే వుండే వారండి. నా తెలివితక్కువ వల్ల, స్వార్థం వల్ల తండ్రిగారుండీ, నేనుండీ కూడా అనాధపిల్లలై పోయారండి" రాజేశ్వరికి మళ్ళా ఏడుపొచ్చేసింది.

"ప్చ్! ఏడవకేడవకమ్మలూ! ఏం భయం లేదు. నేనున్నానుగా!" అని మళ్ళీ ఆమెని బుజమ్మీద తట్టి అన్నాడు మధుసూదన్‌రావు-"సరే లేచి గుడ్డలూ అవీ సర్దుకో"

"నేనిప్పుడవేమీ మొయ్యలేనండి బాబు గారూ! ఇలా కట్టు బట్టల్తో వెళ్ళిపోతాను, అంతే. అక్కడ నా పిల్లలూ, బావగారూ, మంగమ్మత్తయ్యా యింతమంది నా కోసం ప్రాణాలిచ్చేసే వాళ్ళుండగా ఈ దిక్కుమాలిన వుద్యోగం కోసం ఈ వూరొచ్చి ఇంత ఒంటరితనం, కష్టం, పాపం కొనితెచ్చుకున్నాను" మళ్ళీ ఏడవ సాగింది రాజీ.

"ఓకే, యాడవకు. నీ దగ్గిర వైజాగ్ వెళ్ళడానికి డబ్బుందా ?" అని జేబులో చెయ్యిపెట్టి పర్స్ బైటికి తీశాడు మధుసూదన్‌రావు.

"అమ్మబాబో, నన్నింకా చంపేకండి

బాబుగారు"యి. డబ్బు వుందండి బాబూ, మీరివ్వద్దండి నాన్నగారండి."

మంచం మీదుగా మేకున వేళ్ళాడు తున్న తన హ్యాండ్ బ్యాగ్‌లో డబ్బుతీసి జాకెట్‌లో పెట్టుకుంది.

"జాకెట్ మార్చవా అమ్మలూ"

ఉలికిపడి చూసుకుంది. ఎడమ రొమ్ము మీద అరచెయ్యంత మేర జాకెట్ ముక్క చిరిగి వేళ్ళాడుతూ వుంది పయట కిందుగా. "అమ్మో అమ్మో" అని ఆక్రందిస్తూ పెట్లోంచి జాకెట్టొకటి తీసుకుని పక్కగదిలోకి వెళ్లొచ్చింది.

"కప్పతాళం తీసుకో. నేనిప్పుడు నీకొక కానిస్టేబుల్ని ఎస్కార్ట్ ఇచ్చి రాజమండ్రి స్టేషన్‌కి పంపిస్తాను. ఆ తరవాత డాక్టర్ని తీసుకొచ్చి వీడి సంగతి చూస్తాను. అవసరమనిపిస్తే కేసు రిజిస్టర్ చేస్తే నీకు కబురు పెడతాను. అప్పుడు అల్లరి పెట్టకుండా నా స్టేషన్‌కొచ్చి నువ్వు స్టేట్‌మెంటు ఇవ్వాల్సిరావచ్చు అమ్మలూ! గుర్తుంచుకో. నడు జనతా ఎక్స్‌ప్రెస్‌కి సరిగ్గా అరగంట టైముంది. అయినా మూడుమైళ్లుంది రాజమండ్రి స్టేషను!..పద. ఆ తాళం ఇలాగిచ్చెయి"

* * *

కె. జి. ఆస్పత్రి ఔట్‌పేషంట్సు గేటు దగ్గిర స్కూటర్ వదిలేసి సాలి పేటలోకి నడుచుకుంటూ వెళ్లాడు రాజారావు చేతిలో ప్యాకెట్ జాగ్రత్తగా పట్టుకుని. సాయంకాలం అయిదుంపావు.

"మమ్మీ రాలేదా చిదా!" అని అడిగాడు గుమ్మం మీద కూర్చున్న చిదానంద్‌ని, కప్పతాళం పెట్టుకున్న ద్వారాన్ని చూసి.

తల అడ్డంగా ఆడించేడు చిదానంద్. ట్రాఫిక్ పోలీసు సైడు చెప్పినట్టు, చౌల్ట్రీ వైపు ఎడం చెయ్యి బారజాపి చూపించేడు. ఆ సిగ్నల్‌ని, కమల వచ్చి అటు వెళ్లిందన్నట్టుగా అర్థం చేసుకున్నాడు రాజారావు. "దా, మనం కూడా వెళ్దాం" అని చేతులు జాపాడు.

"డోంట్ కమ్"

దినకర్రావు ఫార్ములా ప్రకారం డోన్ట్‌కం అంటే (ఐ డోంట్ కమ్) "నేరాను" అని అర్థం కదా. "ఓ.కె. యు స్టే. ఐ గో" అని చిరునవ్వుతో చౌల్ట్రీవైపుగా నడిచే వెళ్లాడు రాజారావు.

"డోంట్ కమ్" అంటే రావద్దు నువ్వు అని కూడా అర్థం వుందేమో?

ఇంటిదాకావచ్చి, కుర్రాణ్ణి రమ్మని చేతులుజాపి వీడు రానంటే వెళ్లిపోతున్న రాజారావును చూసింది కమల, కొంత దూరం నుంచి. ఒ. పి. గేటు దగ్గిర బస్ దిగి నడిచి వస్తుంటే ఆయన స్కూటర్ కనబడింది. ఆ క్షణం నుంచీ నడకవేగం రెండు రెట్లకు పెరిగింది. ఆయనెంత సేపటి నుంచీ నుంచున్నారో అక్కడ అనుకుంటూ ఇల్లు చేరింది. అప్పటికి ఆయన కొంతదూరం వెళ్లిపోయాడు. చప్పట్లు కొట్టడం, కేకేసి పిలవడం బాగుండదని బిడియపడి వూరుకుంది కమల.

"ఏం చెప్పావురా అంకుల్‌కి!" అని అడిగింది, గుమ్మం యెక్కకుండానే.

ఉదయం తొమ్మిదిన్నరకి ఇద్దరూ కలిసే బయల్దేరతారు. వాడి స్కూలు పదింటికి.

అయిదు నిమిషాలు తక్కువ పదికి, వాణ్ణక్కడ వదిలి తన డ్యూటీ అయిదు గంటలదాకా చేసి, మళ్లా బస్సెక్కి వాడి స్కూల్‌కెళ్లి కలుసు కొంటుంది

కమల. బస్సులో, ఆఫీసులో, ఈ గంటల ఎడబాటులో కలిగిన వ్యథ అంతా వాడి మొహం చూసి మర్చిపోతుంది. నాలుగ్గంట లకే వాడి స్కూలు వదిలేస్తారు. గంట సేపు పైగా వాడు కలెక్టరాఫీసు వరండా మీద కూర్చునో, కలెక్టరాఫీసు వెనక గేటును ఆ ఇసకలో అటూ ఇటూ నడుపు తూనో, రెవెన్యూ గెస్టుహౌసు లాన్సులో ఏదో పిచ్చిమొక్క ఆకులు తుంచుతూనో గడుపుతాడు. ఎక్కడున్నా సరే తను రావడాన్ని దూరంనించి కనిపెట్టేసి పరు గెత్తుకుంటూ వస్తాడు.

మూడు వారాలనాడు రాజారావుగారు పద్మనివాస్ హోటల్ దగ్గర కనబడ్డం, తను దినకర్రావుగారి "నో" చిదాగాడి నోటంట విని పరవశిస్తూ వుండిన సమ యంలో ఆయన అయన్ని గుప్తుచెయ్యి డమూ, తను బ్రేక్‌డౌన్ అయిపోవడమూ, వరసగా నాలుగు రోజులు ఆయన తనని స్కూల్‌దాకా తీసుకురావడమూ, ముగ్గురు కలిసిహోటలుకి.. యింటికీ అదెంతో రిలీఫ్ తనకి అయినా వాడికినచ్చలేదు. 'వ్యయ్‌గో వాకింగ్ మమ్మీ' అన్నాడు మొదట. తరు వాత తను ఆయన స్కూటర్ మీద ఓ.పి. గేటు దగ్గిర కనపడగానే 'మమ్మీ టాటా' అంటూ పారిపోయాడింటివైపు బాధపడింది తను.

తరవాతి రోజునించీ పద్ధతిమారింది. తను స్కూటర్ మీద రానేకూడదు. బస్ లోంచే దిగాలి. అప్పటికి అవతలివైపున వాడు సిద్ధంగా వుంటాట్ట. పలకరింపూ, ముద్దులూ అయ్యాక ఇద్దరూనడిచి ఇంటికి రావాలిట. బాబోయ్, నేనెక్కను మీ స్కూటరు అనే పరిస్థితి తెచ్చిపెట్టాడు.

నిద్దట్లో కౌగిలించుకుని పడుకుంటాడు. మేలుకుంటే వీపులేదు, కడుపులేదు, మెడ లేదు, తొడలేదు, వాడిష్టం-ఎక్కడపడితే అక్కడ కూచుంటాడు. స్వారీ చేస్తాడు ఇటూఅటూ కాళ్ళేలాడేసుకుని. రాజారావు అంతటి వారు వీడికి భయపడి స్కూటర్ అక్కడెక్కడోపెట్టి నడిచి యింటిదాకా వచ్చి "మీ అమ్మ ఏదిరా నాయనా" అని అడిగివుంటారు పాపం. ఏం చెప్పాడో మరి ?

"ఏం చెప్పావురా అంకుల్‌కి?"

ఈ వెధవ ఏం చెప్పేడో, వారేం నొచ్చుకున్నారో? పాపం ఎందుకో ఇవాళ ఆయన ఆఫీసుకే రాలేదు. నన్ను చూడ కుండా వుండలేరు. ఏముందీ, ఆయన క్కూడా వున్నారుగా యిద్దరు! పిల్లలన్న పిల్లలు కారు రాక్షసి వెధవలు.

"వాళ్ళనా? అని ఎవరో నిగ్గదీసి నట్టయింది...నాకా హక్కులేదు- వాళ్ళు రాక్షసులనడానికి"

ఈరాక్షసుడు.. పోనీ ఈదేవుడేనమ్మా మహాతల్లీ.. వీడు చాలా మేలుచేసి ఆయ నన్నట్టు జరిగితే వాళ్ళూ నాకు బిడలేకదా! అలాగే చూసుకోగలను. ప్రామిస్! ఈ ఉడుకుడుకు మెతుకుల తిండీ, ఈ బస్సుల్లో నగుబాటు సలుసుబాటు ప్రయా ణాలు, ఈచాకిరీ మానేసి హాయిగా.. అంత జాతకమా? ......నో!... దగాపడు, మోసపో.. తల్లివికావు, చెల్లివికావు, పెళ్ళా నివీ కావు. కాంకుబిన్‌వి, దస్టుబిన్‌వి! అవే శానికీ, అజ్ఞానానికీ బానిసవై ఆహుతివై బతుకు పాడుచేసుకున్న చవటవి!

తాళం తీసి ఇంట్లోకెళ్ళింది కమల "కమిన్ చిదా!" అని కోపంగా కేకేసి.

ఏడుపొచ్చింది. మంచం మీద బోర్లా పడింది. ముందుకి జారిపోయే చెప్పలు. కాని ఒక్కటే జారింది. రెండో దాన్ని

విదిలించడానికూ్కడా ఓపిక లేదు. మొదటి జోడు దానంతటదే రాలి పోయింది. రెండో బంధం విదిలించుకో లేదు.

"కమలగారూ !" చెప్పులు విప్పి లోపలికొచ్చి పిల్చాడు రాజారావు.

కళ్ళలో చెమ్మని తల దిండుకి పట్టిం చేసి యిటు తిరిగింది కమల.

"విష్‌యు మెనీ హాపీ రిటన్స్ ఆఫ్ దిదే" అన్నాడు రాజారావు నవ్వుతూ.

అవును. సర్వీస్ బుక్ ప్రకారం యివాళే నా పుట్టినరోజు...

"థాంక్యూ సర్" నవ్వాలని ప్రయత్నం.

"మీకో చిన్న కానుక యివ్వగోర తున్నాను!"

ద్వారానికెదురుగా, మంచం వేపు తిప్పిన కుర్చీలో కూర్చున్నాడు. "కమ్ నియర్ చిదా డార్లింగ్" అన్నాడు.

ఆహ్వానంలోఆదరాన్ని తీవ్రంగాశంకిస్తు న్నట్టు, అంతలోనే ఆహ్వానంలో పిలుపు విస్మరించి పిల్లని సత్యం అని తెలిసినట్టు చేరాడు చిదానంద్ అతన్ని. కమల లేచి కూర్చుంది, అతనికేసి తిరిగి.

"గివిట్టు మమ్మీ" అని వాడి బుజం మీద తట్టాడు. కాగితం సంచి స్టేప్లర్ సీలు, లోపల మెత్తగా...

ఆ కుర్చీ నుంచి ఈ మంచం వరకు వచ్చేలోగా సీల్ ఊడదీసి, సంచి చివర్లు పట్టుకుని తిరగేసి వంచాడు చిదానంద్.

నూట ఇరవై వుంటుంది నూలు నెంబరు. తెలుపు రంగు. అసలు జరీ అంచు. బుటాలు. ఫాబ్రిక్ పెయింట్‌తో అక్కడక్కడ వేసిన చిన్నచిన్న అంద మైన బొమ్మలు. పాము పొరలావుంది ఆ గద్వాల్ చీర సరిగ్గా కమల పాదాల మీద పడింది. చిదానంద్ వూపిన వూపుకి.

"ఇడియట్ !" కొట్టబోయింది. అల్లరిగానె నా అందంగానే నవ్వుతూ లోపలి గదిలోకి పారిపోయాడు.

చీరతీసి కళ్ళ కద్దుకుంది కమల.



"థాంక్యూ సర్, కానీ అర్హత లేదేమో నాకు?" అంది.

"నాకు అర్హత వుంది కనకనే నేను తేగలిగాను. వాడు కూడా సరైన చోటనే పడేశాడు" రాజారావు నవ్వాడు.

"మీరలాంటి మాటల ద్వారా నన్ను అవమాన పరిస్తే నాకు బావుండదు సార్"

"అవమానం కాదు, అపహాస్యమూ కాదు. కేవలం హాస్యం అంతేలెండి. మీరేంటి ఇవాళ చాలామూడీగా వున్నారు.



లేచి, ఆ చీర కట్టుకుని నన్ను ఆనంద పర్చండి" అన్నాడు ఆమె దగ్గరకెళ్ళి, అభ్యర్థనతో బుజం మీద చెయ్యివేసి.

"మ మ్మీ!" కేకేస్తూ వచ్చాడు చిదానంద్. చేతిలో మండుతున్న కాగితం సంచి వుంది. "ఫైర్!" అని దాన్ని వాళ్ళిద్దరి మధ్యకి విసిరేశాడు.

రాజారావు కమల భుజం మీదున్న తన చెయ్యి అలాగే వుంచి ఆనుకుని, చెప్పులయినాలేని కాళ్ళతో ఆ మంటను ఆర్పబోయాడు. ఇటు ఆర్పితే అటూ, అటు ఆర్పితే ఇటూ మంట రేగింది. కవరంతా కాలి బూడిదైతేనే గాని అగ్ని చల్లారలేదు.

కమల లోపలికెళ్ళింది. కూడా చిదానంద్ వెళ్ళాడు. వెంటనే తిరిగొచ్చిందామె. "పొద్దున స్టవ్ పదే పదే ఆరిపోతూ అల్లరి పెట్టింది. ఆఖరి అగ్గిపుల్లతో బుడ్డి దీపం వెలిగించాను. ఆఫీసు కెళ్ళేటప్పుడు ఆర్పడం మర్చిపోయాను. దాంతో ముట్టించాడు"

"కీప్ ద హోం ఫైర్స్ బర్నింగ్'' అన్నాడు రాజారావు నవ్వుతూ, చీర అందించి "ఏం ఫర్వాలేదు లెండి. ఒక్కసారి చీర కట్టుకుని అందులో మీ సుందర స్వరూపాన్ని దర్శించనీయండి"

"ఇప్పుడొద్దుసార్. ఈ వెధవని చూస్తే భయంగా వుంది. తెల్లవారు జామున రండి. ఐదు ప్రాంతంలో వస్తే అప్పటికి అప్పుడైతే వాడు లేవడు. రేపు ఆదివారం కూడాను. అసలు జనవరి ఆరే నా బర్త్‌డే. ఐదని సర్వీస్ బుక్‌లో వుంది. రేపే" అంటూ అతని పాదం పరిశీలనగా చూసి "అరె! ఎంత మసి అంటుకుందో! రండి కడుక్కుని వెడుదురుగాని" అని అతన్ని లోపలికి తీసుకెళ్ళింది.

లోపలి గది తలుపు చాటున పిల్లిలా నక్కివున్న చిదానంద్ "బౌ" అని అరిచి ముందు గదిలోకి దూకాడు. "నాటీ బోయ్!" అంది కమల వాణ్ని చూసి నవ్వుతూ.

వంటగిన్నెలు తోముకునే సోడాపొడి వేసి కాళ్ళు రెండూ శుభ్రంగా కడుక్కుని ఇవతలి కొచ్చాడు రాజారావు. కమల అందించిన తువాలుతో తుడుచుకుని "వస్తాను" అన్నాడు. అతను గదిలోంచి వీధి గుమ్మంలోకి వస్తూ వుంటే, వీధి గుమ్మంలోంచి వారవారగా నక్కి నక్కి గదిలో కొస్తున్నాడు చిదా.

* * *

"బేగానే వొచ్చావే బాబూ యివేళ?" నవ్వకుండానే పలకరించింది మంగమ్మ-అతని స్కూటర్ చప్పుడు విని తలుపు తెరిచి.

"మరే..."

"ఎవరో ఒకబ్బాయొచ్చి ఇదుగో ఈ కార్డిచ్చి వెళ్ళాడు."

శ్రీమతి మరియు శ్రీ గోపీనాథరావు పిలుస్తున్నారు. వారి అన్నగారి మొదటి కుమార్తు కె.ఎన్. రామకృష్ణకు మద్రాసు కాపురస్తులు ఆర్. వి. అచ్చుతరావు కుమార్తె సరోజ నిచ్చి...

"ఆ అబ్బాయి రాజీ యెక్కండుందని అడిగాడయ్యా. అస్సల్లో అడిగితే యిక్కడుందన్నారంట-"

అతను రాజేశ్వరిని అంత సులువుగా మర్చిపోయినందుకు ఆగ్రహం వచ్చింది రాజారావుకి.

"ఎవరు బాబూ ఆ యబ్బాయి ?"

రాజారావు ఆవేశపడి చెప్పాడు. "రాజీని పెళ్ళాడుతానన్నాడు. రాజీ

నమ్మింది. గోతిలో తోసేవాడే. సమయానికి తను అడ్డుపడి తప్పించాడు. ఎవరో పెద్దమనిషి మద్రాసులో ఉద్యోగం యిప్పిస్తే అతగాడి కూతుర్నో, మేనకోడల్నో చేసుకుంటున్నాడు. పైగా తన ప్రయోజకత్వం, ప్రతాపం రాజీకి ఈ కార్డు పంపించి తెలియజెప్పాలని అహం!''

"ఆ యబ్బాయి ననుకోడందేనికి! రాజీని నువ్వే ఉద్యోగం చూసి రాయమంటి పంపేవుగా?"

"అయితే ?"

"ఏంటో నీకు చెప్పే పాటిదాన్ని గాకపోవచ్చుగానీ పిల్లల మొగాలు చూసైనా నువ్వు రాజీని ఈ యింట్లో ఉండమనచ్చుగదయ్యా"

"అంతే!"

"అంతే ఏముంది నాయనా! అనాధ పిల్ల అని తలచకుండా దాన్ని నువ్వూ, శాంతమ్మా కల్సి మంచి మనుసుతో చేరదీసి మనిషిని చేసేరు. పది సంవత్సరాలుగా రాజీ ఈ యింటి మనిషే అయింది. అయితే దానికి సదువూ, ఉద్యోగమూ అన్నావుగాని ఓ యింటి దాన్ని జేసే ఆలోచన జేసేవా? పిల్లలన్నా, నువ్వన్నా, కడకి నేనన్నా ప్రాణం యిచ్చేస్తాదే మరి! చెట్టంత కూతురు పోయి నేనా మాట అనలేక పోయినానుగాని ఈ పిల్లలకి తల్లి గావాలంటే అంతకంటె ఎక్కడుంది బాబూ? నీకామాత్రం తోచ లేదంటావా?"

రాజారావుకి ముచ్చెమటలు పోశాయి. "అదేం పని పిన్నమ్మా! రాజీ ఎక్కడ, నేనెక్కడ? చిన్న పిల్లాయె. ఎవరైనా మంచి కుర్రాణ్ణిచూసి చేద్దామనే అనుకుంటున్నానుగా"

"నీకన్నా మంచి కుర్రాడెక్కణ్ణుంచొస్తాడు బాబూ? చిన్నది చిన్నదంటావుగాని నీ కంటె ఏమంత చిన్నది గాదు. ఇవాళో రేపో పాతికేళ్ల వెళతాయి"

"ఇంతకీ నీకు దాన్నొక యింటిదాన్ని జేసే ఆలోచనకంటె ఈ యింటికి వేరే మనిషిని ఈ పిల్లలకి మారుటి తల్లిని తెద్దామని బుద్ధి గట్టిగా పుడితే నేనుగానీ, రాజీగాని నోర్లేని ఆ పిల్లలు గాని చేసేదేముంది నాయనా?"

"అట్లాగెట్లా గనుకున్నావు పిన్నమ్మా"

"సర్లే అడిగావుగనకా అంటున్నా. ఒక బంట్రోతుగాడి మాటవిని అంటున్నానని బాధపడకు నాయనోయ్. ఆ అమ్మాయి నేను జూశాను. సక్కదనాల సుక్కంటూ నికి ఎక్కడా డోకాలేదన్నమాట నిజమే, మొగుడొదిలిపెట్టాడో, పోయినాడో నీకు తెలీదట...నీకే తెలియాలి మరి. నీ దగ్గరే, నీ రూములోనే పని చేస్తాదన్నాడు అప్పన్న. మీరిద్దరూ ఆఫీసులో రెక్క తలుపు లేసుకుని ఊసులాడుకోడం, మధ్య మధ్య నువ్వు బెల్ కొట్టడం, ఎవరి స్థలాల్లో ఆళ్లుండడం చెప్పాడులే. అతగాడి మాటలు గట్టిగా పట్టించుకోనక్కర్లే - ఇంతుంటే అంత చేస్తాది లోకం...

రాజారావుకు భయం వేసింది. కనపడే నిజం అదే అయినా, కనపడని నిజం వేరేవుంది కదా?

"డాడీ! నీ స్కూటర్ బ్యాగ్‌లో స్వీట్సు!" అని పొట్లాం పట్టుకుని పరుగెత్తు కొచ్చింది పాప. దాని వెనకే పరుగెత్తుకొచ్చాడు బాబు కూడానూ. వాడి చేతిలో ఒక చీర చెంగు వుంది. ముందు గదిలో నుంచి స్కూటర్ వరకు పరచుకుని ఉన్న ఆ నిండు చీరని వాడు చరచరా లాక్కొస్తూవుంటే రాజారావు

ఏదో రహస్యాన్ని రస్తా కీడ్చినట్టు వణికి పోయాడు.

ఆ చీర కమలది. తన స్కూటర్‌లో కెలా వొచ్చింది?

"ఈ శారీ ఎవరిది డాడీ? మమ్మీదని పాప, కాదని నేనూ..."

"షటప్, రాస్కెల్!" అని కోపంతో బాబును ఒక్కటి కొట్టాడు రాజారావు. వాడు ఒక వెక్కుతో ఏడ్పు ప్రారంభించి మంగమ్మ చాటుకి చేరాడు.

"అయమ్మాయిదేగా బాబూ చీర? మీరిద్దరూ కలిసి ఇవ్వాళ ఎక్కడికో ఎళ్ళుంటారు. సాయంకాలం ఇంటికాడ దించినప్పుడు తీసుకోటం మర్చిపోయుం టాది"

'ఆ వెధవ చిదానంద్‌గాడు...!

కాలికి మసి అంటుకుందని కడుక్కో డానికి తను లోపలి గదిలోకి వెళ్ళిన సమ యంలో ఈ చీర తెచ్చి తన స్కూటర్ బ్యాగ్‌లో పెట్టాడన్నమాట!

ఇప్పుడే కాదు.

కమల ఇంటికి తను వెళ్ళిన ఇన్ని సార్లూ కూడా...

వాడు ఏదో విధంగా నిరసన తెలియ జేస్తూనే వున్నాడు!

కమల వైపు తను అభిమానంగా ఆత్మీ యంగా చూస్తేచాలు వాడు వాడి సొత్తేదో నేను ఎత్తుకుపోయినట్టు ప్రవర్తిస్తూనే వున్నాడు. వాడి సొత్తేనేమో మరి?

* * *

నాలుగున్నరకి ఠంచన్‌గా మోగింది అలారం. గదిలోంచి బయటికి రాకుండానే గడ్డం చేసుకుని, పళ్ళు తోముకుని, మొహం కడుక్కుని నిశ్శబ్దంగానే ఇవతలి కొచ్చాడు. సాధ్యమైనంత తక్కువ చప్పుడులో చన్నీళ్ల స్నానం చేసేడు.

తెల్లచొక్కా, తెల్ల పాంటూ తొడు క్కున్నాడు. వీధితలుపు తెరిచి స్కూటర్ తీసి, రోడ్డుమీద పెట్టాడు. లోపలికెళ్ళి పెద్ద కప్పతాళం తెచ్చి, వీధి తలుపు బైట గడియపెట్టి తాళం బిగించాడు. స్కూటర్ స్టార్ట్ చేసిన మరుక్షణం కమల చీర...రాత్రి ఆందోళనకి కారణ మైన చీర తన బెడ్‌రూంలో పరుపుకింద కవర్లో వుండిపోయినట్టు గుర్తొచ్చింది. చకచకా లోపలికెళ్ళి తెచ్చాడు. మళ్ళీ తలుపు వేసి, బైట గడియపెట్టి తాళం బిగిస్తున్నాడు.

హఠాత్తుగా కాళ్ళ దగ్గిర ఒక మానవా కారం,తన కాళ్ళకు పెనవేసుకొంటోందని తెలిసింది.

"లే లే ఏమిటి చాదస్తం! నేను ఉన్నానుగా!" అన్నాడు. కమల తనం తట తానుగా తెల్లవారు జామునలేచి, తలంటిపోసుకుని, కొత్త చీర కట్టుకుని, పిల్లవాడు అక్కడైతే ఏం అల్లరి సృష్టి స్తాడో అని సరాసరి ఇక్కడికే వచ్చిం దన్న మాట.

"మీరున్నారనే వొచ్చేశాను బావ గారూ'' రాజేశ్వరి గొల్లున ఏడుస్తూ చెప్పింది.నాకా వుద్యోగం వద్దు, ఆ జీతం వద్దు. ఆ ఓవర్ టైములూ వద్దు! నాకీ యిల్లూ, పిల్లలూ, మీరూ ఉంటే చాలు నేను చచ్చిపోకుండా, నాశనం అయిపో కుండా కాపాడండి బావగారూ.''

రాజారావు ఆమెని లేవనెత్తాడు; కంగారులోంచి వెంటనే బయటపడి.

తాళం తెరచి ఆమెని లోపలికి ప్రవేశ పెట్టాడు.

''కుడికాలు వెయ్యి. ఎందుకయినా మంచిది" అన్నాడు. *

## నకిలీ వేలు

పిల్లలు బొటన వేళ్ళు నోట్లో పెట్టుకొని చప్పరించటం మనం సాధారణంగా చూస్తుంటాం. మరందులో ఏ అమృతం దాక్కుందో గాని పిల్లలు ఈ అలవాటుని ఓ పట్టాన వదిలిపెట్టరు. కానీ క్లీవ్‌లాండ్‌లో జాకబ్ బర్నార్డ్ అనే పిల్లాడికి అసలు బొటనవేలే లేదట. దాంతో వాడు చీకడానికేంలేక చక్రవాక రాగంలో ఆలాపన మొదలెట్టేసరికి తల్లి



దండ్రులు కంగారుపడి పిల్లాణ్ని బొటన వేలి ఆపరేషన్‌లో సిద్ధహస్తుడైన డా॥ ఫారిమ్సన్ దగ్గరికి తీసికెళ్ళి చూపించారు. 1978 అక్టోబర్లో పుట్టిన జాకబ్‌కి ఎనిమిది వేళ్లు మాత్రమే వున్నాయట.

ఫారిమ్సన్ ఆ కుర్రాడికి 2 గంటల సేపు ఆపరేషన్ చేసి బొటన వేళ్లు మార్చేడు. పూర్వం పాదాల్తో ఆట వస్తువుల్ని పట్టుకునే జాకబ్ ఇప్పుడు చక్కగా చేత్తో వాట్ని పట్టుకొని విరగ్గొట్టి యధాశక్తి నాశనం చేస్తూ, తన కొత్త వేళ్ళని చూసుకొంటూ ముచ్చట పడుతున్నాడు. అయితే ఈ శస్త్ర చికిత్స చాలా శ్రమతో కూడుకొన్నదని, చూపుడు వేలిని కొంత మేరకు కత్తిరించి బొటన వేలి స్థానంలో అమర్చవలసి వుంటుందని, ఆ సమయంలో ఎముకని కూడా కత్తిరించవలసి వుంటుందని మౌంట్ సినాయ్ హాస్పిటల్‌లో ఆర్థోపెడిక్ విభాగానికి డైరెక్టరయిన డా॥ ఫారిమ్సన్ అంటున్నాడు.

## దొంగమహాత్ములు

దొంగల్లో కూడా మహానుభావులున్నారనడానికి నిదర్శనంగా కొన్ని సంఘటనలు జరుగుతున్నాయి ఈమధ్య. అరవై మూడేళ్ళ న్యూ మాల్డెన్ నివాసి మేజర్ బ్రియాన్ సీవెల్‌గారు తమ సతీమణి రినాటాతో టూరుకెళ్తే ఇద్దరు చోర మహాశయులు నిరాటంకంగా వాళ్ళింట్లో జొరబడి, ఆ ఇంటిని యదేచ్ఛగా ఆడపెళ్ళివారి విడిదిలా ఉపయోగించుకున్నారు. పోయేటప్పుడు యధాశక్తి 22 వేల పౌండ్ల ఖరీదు చేసే సామగ్రి, వంశపారంపర్యంగా వస్తున్న కొన్ని విలువైన వస్తువులు ఆభరణాలు పట్టుకుపోయారు. అయితే వెళ్ళిపోయేముందు ఇంటిని శుభ్రంగా వూడ్చి మరీ వెళ్ళిపోయార్ట.

డబ్బు పోయినందుకు బాధగా వున్నప్పటికీ ఇంటిని మాత్రం శుభ్రంగా క్లీన్ చేసినందుకు మురిసిపోయాడా పెద్దమనిషి. ఇంకా దొంగిలింపబడ్డ వాట్లో తన పదవీ కాలంలో అతని పనిని మెచ్చి ప్రభుత్వం వారు బహూకరించిన అనేక వెండి




ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుంది. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.




నోటి దుర్వాసనను ఆపండి...
కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో
దంతక్షయాన్ని
ఎదుర్కోండి!

DC.G.74 TL

కప్పులు, ఇంకా వాళ్ళ పూర్వీకుల బహుమానాలు వున్నాయని చెప్పేడాయన.

ఇటీవల జరిగిన మరో కేసులో కూడా ఇంకో విచిత్రమైన సంఘటన జరిగింది. ఓల్వార్ ఆంప్టన్‌కి చెందిన టెట్టిన్ హాల్‌లో ఒక ఇంట్లో వున్న పురాతన వస్తువులకోసం ప్రవేశించిన దొంగలు హాయిగా వంటింట్లోదూరి కావల్సిన వంటకాలు తయారుచేసుకుని, విస్కీ, బ్రాండీలతో వాట్ని హాయిగా ఆరగించేరు. తర్వాత బెడ్‌రూంలో దూరి కాస్సేపు డాన్సు చేసేరు. ఆనక 6 వేల పౌండ్ల విలువగల పురాతన వస్తువుల్ని మూట



గట్టి వెళ్ళిపోయేముందు తాము పగలగొట్టిన కిటికీ అద్దాలు రిపేరు చేసేందుకు మనుషుల్ని పిలిపించి రిపేరు చేయించి మరీ వెళ్ళిపోయారు.

ఇంకో ఇంట్లో ఖాళీగా వున్న గదిలో దూరి నగ్నంగా పడుకున్న ఓ యువతిని ఆ ఇంటివాళ్ళు పోలీసుల కప్పజెప్పేరు. కానీ ఆమె దొంగతనం కోసం ఆ ఇంట్లో దూరలేదని రుజువైంది. పోలీసులెంత ప్రయత్నించినా ఆమె నోరు విప్పలేదు. చివరికి విసుగెత్తి ఆమెని పిచ్చాసుపత్రిలో చేర్పించేరు.

ఇవన్నీ చూసి పోలీసులు విహారయాత్రలకి బయల్దేరే పడుచు, ముసలి జంటల్ని ముందు ఇళ్ళని 'చోర దుర్భేద్యంగా' తయారుచేసి గాస్, విద్యుత్ సరఫరా ఆపేసి మరీ వెళ్ళమని సలహా ఇచ్చేరు.

## తిట్ల పోటీ

మధ్యప్రదేశ్‌లో చింద్వారా ప్రాంతంలో బహ్రా జిల్లాలో ఓ విచిత్రమైన అలవాటు ఉంది. అక్కడ ముజ్వాలా అనే ఓ చిన్న నది వుంది.

ప్రతి సంవత్సరం ఈ నదీ తీరాన జాతర జరుగుతుంది. ఇది ముగియడానికి ముందు ఆ గ్రామంలోని యువతీ యువకులు నది రెండువైపులా విడివిడిగా నిలబడతారు. ఒక ఒడ్డున యువకులు, మరో ఒడ్డున యువతులు నిల్చుని తిట్ల పోటీ ప్రారంభిస్తారు. ఈ పోటీలో ఎవరు ఎక్కువ అసహ్యంగా, జుగుప్స కలిగేలా హావభావాలు ప్రదర్శిస్తే వారు గెల్చినట్లు.

తర్వాత యువతీ యువకులు తమ స్థానాలను మార్చుకుంటారు. యువకులు ఇవతలి ఒడ్డుకు, యువతులు అవతలి ఒడ్డుకి చేరతారు.

యువతులు మాత్రం తమ దుపట్టాలను ఇవతలే ఒదిలేస్తారు. యువకులు ఒక దుపట్టాను తీసుకొని దాని తాలూకు యువతిని ఒక సంవత్సరం పాటు భార్యగా చేసుకొంటారు.

ఈ జాతర ఇప్పటికీ ప్రతి



సంవత్సరం జరుగుతూనేవుంది. అయితే ఆ పోటీ మాత్రం ఆపివేయబడింది.

## మాయమవౌతున్న ఓడలు

ప్రపంచచరిత్రలో మనుషులే కాదు వాహనాలు, సరకులు కూడా అంతు తెలీకుండా మాయమయిన సంఘటనలున్నాయి. కొన్నేళ్ళక్రితం 650 మంది ప్రయాణీకులను తీసుకు వెళుతున్న ఓ ఫ్రెంచి నౌక ఉన్నట్లుండి మాయమయింది. ఈ నౌకలో మిలటరీ టాంకులు, జీపులు, భారీ ఆయుధాలు కూడా వున్నాయి. నౌక తాలూకు ఒక్క అవశేషమయినా దొరకలేదు కనీసం. ఆ మనుషులు, ఆయుధాలు, వాహనాలు ఏమయిపోయాయో కనీసం ఊహకయినా అందలేదు. ఇంతకన్నా పెద్ద విచిత్రం 1872 లో జరిగింది. 'ఐరన్ మౌంటెన్' అనే ఓ పెద్ద ఆవిరి ఓడ 555 మంది ప్రయాణీకులతో పసిఫిక్ సముద్ర జలాల్లో ప్రయాణిస్తోంది. కోస్టల్ గార్డ్స్ దాన్ని గమనిస్తూనే వున్నారు. వాళ్ళు ఓడ లంగరు నీళ్ళమీద తేలడమదీ చూసి అది వున్న ప్రదేశాన్ని రికార్డ్ చేసుకున్నారు. ఇంతలో అకస్మాత్తుగా అది మాయమయింది. పోనీ తుఫానువచ్చిందనడానికి ఆధారాలు లేవు. సముద్రం ప్రశాంతంగానే వుంది. ఈ మాయల కర్థం ఏమిటో ఎంత తల బద్దలు కొట్టుకున్నా సైంటిస్టులకు కూడా అర్థమై చావడంలేదు. ఇవిలా మాయమవడానికి నిగూఢమైన అయస్కాంత కేంద్రాల్లాంటి వేమన్నా కారణమవుతున్నాయేమోనని శాస్త్రజ్ఞులు వీటికి శాస్త్రీయ కారణాలు వెతికే ప్ర



యత్నంలో వున్నారు. వీరి ప్రయత్నాలు ఫలించేవరకూ ప్రజలు అతీత శక్తులమీదనే ఆధారపడతారు మరి.

## ప్రాణం తీసిన హాబీ

ఇంతకు ముందు హత్యలు వగైరాలు డబ్బు దస్కం, బంగారాలకోసమే




జరిగేవి సాధారణంగా. ఈ రోజుల్లో పోస్టల్ స్టాంపులతో సహా హత్యలకు కారణమవనివిషయమంటూలేదు. 1852లో స్టాంపుల సేకరణలో ఖ్యాతి వహించిన గస్టన్ లియోరన్ పారిస్‌లోని అతని ఇంట్లో విచిత్ర పరిస్థితుల్లో హత్యచేయబడ్డాడు.

అతని హత్యా కారణం తెలుసుకోడానికి పోలీసులు కిందా మీదా పడినా లాభం లేకపోయింది. అయితే అతన్ని డబ్బు కోసం చంపలేదన్న విషయం మాత్రం తెలిసింది. ఈ కేసుని గూఢచార శాఖ వారికి అప్పగించారు. వీరు కొన్ని రోజులు



తీవ్ర ప్రయత్నాలు చేశాక ఓ గూఢచార శాఖ అధికారికి కొన్ని ఆధారాలు దొరికేయి.

ఈ అధికారి గస్టన్‌లియోరన్ సేకరించిన స్టాంపులను పరిశీలిస్తుండగా అరుదైన స్టాంపుల్లోని ఒక తపాలా బిళ్ళ మాయమవడం గమనించాడు. మాయమైన స్టాంపు రెండు సెంట్ల విలువగల అరుదైన హవాయ్ దేశపు స్టాంపు. దీంతో లియోరన్ హత్యా రహస్యం మబ్బులా విడిపోయింది. పోలీసులు పారిస్‌లోని స్టాంపుల సేకరణ దారులను వివరాలు సేకరించడం ప్రారంభించారు. తీవ్రమైన పరిశోధన అనంతరం లియోరన్ వద్ద మాయమయిన స్టాంపుకోసం విక్టర్ గిర్గా అనే స్టాంపు సేకరణ దారుడు తీవ్ర ప్రయత్నాలు చేశాడని తెలుసుకున్నారు. సదరు విక్టర్‌ని పట్టుకొని పోలీసు పద్ధతులు ఉపయోగించేసరికి విక్టర్ తనెంత బతిమిలాడినా లియోరన్ ఆ స్టాంపు తనకివ్వడానికి ఒప్పుకోలేదని అందుకే అతణ్ని హత్య చేసానని అంగీకరిం.. ..డు. విక్టర్‌ని విచారించి శిక్ష విధించారు. చివరికి రెండు సెంట్ల పోస్టల్ స్టాంపు ఓ హత్యకి కారణమయింది.

## చిల్లరదొంగలు

ఇటీవల కలకత్తా నగరంలో జరిగే దొంగతనాల్లో బల్బులు, డ్రైనేజి కవర్లు, రెయిలింగ్స్, పంపుగొట్టాలు, ఫ్లోరోసెంట్ ట్యూబులు, భూగర్భ టెలిఫోన్ కేబిల్స్ కూడా 'హుష్‌కాకీ' అయిపోతున్నాయిట. విద్యుచ్ఛక్తి కొరతవల్ల దీపాల్లేక చీకట్లో తడుముకుంటూ డ్రైనేజీల్లో చాలా మంది పడిపోయి దెబ్బలు తగిలించుకుంటున్నారు. కలకతా మెట్రోపాలిటన్ డెవలప్‌మెంట్ అథారిటీ వాళ్ల లెఖ్ఖల ప్రకారం తలకాయలు లేని పంపుల్లోంచి వృధా అవుతున్న నీటి విలువ సుమారు పన్నెండు కోట్లుగా అంచనా వేయబడింది. ఇత్తడి తలల్ని మార్చి పంపులకి ఇనుప తలల్ని అమర్చినప్పటికీ అవి కూడా దొంగల జేబుల్లో చోటుచేసుకుంటున్నాయిట. ఇనుము ధరకూడా ఎక్కువ అవడం వల్ల, ఇనుప

# తెలుగు సినీ పత్రికారంగంలో
# నూతనాధ్యాయం!

సునిశిత హాస్య వ్యంగ్య
రచనలతో,
మీకోసం ప్రత్యేకంగా
తీయించిన
తారల ఛాయాచిత్రాలతో,
తాజా వార్తలతో

తారల ముచ్చట్లతో
ప్రతిపేజీ వినూత్నంగా,
ఆకర్షణీయంగా
వెలువడుతున్న రంగుల
హరివిల్లు

# జ్యోతిచిత్ర



## అనన్య ప్రచారం కలిగిన తెలుగు సినీ వారపత్రిక

డ్రైనేజీ మూతలు, ఒక్కటేమిటి అందు బాటులో వుండేవన్నీ స్వాహా చేస్తున్నార్ట.

పార్కుల్లో, చర్చిల దగ్గర ఉండే రెయి లింగ్స్ కూడా వీళ్లు వదిలిపెట్టలేదు.

కలకత్తా బ్యూటిఫికేషన్ సొసైటీ వాళ్లు రూ 3,000 ఖర్చుతో బస్ షెల్టర్లు నిర్మిస్తే రూఫ్‌లు, రెయిలింగ్స్ కూడా అనవాళ్లేకుండా మాయంచేసారు చోర్మాగే సరులు. ఇహ వీథుల్లో ఎన్నో దీపం స్థంబాలు బల్బులు లేకుండా ఉన్నాయి. ఆఖరికి ఈ బాధ పడలేక సి. ఎమ్. డి. ఎ. వాళ్ళు ఇంకెక్కడా ఉపయోగపడని





మెర్క్యురీ వేపర్ లాంప్స్ వాడటం మొద లెట్టారు. దానితో ఈ బల్బుల దొంగతనాల బెడద కొంతవరకు తగ్గింది.

# గోవర్ధనగిరిధారులు

ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడు చిటి కెన వేలితో గోవర్ధన పర్వతాన్నెత్తి భక్తుల్ని కాపాడాడని విన్నాం. కానీ బిజా పూర్లో చూపుడు వేలితో వివిధ పరిమా ణాల్లో వున్న రాళ్ళని ఎత్తొచ్చని కొందరు నిరూపించారు. కాకపోతే రాళ్ళనెత్తే సమ యంలో బిజాపూర్ దుర్గాధిపతి ఖ్వాజా అమీనుద్దీన్ నామోచ్చారణ మాత్రం తప్పనిసరిగా చేయాల్ట.

చిన్న సైజు రాయిని ముగ్గురు, అంత కంటే కొంచెం పెద్దగా వున్న రాయిని అయిదుగురు, తర్వాత పరిమాణాన్ని బట్టి ఏడుగురు, తొమ్మండుగురు పదకొండు, మంది చొప్పున మోయాల్సుంటుంది.

మామూలుగా అయితే ఒక మనిషి రెండు చేతులూ ఉపయోగించి ఎత్తితేగానీ అన్నిటికన్నా చిన్న రాయి కదలదు. ఇహ మిగిలిన పెద్ద సైజు రాళ్ళని విశ్వ ప్రయత్నంతో భూమినుంచి మహా అయితే ఒక అంగుళం ఎత్తగలమేమో. అంతకు మించి సాధ్యపడదు. మరి ఖ్వాజా అమీనుద్దీన్‌గారి పేరులో మహత్తో, మోసే వ్యక్తులు చేసే గారడీ ఎత్తోగానీ చూపుడు వేలితో ఈ నల్లరాళ్ళని సునాయాసంగా ఎత్తేసి వీరు అపర శ్రీకృష్ణులుగా చెలామణి అవుతున్నారు.

FORM IV [See Rule 8]

Statement about ownership and other particulars of CHATUR

| | | |
|---|---|---|
| 1. | Place of Publication | : 6-3-570, Eenadu Compound, Somajiguda,Hyderabad-500 004 |
| 2. | Periodicity of its Publication | : Monthly |
| 3. | Printer's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India | : Yes |
| | If Foreigner, state the country of origin | : —— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda,Hyderabad-500 004. |
| 4. | Publisher's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India | : Yes |
| | If foreigner, state the country of origin | : —— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda,Hyderabad-500 004. |
| 5. | Editor's Name | : RAMOJI RAO |
| | Whether citizen of India ? | : Yes |
| | If foreigner, state the country of origin | : —— |
| | Address | : 6-3-570, Eenadu Compound, Somajiguda,Hyderabad-500 004. |
| 6. | Names and addresses of Individuals who own the news paper and partners or share holders holding more than one per cent of the total capital. | : VASUNDHARA PUBLICATIONS 6-3-570, Eenadu Compound, Somajiguda,Hyderabad-500 004. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

for VASUNDHARA PUBLICATIONS.

Date:
March 1, 1981.

Sd/- RAMOJI RAO
Publisher.

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd.No. H/HD/402